



ముఖచిత్రం : భామనే సత్యభామనే...

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

5 సంవత్సరాలు గ్యారంటీ గల మెరి సూపర్ స్పెషల్ బంగారు కవరింగ్ నగలను 15 సంవత్సరాల పరిశోధన ఫలితంగా – భారత దేశంలో ప్రప్రథమంగా తయారు చేస్తూ, దేశమంతటా విరివిగా వి. పి. పి. ద్వారా పంపే సంస్థ. ఉచితంగా కేటలాగ్ పొంది అన్ని వివరాలు చూడగలరు. ఇందులోని సంఖ్యలు సూచిస్తూ, ఉత్తరం రాస్తే, వి. పి. పి. ద్వారా వస్తువులు పంపబడతాయి.

(వి. పి. పి. చార్జీలు అదనం)




**MERI GOLD COVERING WORKS.** (Estd 1963)
P O BOX 1405, 14, RANGANATHAN STREET
T NAGAR MADRAS-600 017 INDIA

# చందమామ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 43 జూన్ 1981 సంచిక 6


ప్రపంచ తెలుగు మహాసభలు మలేసియాలో జరిగాయి. దాదాపు వెయ్యిమంది ప్రతినిధులు ఆంధ్రప్రదేశ్ నుంచి అక్కడికి వెళ్ళివచ్చారు. మరొక అంతమంది మలేసియా వెళ్ళలేక నిరుత్సాహులై వూరుకున్నారు. ఆ సభలకు ప్రతినిధుల ఎన్నిక విషయంలోనేమి, వారి ప్రయాణ సౌకర్యాల విషయంలో నేమి అనేక విమర్శలు వచ్చాయి. ఆ విషయాలను గురించి మేము ఏమీ ప్రస్తావించదలచుకోలేదు. కాని, అసలు ఆ సభలను జరిపే పద్ధతిని గురించే ఒకటి రెండు సూచనలు చెయ్యదలచాము.

ఇకముందు ఇలాంటి సభలను మన దేశంలోనే జరపడానికి ప్రభుత్వం నిశ్చయించిందని ఒక ప్రకటన వచ్చింది. అదే నిజమైతే చాలా సంతోషించవలసినదే. ఏమంటే, విదేశాలలో కొన్ని తరాలుగా స్థిరపడిపోయి, తెలుగు భాషను, తెలుగు సంస్కృతిని పూర్తిగా మరిచిపోయిన తెలుగు కుటుంబాలకు తెలుగుదేశంతో కొంత సంబంధం వుండేటట్టు చూడడం మాత్రమే మనం ఒక లక్ష్యంగా పెట్టుకోవాలి. తెలుగుభాషను నేర్చుకోవడానికీ, తెలుగు సంస్కృతిని

... ... ... ... ... మనం వెల్లడించాలి. ఆ దేశాలకు వెళ్ళి మనలను గురించి మనం నేర్చుకొనేది ఏమీలేదు. ఆ దేశాలలో వున్న తెలుగు వారికి, తమ పూర్వీకులకు మాతృభూమి అయిన తెలుగుదేశాన్ని గురించి పూర్తిగా తెలుసుకొనే అవకాశాలను మనం కల్పించాలి. సభలను మన దేశం లోనే జరిపి, ఆ దేశాల నుంచి ప్రతినిధులను మన దేశానికి ఆహ్వానించి, తెలుగుదేశాన్నీ, తెలుగుదేశ ప్రజల ఆచార వ్యవహారాలనూ చూసివెళ్లే ఏర్పాటు చెయ్యాలి.

అయితే, విదేశాల నుంచి వచ్చిన తెలుగువారు, ఆ దేశపు ఇతర ప్రజలందరి లోనూ తామూ ఒకరమేననే భావంతో వుండాలిగాని ఆ దేశపు ప్రజలలో తాము విదేశీయులమనే భావం పెంపొందించుకోకూడదు. దానివల్ల ఆ దేశపు ప్రజలకు, ఎన్నో తరాలుగా అక్కడ వున్న తెలుగువారు పరాయివారనే భావం కలుగుతుంది. దానివల్ల వారికి క్రమేణా అనేక ఇబ్బందులు కలుగవచ్చును. ఆఫ్రికాలోని అనేక దేశాలలో అనేక తరాలుగా వున్న భారతీయులను ఆ దేశీయులు బైటికి పంపించివెయ్యడం మనం ఎరిగిన సంగతే. అలాటి విషమ పరిస్థితి, విదేశాలలో వున్న తెలుగువారికి మనం కల్పించకూడదు. తరతరాలుగా విదేశాలలో నివసిస్తూ, ఆ దేశాల పౌరులుగా, తక్కిన ప్రజలతో హాయిగా కాలంగడుపుతూవున్న తెలుగువారికి అనవసరమైన, పీడాకరమైన భేదభావాలు ఎంతమాత్రం రాకూడదు. అలాటి భేదభావం వచ్చే పని ఏమీ మనం చెయ్య కూడదు. ఆ దేశాలలో వున్న తెలుగువారు, ఆ దేశాలలోని యితర ప్రజలతో బాటు కష్టసుఖాలు పంచుకొని ఆ దేశపు పౌరులుగానే వుండాలిగాని, మేము వేరు, మాకు ప్రత్యేక సౌకర్యాలు కావాలి అనే భావం తెచ్చుకున్నట్లయితే, చాలా చిక్కులను అనుభవించవలసివస్తుంది.

తమ పూర్వీకుల దేశం ఏదో, అక్కడి ప్రజల జీవితం ఎలా వుంటుందో తెలుసుకొనే కుతూహలం, విదేశాలలో వున్న తెలుగువారికి వుండాలి. వారు మన దేశానికి వచ్చి, ఇక్కడి మంచిచెడ్డలను చూసుకొని వెళ్ళాలి. అలా వచ్చి పోయేవారికి మనం ఆతిధ్యం ఇవ్వాలి. వారికి అభిలాష వుంటే, తెలుగుభాషను బాగా నేర్చుకొనే సౌకర్యం మనం కలిగించాలి. అంతేకాని, మనం తండోప తండాలుగా అక్కడికి వెళ్లి, స్థిరపడిపోయిన జీవితాలలో, అనవసరమైన కొత్త భావాలను రేకెత్తించకూడదు.

---

# జరుగుతున్న చరిత్ర

ఈ పంక్తులందేలోపల పోలాండ్ ఏమై పోతుందో తెలియదు. ఆ సీమలో ఏర్పడిన క్లిష్టమైన పరిస్థితి పూర్వం హంగరీ, జెక్ సీమలలో సంభవించిన గందరగోళాల వంటిది కాదు. అఫ్గానిస్తాన్ వంటిది అసలేకాదు.

ఒక రాజ్యపద్ధతి కొనసాగేటప్పుడు కొన్ని చిక్కులు రాకతప్పవు. అనుకున్నట్టుగా పురోగమనం వుండదు. నిత్యావసరాల సప్లయి తగ్గి, ధరలు హెచ్చుతవి. ఆర్థికంగా పుష్టిని పొందడానికై తెచ్చుకున్న అప్పులు తీరవు- వడ్డీలు పెరిగిపోతవి; ఋణదాతలు రాయితీలిచ్చి మళ్ళీ అప్పులిచ్చి ఆర్థికస్థితిని పెంచితే తప్ప పాత అప్పులు తీరవు. అభివృద్ధికై తెచ్చుకున్న సామగ్రి వినియోగానికి రాదు.

ఎర్రటి రాజ్యం ఆ సీమలో వచ్చిన తర్వాత కొన్నాళ్ళకు, ఆ పిమ్మట 1970 లో, ఇప్పుడు మళ్ళీ ప్రస్తావించిన అంశాలతో నిండిన పరిస్థితులు ఏర్పడినవి. ప్రభుత్వం - ప్రజలు సతమతమై సర్దుబాటు చేసుకుని లోగడ గట్టెక్కినారు. అవకాశం ఇస్తే, ఇప్పుడూ గట్టెక్కగలరు.

ఆ సీమలో, ఇతర ఎర్రటి రాజ్యాలలో - రుమేనియావంటి రాజ్యంలో మినహా - పట్టు విడుపులు లేనివారు కొందరున్నారు. వీరు పోలాండు ప్రభుత్వంలో, కమ్యూనిస్టు పార్టీలో, ప్రజా సంస్థలలో వున్నారు. వీరి వల్లనే ప్రతిష్టంభన ఏర్పడినది. ప్రతిష్టంభన పరిష్కారం కాకుంటే, 'సాయానికి మేం వస్తాం' అని మిగిలిన ఎర్రటి రాజ్యాలలోని వారంటున్నారు; ప్రవేశానికి సైనిక దళాలు సరిహద్దున సిద్ధంగానే వున్నవి.

అట్టి సాయం ప్రస్తావన కూడదు- 'దీనికి మా నిరసన' అంటూ డచ్ కమ్యూనిస్టుపార్టీ తెలియజేసింది.

పోలాండ్‌లో పరిశ్రమల నిర్వాహకులు- వర్కర్ల నాయకులు సమ్మెల విషయమై, పనిగంటల విషయమై, శనివారపు సెలవుల విషయమై సమాధానపడే వీలున్నది. పార్లమెంట్ తీర్మానం ప్రకారం అట్టి సమాధానం కుదిరే అవకాశం వున్నది. ముందుగా వర్కర్ల సంస్థల ఆమోదాన్ని పొంది, పార్లమెంట్ తీర్మానం చేసివుంటే, ఇంకా బాగా వుండేది.

జనవాక్యం ప్రకారం ఇప్పటి పోలిష్ ప్రధాని ఉత్తముడు, సరసుడు, సామరస్యాన్ని కోరేవాడు. వర్కర్లను సత్యాగ్రహ విధానంలో నడిపించిన నాయకులు

---

*మంచి జగన్నాథం*

---




సమర్థులు, నిగ్రహశక్తి గలవారు. మనం పరస్పరం శత్రువులము కాము— అనే భావం ఉభయపక్షాలకూ వున్నది.

అసమ్మతివాదుల విషయంలో అపోహలు వద్దనీ, వారిని విడుదల చేయవలసిందనీ వర్కర్లు పట్టుబట్టినారు. తమ సంఘాలను తామూ, అట్లే కర్షక సంఘాలను కర్షకులు, విద్యార్థి సంఘాలను విద్యార్థులు నడుపుకునే స్వేచ్ఛను కలిగి వుండవలెనని కూడా వారు పట్టుబట్టినారు.

కమ్యూనిస్టుపార్టీ అధ్వర్యాననే పరిపాలన జరగవలెనని అందరు అంగీకరిస్తున్నారు. కాని, ఇతర ప్రజాసంఘాల నిర్వాహకులు అనుభవించబోయే స్వేచ్ఛ మితిమీరి కమ్యూనిస్టుపార్టీ అధికారానికి ఒక సవాల్ కాబోతుందనే భీతి వున్నది. దానిని వీడి ప్రభుత్వం - పార్టీలలోని వారంతా సౌజన్యరాశి అయిన ప్రధాన మంత్రి మార్గదర్శకత్వాన్ని అంగీకరిస్తే, చిక్కు విడిపోతుంది; ప్రజాసంఘాల కార్యకర్తల సంపూర్ణ సహకారం కూడా లభ్యం కావలెననుకోండి।

చివరకు, పరిస్థితి ఏ విధంగా పరిణమిస్తుందో, ఇదమిత్థమని చెప్పడం ఈ పంక్తులు వ్రాసే సమయంలో సాధ్యం కావడంలేదు. చక్కని సమాధాన మార్గమే లభ్యమయితే అందరం ఆనందిస్తాం.

ఎర్రటి ఉద్యమానికి సంబంధించిన వారి కందరికీ, చైనాలో నేడు జరుగుతున్న చరిత్రలోనేగాక, పోలాండులో జరుగుతున్న చరిత్రలో కూడా, ఒక పెద్ద పరీక్ష వచ్చిపడింది. రాజ్యంలో

ఏ స్థాయిలో, ఏ రూపంలో కొనసాగవలెను?- అభిప్రాయభేదాలను తర్కించుకుని, సౌజన్యంతో వర్తించే విధంగా- అసమ్మతివాదుల స్వేచ్ఛకు భంగం లేకుండా, వారి సహకారాన్ని కూడా దేశ పునర్నిర్మాణానికై పొందే మార్గమేది?- ఇవన్నీ ఆ పరీక్షపత్రాలలోని అంశాలు.

• • •

ఎర్రటి ప్రపంచానికి పోలాండు ఎటువంటిదో అమెరికా ఖండానికి ఎల్ శాల్వాడోర్ సీమ రమారమి అటువంటిది. పోలాండులో సోవియట్ యూనియన్‌తోసహా ఎర్రటి రాజ్యాలకు, ఎర్రటి ఉద్యమానికీ పరీక్షలు ఎదురైతే, ఎల్ శాల్వాడోర్‌లో అమెరికన్ (రీగన్ పాలించే అమెరికన్) రాజ్యపద్ధతికీ లోక వ్యవహార దక్షతకూ, అగ్రరాజ్యాల మైత్రికీ పరీక్షలు ఎదురైనవి. ఇవి రెండూ (అనగా ఈ పరీక్షలన్నీ) సక్రమంగా పూర్తయితే, రీగన్-బ్రెజ్నెవ్‌లు త్వరలో కలుసుకున్నప్పుడు సాయుధ శక్తులను ఎక్కడెక్కడ ఏ యే విధాలుగా పెంచి, తగ్గించి, ప్రపంచశాంతిని కాపాడుదామా అని చర్చించుకుంటారు. తత్కాలంగా లోకరాజ్యానికి ఉపశాంతి లభిస్తుంది. తర్వాత సంగతి తర్వాత!

పైన ప్రస్తావించిన అమెరికా ఖండపు సీమలో అమెరికా (రీగన్ రాజ్యం) అవలంభించే విధానం సరియైనది కాదని ప్రజా సంఘాల పెద్దయెత్తున అందో రీగన్ ప్రభుత్వం తన వ్యవహార సరళి మార్చుకునే సూచనలు కనిపిస్తునవి. దౌర్జన్యకాండతో మిలిటరీ ప్రభుత్వాన్ని కూలద్రోసి, ఉదారాశయాలుగల వ్యక్తులను - పక్షాలను హతమార్చి, రాజ్యానికి రావలెనని రైటిస్టు లనబడేవారు ఎల్ శాల్వాడోర్‌లో ప్రయత్నిస్తున్నారు. వామపక్షాల వైపునుంచి గెరిల్లా దళాలు పోరుతున్నవి. రీగన్ రాజ్యం రైటిస్టుల నుంచి ఎల్ శాల్వాడోర్ ప్రభుత్వాన్ని కాపాడలేకున్నా, వామపక్షాల వైపునుంచి వచ్చే ఒత్తడిని ఎదుర్కోడానికి ఆ ప్రభుత్వానికి సాయపడినది. సోవియట్ రాజ్యం ప్రత్యక్షంగా లేక పరోక్షంగా వామపక్షాల ఉద్యమానికి సాయపడినందువల్ల తానావిధంగా చేసినదని రీగన్ రాజ్యం పలికింది.

అంతర్జాతీయ సోషలిస్టు సంస్థద్వారా ఎల్ శాల్వాడోర్‌లో జరుగనున్న సమాధాన మార్గానికి రష్యా - అమెరికాలు గట్టిగా తోడ్పడితే, ఆ సీమలో శాంతి ఏర్పడుతుంది. ఇదీ విషయజ్ఞుల అభిప్రాయం.

• • •

మనవైపున అమెరికా (రీగన్ రాజ్యం) మునుపటివలెనే రష్యాకు బాగా తోడ్పడుతున్నది! అఫ్‌గానిస్తాన్‌లో రష్యా వేసిన తిష్ఠకు జవాబుగా పాకిస్తాన్‌లో పరోక్షంగా రీగన్ రాజ్యం అదే పని చేస్తున్నది. మనం ఎంత స్వతం

త్రంగా, అలీనంగా వుండవలెనని అనుకున్నా, రష్యావైపుకు మనలను రీగన్ రాజ్యం నెట్టివేస్తున్నది. రాబోవు 'పాక్ బాంబు'కు జవాబుచెప్పే శక్తిని మనం సంపాదించడానికి ఇక క్షణం ఆలస్యం చేయరాదనే భావన కూడా మన దేశంలో వ్యాపించింది. ఇవి రెండూ మనకు రీగన్ రాజ్యపు వరప్రసాదాలని లోకవ్యవహార వ్యాఖ్యాతలు అంటున్నారు.

ఈ సమయంలో చైనా మనతో మన ప్రాంతపు వ్యవహారాలను గూర్చి అందులో ఇంకా మిగిలివున్న చిక్కులను గూర్చి చర్చించుకోడానికి సిద్ధపడుతున్నదనే వృత్తాంతాన్ని అందుకుని, అందుకు మనమూ సిద్ధపడుతున్నాము. జాగరూకత గలిగి సంచరిస్తూ, మన ఈశాన్యాన రేగిన అశాంతికి ఈలోగానే చికిత్స చేసుకుని, చర్చలకు దిగబోతున్నాము.

* * *

మాస్కోలో, ప్రాహాలో (Prague) జరిగిన కమ్యూనిస్టు పార్టీల మహా సమావేశాలలోని గంభీరోపన్యాసాలను, చర్చల సరళిని శ్రద్ధతో విన్నాము. తమ వ్యవస్థను అంతరంగికంగా మరింత పరిపుష్టంచేసుకొని, శాంతికై పోరాటం సల్పడానికి వారంతా పూనుకున్నట్లు అభిజ్ఞవర్గాలు అభిప్రాయ పడుతున్నవి.

అఫ్గాన్ సమస్య, ఇరాక్ - ఇరాన్ యుద్ధ సమస్య, కంపూచియా సమస్య పరిష్కారం కానున్నవి. వీటన్నింటిలోనూ మనం వహించేపాత్ర కొన్ని విమర్శలకు గురియైనప్పటికీ, మొత్తాన మనం తొందరపడకుండా, పూర్వాపరాలు యోచనచేసిన మీదటే, జాగ్రత్తగా వ్యవహరిస్తున్నామని మనపట్ల ప్రపంచం అభిప్రాయాన్ని కలిగివున్నదని తెలుస్తున్నది.

---

వచ్చే సంచికలో

ఐద్దెపూడి సుధారాణిగారి

## నాకు నచ్చిన నా కథ

---




# మరవలేని మనిషి

మల్లాది వెంకట కృష్ణమూర్తి

ఆదివారం కాబట్టి మేట్నీకి ఓ ఇంగ్లీష్ సినిమాకి వెళ్ళాను. క్యూలో నిలబడ్డాను అతని వెనక.

కాళ్ళ దగ్గర బ్రీఫ్‌కేస్ వుంది. ఇంగ్లీష్ నవలని చదువుతున్నా డతను. బుకింగ్ తెరిచాక చదవడం ఆపాడు.

వెనక్కి తిరిగి నన్ను చూసి వెంటనే నవ్వాడు "కులాసానా?" అడిగాడు ఇంగ్లీష్‌లో.

అతన్ని చూడటం అదే మొదటిసారి.

"మీ రెవరో నాకు తెలియదు." జవాబు చెప్పాను.

"మీరు ఆవారి తమ్ముడు కదా?" అడిగాడు.

తల అడ్డంగా వూపాను.

"కాదు."

"సారీ."

"ఇట్సాల్‌రైట్,"

మా ఇద్దరి సీట్లు పక్క పక్కనే. కూర్చున్నాక చెప్పాడు.

"ఆచారి అని నా స్నేహితు డొకడు న్నాడు నాగ్‌పూర్‌లో. ఓసారి అతని బ్రదర్ హైద్రాబాద్ నించి వచ్చాడు. అచ్చం మీలాగే వున్నాడు... మీ పేరు?"

చెప్పాను.

"నా పేరు జీతూ జీతూ అగర్వాల్. నాగ్‌పూర్‌లో పళ్ళవ్యాపారం చేస్తున్నాను నెలకోసారి ఆ పనిమీద వస్తుంటాను." చెప్పాడు.

"నేను షెహన్‌సా కాంట్రాక్టర్స్ కంపెనీలో పనిచేస్తున్నాను." చెప్పాను.

సినిమా థియేటర్‌లో లైట్లారిపోయి తెరమీద స్లయిడ్స్ కనబడేదాకా చేతి లోని పుస్తకం చదువుతూండిపోయాడు అతను.

ఇంటర్వెల్‌లో కేంటీన్‌దగ్గర కనప డ్డాడు మళ్ళీ జీతూ. నా కూ్కడా ఓ టీ తీసుకున్నాడు.

మొహమాటపడుతూనే తీసుకున్నాను.

"బాగా మబ్బుపట్టింది. వర్షం వచ్చే టట్లుగా వుంది," అన్నాడు ఆకాశంవంక చూసి.

"సిగరెట్ తాగుతారా?" అడిగాను టీ తాగాక సిగరెట్ దుకాణంవైపు నడుస్తూ.

జేబులోంచి గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్ పెట్టె తీసి నాకో సిగరెట్ ఆఫర్‌చేసి తనొకటి వెలిగించాడు. పొగ గుండెల నిండా పీల్చి వదులుతూ అడిగాడు.

"సినిమా అయ్యేక మీ కేమయినా పని వుందా?"

"ఎందుకు?"

"రాత్రి పదిన్నరకి దక్షిణ్ ఎక్స్ ప్రెస్‌లో వెళ్తున్నాను. వర్షం వస్తే సరదాగా విస్కీ తీసుకుందా మనుకుంటు న్నాను. కంపెనీ లేకుండా తీసుకోవటం కష్టమే. మీకు అలవాటుంటే సరదాగా కంపెనీ ఇవ్వగలరా?" మర్యాదగా అడిగాడు.

తలవూపాను. నా జేబులో ఇరవై రూపాయలున్నాయి. వర్షం వచ్చే పక్షంలో అతని ఆలోచన మంచిదనిపిం చింది.

సినిమా అయ్యేక బయటకి వస్తే సన్నగా తుంపరలు పడుతున్నాయి.

"వెళ్దామా?" మొహమాటపడుతూనే అడిగాడు జీతూ.

తల వూపాను.

"థాంక్స్."

దగ్గరలో వున్న ఓ బార్‌కి వెళ్ళాం. బేరర్ వచ్చాక అడిగాడు నన్ను.

"మీరు నా గెస్ట్. ఏం కావాలో చెప్పండి"

"మీరు?"

"బీరు తీసుకుంటాను నేను."

బేరర్‌కి కేజునట్స్ కూడా తీసుకు రమ్మని చెప్పాడు జీతూ.

"మీ వూరు బావుంటుంది" చెప్పాడు.

నేను అట్టే మాట్లాడలేదు. అతనే పళ్ళ వ్యాపారం గురించి, నాగ్‌పూర్ గురించి, అక్కడ వున్న మహారాణిబాగ్ గురించి, తన కుటుంబం గురించీ అనేకం మాట్లాడసాగాడు.

పావుగంటలో నా బీరుసీసా ఖాళీ అయింది. ఇంకొకటి ఆర్డర్ చేసాడు.

మరో అరగంటలో అది కూడా పూర్తయింది. తనకో క్వార్టర్ విస్కీ నాకో బీరు చెప్పాడు బేరర్‌ని పిలిచి.

"ఇంక వద్దండి," చెప్పాను. నా జేబులోని ఇరవై రూపాయల విలువని మించి తాగదలచుకోలేదు. నా బిల్లు నేనే ఇవ్వదలచుకున్నాను.

జేబులోంచి పర్సు తీసి తెరచి చూపించాడు జీతూ నవ్వుతూ.

పది రూపాయల నోట్లు చాలా వున్నాయి అందులో.

"లేదనుకోకండి. మీరు నా గెస్ట్. రైలుకి ఇంక చాలా సమయం వుంది."

మూడో బీరు పూర్తయ్యేసరికి బాగా విషా వచ్చింది నాకు.

"బాత్‌రూంకి వెళ్ళొస్తాను."

తల వూపాడు.

టాయ్‌లెట్‌కి వెళ్ళి రెండు మూడు నిముషాల్లో బయటకి వచ్చాను.

జీతూ లేడు.

బాత్‌రూంకి వెళితే నాకు ఎదురుపడి ఉండాలి వారిలో. బార్ అంతా చూసాను. ఎక్కడా కనపడలేదు.

ఓ కొత్త వ్యక్తి కేవలం కంపెనీ కోసం ముక్కూమొహం తెలియని నాకు ఎందుకీ ఖర్చుపెట్టాలి అన్న సంశయం నాలో ఎప్పుడో మొదలయింది.

లేచి అతని పక్క సీట్ మీద వుంచిన బ్రీఫ్‌కేస్ వుందో లేదో చూసాను.

ఉంది.

దాదాపు ముప్పావుగంట అయింది. జీతూ మళ్ళీ రాలేదు.

బేరర్‌ని పిలిచి అప్పటికే నాలుగైదు సార్లు అడిగాను అతన్ని గురించి. తనకి తెలియదన్నాడు.

లేచివెళ్ళి జరిగింది బార్ మేనేజర్‌తో చెప్పాను.

"మీ దగ్గర డబ్బులేదా?" అడిగాడు నావంక అనుమానంగా చూస్తూ.

"లేదు. అతను బ్రీఫ్‌కేస్ వదిలి వెళ్ళాడు. తప్పక వస్తాడు. నేను వెళ్ళాలి."

కౌంటర్ వెనకనించి లేచి ఆ బ్రీఫ్‌కేస్ దగ్గరికి వెళ్ళాడు. దాన్ని తెరచి లోపలకి చూసి నా దగ్గరకి తీసుకొచ్చి చూపించాడు మేనేజర్.

ఖాళీ!

"దీని ఖరీదు ఇరవై కూడా వుండదు."

నా మొహం పాలిపోయింది వెంటనే.

బార్ మూసేదాక, రాత్రి పదకొండు దాకా చూసాను.

జీతూ వస్తాడనుకోలేదు.

రాలేదు కూడా.

నా వుంగరం మేనేజర్‌కి ఇచ్చి బయటకి నడిచాను. దాన్ని తిరిగి తీసుకోవాలంటే జీతం వచ్చేదాకా ఆగాలి.




**అతని పేరు సీతాపతి.**

వయస్సు పాతిక సంవత్సరాలు. కాని వయస్సుకు తగ్గ హుషారు కనబడదు. తనలో తాను నవ్వుకుంటూ వుంటాడు. అంతమాత్రంచేత పిచ్చివాడు అనుకో కూడదు.

చిన్నప్పుడు పరమపద సోపానపటం ఆడుకునేటప్పుడు ఎప్పుడూ గబగబా నిచ్చెనెక్కి పండిపోలేదు సరికదా. చివరిదాకా వచ్చి పాము నోట్లో పడి మొదటికొచ్చేవాడు. అందుకనే జీవితంలో అతనెప్పుడూ 'లిఫ్ట్' కోరుకోలేదు.

రాజకీయాల గురించి బొత్తిగా తెలీదు. చదువుకునే రోజుల్లో కూడా సెక్సు పుస్తకాల జోలికి పోలేదు. రామయణం చదివినప్పటినుంచి ఆడదంటే అతనికి తెలీకుండానే జాలి కలిగేది.

అతగాడి మనస్సు వెన్నలాంటిది. ఏమాత్రం వెచ్చదనం తగిలినా కరిగి

పోతుంది. మానవత్వానికి అర్థం తెలుసు. ఎవరైనా కష్టాల్లో వుంటే కనీసం మాట సహాయమైనా చెయ్యగల మంచి మనసు వుంది.

"అజన్మాంతం నేను బ్రహ్మచారిగా వుండదలిచేను...." —అని తోటి స్నేహితుల్తో అంటూ వుండేవాడు. అదేం లాభంలేదని వాళ్ళమ్మ చావుమంచం మీద బలవంతం చెయ్యడంతో మెడలు వంచక తప్పలేదు.

పాము నోట్లోకి వెళ్ళబోయే కప్పలా చాలా ఇబ్బందిపడి మాధవి మెడలో మూడు ముళ్ళు బిగించేడు.

వంశపారంపర్యంగా వచ్చిన అప్పుతోపాటు గుమాస్తాగిరిని కూడా స్వంతం చేసుకొని సాదాగా జీవితాన్ని వెళ్ళదీస్తున్నాడు.

సీతాపతి సంసారం అనే మహోదధి ఈదటం ప్రారంభించిన ఐదు సంవత్స రాలకు ఇద్దరు వారసులు నట్టింట్లో ఏడుపులు ప్రారంభించేరు. దాంతో పరిపూర్ణ గుమస్తా అయ్యేడు. ఉన్న చిన్న వుద్యోగానికి తోడు పెళ్ళాంపిల్లలు రోగాల్తో ఆర్థికంగా తద్వారా మానసికంగా బాగా కృంగిపోయేడు సీతాపతి.

మొగుడు అభిప్రాయాలతో ఎప్పుడూ ఏకీభవించేది కాదు. శిలలా వుండే భర్తతో ఏంమాట్లాడినా ప్రయోజనం వుండదని కొత్తల్లోనే గ్రహించిన మాధవి సర్దుకుపోవటం అలవాటు చేసుకొంది.

"సరదాగా ఇవాళ సినిమాకి వెళ్దామా !!!"— అని ఎప్పుడూ మొగుడ్ని అడగ లేదు. అలా సరదాగా చెట్టాపట్టా లేసుకుంటూ తిరగాలని కోరికా లేదు సీతాపతికి.

పండువెన్నెల రోజు—ఆరుబయట డాబామీద మల్లెలపాన్పు మీద కూర్చుని ప్రపంచాన్ని, ప్రకృతిని మర్చిపోతూ పెళ్ళాం నల్లని వాలుజడలో చిక్కుకొని ఎగిరిపడే ఆమె శ్వాసల్ని—వెన్నెల వెలుగుకి మొగలిరేకులా మెరిసిపోయే ఆమె శరీర సౌందర్యాన్ని చూస్తూ ఆనందంతో వుక్కిరిబిక్కిరవ్వాలని అత నెన్నడూ అనుకోలేదు—కనీసం కలలు కూడా రాలేదు సీతాపతికి.

దేవుడంటే చెడ్డ భక్తి. శనివారం కొబ్బరికాయ కొట్టకపోయినా ఉపవాసం వుండటం అలవాటుచేసుకొన్నాడు.

'బాధలు లేని మనిషి ఈ ప్రపంచంలో లేదేమో !!!' —అన్నది అతనికెప్పుడూ వచ్చే అనుమానం.

"పూట మాత్రం కూడా తిండిలేనివాళ్ళు ఈ దేశంలో ఇంకా ఎంతమంది వున్నారో !! వాళ్ళ మీద మనం చాలా నయం "— అని సంతృప్తి పడు తుంటాడు.

"ఏవండీ! చిన్నవాడికి జ్వరంగా వుంది. పాలవాడు డబ్బులకోసం తిరుగుతున్నాడు. ఇవ్వాల్టితో బియ్యం నిండుకుంటాయి... "- అని తెల్లారి లేచేసరికి పెళ్లాం పాడే సుప్రభాతాన్ని అంతగా పట్టించుకోడు సీతాపతి. పెళ్ళయింతర్వాత అతడు నేర్చుకొన్న మొదటి పాఠం ప్రతి విషయాన్నీ తేలిగ్గాతీసుకొని హాయిగా మర్చిపోవడం.

"మీరేం పట్టించుకోపోతే ఎలా ?! మీకేం మీరు ఆఫీసులో వుంటారు.... అప్పులవాళ్ల పీడించేది నన్ను...."- అని మాధవి రుసరుసలాడినా మబ్బుల చాటునుంచి బయటపడ్డ చంద్రుడిలా పల్చగా తనలో తానే నవ్వేసుకుంటాడు సీతాపతి.

## 2

దరిద్రం దోబూచులాడే ఆ అద్దెకొంపలో చిక్కటి చారలు కిటికీలోంచి దొంగల్లా చూస్తున్నాయి.

ఇంటిముందున్న రెండు చెట్లూ తెల్లవారుజామువేళ సెంట్రీల్లా మత్తుగా రోడ్డుకేసి చూస్తున్నాయి.

ఇంట్లో దాక్కున్న కొద్దిపాటి చీకటిని పారద్రోలడానికి దీపం వెలుగు అవస్థ పడ్తోంది. గుడ్డవుయ్యాల్లో పగటికీ, రాత్రికీ తేడాతెలీని కుర్రాడు నోరు తెరచి హాయిగా నిద్రపోతున్నాడు.

గోడకు తగిలించిన వున్న సీతాపతి తలితండ్రులిద్దరూ మసిబారిన అద్దం చాటునుంచి 'దరిద్రం మన జన్మహక్కురా! దాన్ని గురించి ఎప్పుడూ ఆలోచించకు ...'- అని ఉపదేశం చేస్తున్నట్లు చూస్తున్నారు.

గుమ్మందగ్గర నుల్చుని రోడ్డుకేసి చూస్తోంది మాధవి, పరవళ్లు తొక్కే వయస్సులో ఇలా కాళ్ళకు బంధాలు వేసుకొని రాబోయే రోజులు ఎలా ?! అన్న ఆలోచన్లతో, కన్నీళ్ళతో కాలం గడపాల్సొస్తుందని పెళ్ళి కాకముందు మాధవి అనుకోలేదు.

ఇల్లంతా స్తబ్దుగా వుంది. చిరువెల్తుర్తోపాటు మౌనం కూడా స్థానం చేసుకొంది ఆ ఇంట్లో. క్షణాలు చాలా తొందరగా దొర్లిపోతున్నాయి.

సీతాపతి ఆలోచన్ల వలయంలోంచి ఎట్టకేలకు బయటపడ్డాడు. పరిసరాల్ని మర్చిపోయిన సీతాపతి తదేకంగా రోడ్డువైపు దృష్టి మళ్ళించి వున్న మాధవిని చూసేడు. కుర్చీలోంచి లేచి గుమ్మం దగ్గర కొచ్చేడు. అతని రాక ఆమె ఏకాగ్రతను చెడగొట్టలేదు.

అప్రయత్నంగా ఎదురింటి కిటికీమీదకు సోకింది దృష్టి.

చెదరిపోయిన తిలకంతో—కన్నీటి వరదతో చిన్నగా రోదిస్తున్న ఎదురింటి అమ్మాయిని చూసేసరికి సీతాపతి మనసు చివుక్కుమంది. ఆ అమ్మాయి జబ్బ పట్టుకొన్న ముసలివాడిని చూడగానే ఎక్కడలేని కోపం వచ్చింది సీతాపతికి. కుతూహలాన్ని చంపుకోలేక "రోజూ ఆ పిల్లను ఎందుకలా కొడ్తారు ?!! ఆడ పిల్లను కొట్టడానికి చేతులెలా వస్తాయో ?!" —అనేసేడు.

మాధవి భర్తకేసి చూసింది.

"అసలు సంగతేమిటి ?!!"— అన్నట్లుగా మాధవికేసి చూసేడు సీతాపతి. అతను ఆ దృశ్యాన్ని చాలాసార్లు చూసేడు. అతను చూసినప్పుడల్లా ఆ అమ్మాయి ఏడుస్తూ వుండటం బాధ కల్గించింది. కారణం మాత్రం ఎప్పుడూ తెల్సుకోలేక పోయేడు. ఇతరుల విషయాల్లో జోక్యం చేసుకోవడం అంత మంచి పని కాదని సీతాపతి నమ్మకం. కానీ ఆ పిల్ల కన్నీరు చూసినప్పుడు సీతాపతి గుండె కరిగిపోయేది.

"ఆ ముసలి పీనుగు లిద్దరూ ఆ అమ్మాయికి అత్తమామలౌతారు. చిన్నప్పుడే తలితండ్రులను కోల్పోయిందట. అప్పటినుంచీ వాళ్లే పెంచి పెద్దచేసేరు. ఆయన వుద్యోగం పోయి చాలా కాలమైంది. సంసారాన్ని ఈదలేక ఆ అమ్మాయి యవ్వనాన్ని పణంగా పెట్టి నాలుగు డబ్బులు సంపాదిద్దామని యావ. అందుకు ఆ అమ్మాయి వొప్పుకోదు....అదే వాళ్ళ గొడవ.... రోజూ ఈ యాగీలతో పడేకన్నా చావడం నయం .." కసిగా అంది మాధవి.

సీతాపతి ఆశ్చర్యానికి అంతులేదు.

'చిన్నప్పటినుంచి పెంచి పెద్దచేసినవాళ్ళకు ఇలాంటి దుర్బుద్ధి ఎందుకు పుట్టింది చెప్మా ?!!'— అని అనుకోకుండా వుండలేకపోయాడు.

ఆ రాత్రల్లా అతని ఆలోచనల్లో ఎదురింటి అమ్మాయి చోటుచేసుకుంది. చెడయినా ఆ అమ్మాయి విషయంలో జోక్యం కలిగించుకొందామనిపించింది సీతాపతికి.

"రేపోసారి ఆ అమ్మాయిని ఏదోవక మిషమీద మనింటికి తీసుకురా కూడదూ ?!!" అన్నాడు సీతాపతి.

నిద్రలోకి జారుకుంటున్న మాధవికి అర్థంతరంగా అన్న సీతాపతి మాట విని ఆశ్చర్యపోయింది.

* * *

"ఈ నికృష్టపు బ్రతుకునుంచి మంచి జీవితంలోకి అడుగుపెట్టించు ప్రభూ!!" అని లత మనసులో చాలాసార్లు దేవుడ్ని వేడుకొంది

"మంచిరోజు వస్తుంది. నీ జీవితం ఆనందమయం అవుతుంది." అని దేవుడు సినిమాలోలా ప్రత్యక్షమై చెప్పకపోయినా తనకు తెలీని ఏదో ఆశ ఊపిరిపోసుకొని శుభదినంకోసం ఎదురుచూసేలా చేసింది.

పాలపొంగులాంటి యవ్వనం లతది.

భవిష్యత్తుమీద ఎన్నో ఆశలు, కోరికలు పెంచుకొంది లత. కలువరేకుల్లాంటి కళ్ళు- నల్లటి వాలుజడ- వెన్నెట్లో పసుపచ్చగా మెరిసే బంగారు ఛాయలోవుండే ఆమెను చూస్తే నిద్రావస్థలో వున్న కోర్కెలు మనసుని వెల్లువలా చుట్టేస్తాయి.

హైస్కూలు చదువుతో ఇష్టంలేకపోయినా విద్యాభ్యాసానికి స్వస్థిచెప్పాల్సొచ్చింది. పత్రికలద్వారా ప్రపంచాన్ని చూడటం అలవాటు చేసుకొంది. చిన్నప్పుడే తండ్రి కాలంచేసేడు. స్త్రీ పురుషుల మధ్యనున్న తేడా తెలుసుకునే వయసులో తల్లి తండ్రిని అనుసరించింది. పరిస్థితులు ఎలా ఎదుర్కోవాలి?! అన్న అనుమానం వచ్చేలోపలే 'ఇంతమంది వుండి నిన్ను అనాధను చేస్తామటే!' అని అత్తమామలు భరోసా ఇచ్చి జీవితంమీద మమకారం కల్పించేరు. అప్పటినుంచి అత్తమామలే తలిదండ్రులు.

శరీరానికి వయస్సు—మనసుకి సిగ్గు తెలిపేసరికల్లా అత్తమామల్లో కొత్త మార్పును గమనించింది లత. వాళ్ళు తనమీద చూపిస్తున్న ఆప్యాయత, ఆదరణలోని ఆంతర్యం తెలుసుకోడానికి ఎంతోకాలం పట్టలేదు.

"చూడు లతా....! మన ఆర్థిక ఇబ్బందులు తెలుసు కదా?! నే చెప్పేది బాగా అర్థంచేసుకో.... ఇందులో పెద్ద తప్పేంలేదు. శీలం, గుణం అనే మాటలు పురాణాల్లోనే ఇంకిపోయాయి. మనం కాలంతోపాటు పోవాలి.... బాగా ఆలోచించు ..." అని రోజూ ముసలాయన గీతోపదేశం చేసేవాడు.

"ఇన్నాళ్ళూ నిన్ను పెంచింది మమ్మల్ని కష్టదశలో ఆదుకుంటావని కదూ!! నీకు ఇంతకన్నా మంచి బ్రతుకు దొరుకుతుందా?!" అని అత్తయ్య చేసే హెచ్చరికలకి ఒళ్ళు జలదరించేది.

రోజులు గడుస్తున్నకొద్దీ వాళ్ళ బలవంతం ఎక్కువయింది. వాళ్ళ మాటలు విని జీవితాన్ని నాశనం చేసుకోవడంకన్నా హాయిగా చావడం మేలన్న యోచన లతకి రాకపోలేదు.

ఆలోచన్లు నిర్ణయంగా మారినా బ్రతుకుమీద తీపి చావుమీదకి పోనీయలేరు. అందుకే ఎన్నిసార్లు ప్రయత్నించినా జయించలేక పోయింది.

మనసు విప్పి మాట్లాడుకునేందుకు మంచి మనసు దొరకలేదు. రోజూ వాళ్ళ చేత తిట్లు, దెబ్బలు తినడం దైనందిన కార్యక్రమంలో ఒకటయింది.

ఈ సమస్యకు పరిష్కారం ఫలాన అన్నది ఆమెకు జవాబు దొరకని ప్రశ్న-ముడివిడని చిక్కు.

పంజరంలో చిలకలా ప్రపంచాన్ని తనకున్న పరిధిలోనే చూడటం తప్ప మరేం చెయ్యలేకపోయింది లత.

* * *

సీతాపతి ఆలోచన్లు అతనూహించనంత దూరంలో వున్నాయి. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. మధ్య మధ్య తమ వునికిని గుర్తుచేస్తున్నారు పిల్లలు ఏడుపులద్వారా!

బియ్యం ఏరుతున్న మాధవి వాళ్ళ మధ్యనున్న మౌనాన్ని భరించలేక పోయింది.

"పోనీ వాళ్ళను ఎదురించలేకపోయావా?!" లతను అడిగింది మాధవి.

ఎర్రబారిన ముఖాన్ని పైకెత్తి చూసింది లత. సన్నటి నవ్వు ఆమె పెదాల మీద నాట్యంచేసింది.

మానవత్వం వున్న మనిషిగా ఆమె కష్టాలకు చేయూతనిచ్చి ఆ భయంకర కూపంనుంచి బయిటకు లాగాలన్న కోరిక బలంగా నాటుకుపోయింది సీతాపతికి. సీతాపతికి అడగడానికి ప్రశ్న దొరకలేదు.

"పోనీ ఎవర్నైనా పెళ్ళిచేసుకోకపోయారా?!" ఏమనాలో, ఏం మాట్లాడాలో అర్థంకాకుండా అనేసేడు.

పేలవంగా నవ్వింది లత సమాధానంగా!

సీతాపతికి ఆ నవ్వులో అర్థం అర్థంకాలేదు.

"మీకు పెళ్ళిచేసుకోవాలని లేదా?!!" అంతకన్నా చవట ప్రశ్న తట్టనందుకు తనమీద తనకే చిరాకువేసింది సీతాపతికి.

"చేసుకునేవాళ్ళు ఎవరున్నారు?!!" లత.

"అవును.... నిజమే!!" అని మనసులోనే అనుకున్నాడు.

మళ్ళీ ఎవరి గొంతూ పెగఁలేదు. సీతాపతికి మిగిలిపోయిన అనుమానాల్ని



వరసగా అడగటం బాగోదనిపించింది. అందుకే ఆమె ప్రశ్నకు జవాబుకోసం వెదుకుతున్నాడు.

ఆమె కళ్ళల్లో కాంతి లేదు. ఆమె మనోవేదన కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది. కళావిహీనమైన ఆమెను చూస్తుంటే హృదయం ద్రవించిపోయింది సీతాపతికి.

అక్కడున్న అరగంటలో లత మాట్లాడింది తక్కువే. వాళ్ళ మధ్య మౌనమే ఎక్కువసేపు దోబూచులాడింది.

"ఇంక నేను వెళ్తానండి. నా గురించి క్షణం ఆలోచించేవారు దొరికినందుకు చాలా ఆనందంగా వుంది." వెళ్ళడానికి సిద్ధపడుతూ అంది లత.

"మనసు బాగోనపుడు మా యింటికొస్తూ వుండండి. కాసేపయినా మీ ఇంటి గొడవలు మర్చిపోవచ్చు." సాగనంపుతూ సీతాపతన్నాడు.

గబుక్కున తలెత్తి చూసింది. అతని మాటలు ఎంతో ధైర్యాన్నిచ్చేయి లతకు.

*  *  *

మరఫిరంగుల గొడవ సద్దుమనిగిన తర్వాత యుద్ధభూమిలా వుంది ఆ ఇంట్లో ప్రశాంతత.

మధ్య మధ్యలో రెస్టుతీసుకుంటూ తాపీగా ఏడుస్తున్నారు పిల్లలు. వాళ్ళను పట్టించుకునే స్థితిలోలేదు మాధవి.

"ఎందు కేడుస్తావ్ ?! ఇపుడేం జరిగిందని?!. . ఆ అమ్మాయి రాలేదు. రాకముందే ఇంత గొడవెందుకు ?! ప్రతి చిన్నవిషయాన్ని పెద్దదిచేసి ఆలోచిస్తా వెందుకు ?!" చాలాసేపటికి సీతాపతి గొంతుక ప్రాణంపోసుకుంది.

"అవున్లెండి నేనేం మాట్లాడినా మీకు అలాగే వుంటుంది...." ఉక్రోషంగా అంది మాధవి.

"సాటి ఆడదానిగా సానుభూతి చూపించలేవా ?! ఒకసారి ఆ అమ్మాయి పరిస్థితి ఆలోచించు. . . పాపం.... నా అనేవాళ్లు లేక వున్నవాళ్లు నానా హింసలు పెడుతుంటే దిక్కుతోచక అల్లల్లాడిపోతుంటే కనికరం చూపించలేవా ?!"

"మీ అంత విశాలహృదయం నాకులేదు... !!" విసురుగాలేచి అక్కడనుంచి వెళ్ళిపోయింది.

సీతాపతి భృకుటి ముడిపడింది.

పిల్లలు ఏడుపుస్థాయి తగ్గించేరు. వాళ్ళను కానీ, మాధవిని కానీ వోదార్చా లనిపించలేదు. చిరాగ్గా రోడ్డుమీద కొచ్చేడు. వంటికి తగిలిన చల్లగాలికి కొత్త ఆలోచనలు చోటుచేసుకున్నాయి.

తారల మధ్య చంద్రుడు సిగ్గుపడుతున్నాడు.

ఆకుల సందునుంచి నేలను తాకుతున్న వెన్నెల చిన్నపిల్లచేత రాకుండా వేసిన ముగ్గులా వుంది.

చెట్టుకింద సీతాపతి వేడెక్కిన బుఱ్ఱను చల్లబరుస్తున్నాడు.

ఉన్నట్టుండి గట్టిగా అరుపులు వినిపించాయి.

పడబోయే అడుగు పడలేదు సీతాపతికి. కేకలకు ఆకాశం దడుచుకొంది. వెన్నెల తీక్షణంగా లత ఇంటివైపు చూసింది. చెట్టుమీద పిట్టలు కలవరానికి రెక్కలాడించేయి.

లత పరిగెట్టుకుంటూ రోడ్డుమీద కొచ్చింది.

"మర్యాదగా చెప్తున్నాను లోపలికి రా!!" ముసలిగొంతు గాంభీర్యంగావుంది.

"నేను చచ్చినా రాను...." ఏడుపు మధ్య లత హీనస్వరం.

సీతాపతికి ఆతృత ఎక్కువైంది. గబగబా అడుగులుపడ్డాయి. అంతకన్నా త్వరగా చుట్టుపక్కల ఇళ్ళల్లో లైట్లు వెలిగాయి. వీధంతా దేదీప్యమానంగా వుంది. కొన్ని జతల కళ్లు కిటికీలోంచి చూస్తున్నాయి.

ముసలాయన ఆకలిగొన్న పులిలా రోడ్డుమీద కొచ్చేడు.

"లోపలికి వస్తావా ?!.... బలవంతంగా లాక్కెళ్ళమ్మంటావా ?!" కోపం కళ్ళల్లో, మాటల్లో కనిపించింది.

చుట్టూ చేరిన పెద్దలు వింతగా చూస్తున్నారు. కానీ ఎవ్వరూ మాట్లాడలేదు. సీతాపతి రక్తం వేగాన్ని పుంజుకుంది. ఏంచెయాలో తోచని స్థితి. చుట్టూపరికించి చూసేడు. ఎవరిలోనూ చలనం లేదు. ద్రౌపదికి వస్త్రాపహరణం జరిగేటప్పుడు కౌరవసభలో ఏం మాట్లాడలేని పెద్దల్లా చూస్తున్నారందరూ. దుశ్శాసనుడిలా వున్నాడు ముసలాయన. ఆయన కళ్ళల్లో క్రోధాగ్ని జ్వాలలు తట్టుకొనే ధైర్యం ఎవరికీ రాలేదు. లత కన్నీళ్లు చూసి జాలిపడ్డారే తప్ప ఎవ్వరూ అడ్డు పడలేదు.

ముసలాయన లత జుట్టుపట్టుకొని చెయ్యెత్తేడు. సీతాపతికి సహనం చచ్చిపోయింది. ఒక్క వుదుటున ముసలాయన్ని పక్కకి తోసేడు. ఆ వూపుకి కిందపడ్డాడు.

"ఇది మా స్వవిషయం. ఇందులో జోక్యం కలిగించుకోవడం మర్యాద కాదు. అడ్డులే ముందు....!!" కిందనుంచి లేస్తూ అన్నాడు.

సీతాపతి మాట్లాడలేదు.

ముసలాయన ముందుకు రావడానికి జంకేడు.

"ఇక ఇంట్లోకి రావా ?!! నే చెప్పినట్లు వినకుండా నా ఇంట్లో ఎలా వుంటావో చూస్తాను...." కోపంగా అనేసి విసురుగా ఇంట్లోకి దూరేడు.

తలుపులు శబ్దించేస్తూ మూసుకొన్నాయి.

చుట్టూ వున్న జనం చెదిరిపోయేరు.

వెన్నెల కురుస్తూనే వుంది. లత ఏడుస్తూనే వుంది.

సీతాపతికి ఏం చెయ్యాలో అర్థంకాక తికమకపడ్డాడు.

"రండి మా ఇంట్లో వుందురుగాని...." చిన్నగా అన్నాడు సీతాపతి.

లత కళ్ళల్లో కృతజ్ఞత కన్పించింది. సంశయంగా అనుసరించింది సీతాపతిని.

మాధవి వస్తున్న ఇద్దర్నీ తదేకంగా చూస్తోంది. సీతాపతికి తెలియకుండా తెలియని భయం ఆవరించింది. సంకోచంగా గుమ్మందగ్గిర ఆగిపోయేడు. లతకు యాంత్రికంగా అడుగు ఆగిపోయింది.

క్షణం భయంకరమైన నిశ్శబ్దం.

సీతాపతి మాటలకోసం వెదకబోయేడు.

"అక్కడే ఆగిపోయేరేం ?!!... రండి లోపలికి . రామ్మా !!" అంది మాధవి.

భయంగా, అనుమానంగా తలెత్తి చూసింది లత. సీతాపతికి మతిపోయింది. క్షణం నివ్వెరపోయేడు మాధవి ఆహ్వానానికి.

లతకి మనసుతోపాటు అడుగుకూడా తేలిగ్గా పడింది.

## 3

కేలండర్లో వారంరోజులు మారిపోయేయి.

సీతాపతి మనసు మాత్రం కుదుటపడలేదు. రోజు ఎలా గడుస్తుందని చిన్న సమస్య.

రాత్రి ముసలాయన, భార్య వచ్చి ప్రేమగా రమ్మనమని బ్రతిమాలేరు లతని. వాళ్ళ మాటలను పట్టించుకోలేదు.

"అయితే నీ ఆఖరిమాట అదేగా ?!" కోపాన్ని అణుచుకుంటూ అడిగేరు ముసలాయన.

అవునన్నట్లు తలాడించింది లత.

"నేనూ చూస్తాను ఈయన ఎంతకాలం పోషిస్తాడో. " అని వెళ్ళిపోయేరు.

వాళ్లు వెళ్ళినవైపు చూస్తూ వుండిపోయింది లత.

మావయ్య అన్న మాటలు లీలగా మెదిలేయి.

'ఎంతకాలం వీళ్ళ దగ్గరుండాలి ?! జాలిపడ్డందుకు భారం అవ్వడం ఎవరూ హర్షించరు. '_ అని అన్పించింది.

ఆలోచన్లు సుడుల్లా తిరిగేయి.

ఏ దారీ తోచలేదు లతకి.

'పోనీ ఇక్కణ్ణుంచి వెళ్ళిపోతే ?!'_ లత మనసు.

వెళ్ళనిస్తారా ?! అనుమానం

"ఏంటి లతా ! అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్ ?!" అడిగేడు సీతాపతి.

"మీరు మరోలా అనుకోకపోతే మీతో ఓ మాట చెప్పాలని వుంది . !!"

"అనుకునే దేముంది ... ఇక్కడ వుండటం ఇబ్బందిగా వుందా ?! లేకపోతే మీ మావయ్య అన్నమాటలకు భయంగా వుందా ?!!"_

"అని కాదు. ఆయన అన్న మాటల్లో నిజం లేకపోలేదు....ఎంత కాలమని మీ ఇంట్లో వుండగల్ను...."

కాఫీతో మాధవి వచ్చింది. మాటలు బ్రేకులు పడ్డట్లు ఆగిపోయేయి. ఒక వాడిచూపు లతమీద వేసింది. వాళ్ళిద్దరూ మాట్లాడుకోవడం మాధవికి నచ్చ లేదు. ఆమె ఆకర్షణలో సీతాపతి తనకు కాకుండా పోతాడేమో ! అన్న భయం లత ఇంట్లో అడుగుపెట్టినప్పటినుంచి వుంది. అందుకే అవకాశం వచ్చినప్పు డల్లా హెచ్చరిస్తోంది భర్తని.

లత అంటే జాలి లేకపోలేదు మాధవికి....కానీ అంతకన్నా కొన్నిరెట్లు ఆమె అందంమీద కూడా ఈర్ష్య లేకపోలేదు.

ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకోబోయేదాకా ఇంట్లో పనులకి చేదోడు వాదోడుగా వుంటోంది లత మాధవికి. ఎంత కలసిపోదామని ప్రయత్నించినా మాధవిని సూటిగా చూళ్లేకపోతోంది. దానికి కారణం లీలగా కూడా తెలియదు లతకి.

లత తీసుకొంటున్న చనువుకి....ఎన్నడూ నవ్వని సీతాపతి నవ్వుతూ లతతో మాట్లాడటం- చుట్టుపక్కల ముత్తయిదువుల ఉపదేశాలతో మాధవికి లత ప్రతి కదలికా, ప్రతి మాటా అనుమానాల్ని స్ఫురింపచేస్తున్నాయి.

ఆమె అర్థం లేని అనుమానాల వల్ల, మాటల వల్ల సీతాపతి సునిశిత హృదయం గాయం అవుతుందని ఎప్పుడూ మాధవి వూహించలేదు.

* * *

తెల్లవారిన వుదయం మామూలుగానే వుంది.

సీతాపతి హడావిడిగా ఆఫీసుకు ప్రయాణం అవడంలో నిమగ్నమైనాడు.

"ఏవండీ....నిన్న చెప్పడం మర్చిపోయేను.... మా ఇంటినుంచి వుత్తరం వచ్చింది...."- చొక్కాకి గుండీ కుడుతూ అంది మాధవి.

"ఏవని రాసేరు ..?!"- అని సీతాపతి అడగలేదు. మాధవి కేసి చూసేడు.

"మా తమ్ముడికి పెళ్ళి కుదిరింది ... నన్ను రమ్మనమని రాసేరు...."

"అలాగే వెళ్లు...."-

"మరి....మీరు ?!!" —చొక్కా ఇస్తూ అంది మాధవి.

"బావుంది.... ఎప్పుడో పెళ్ళికి ఇప్పటినుంచి నేనెందుకు ?! ఆఫీసులో సెలవు ఇవ్వరు...."- తాపీగా అన్నాడు.

"అవున్లెండి.... మా పుట్టింటికి రమ్మనేసరికి మీకు సెలవు దొరకదు...."

సీతాపతి తల దువ్వుకోవడంలో మునిగిపోయేడు.

"రేపు వెళ్దామనుకుంటున్నాను...."—సీతాపతిని చూస్తూ అంది.

సీతాపతి మాట్లాడలేదు. హుటాహుటీగా ఆఫీసుకు వెళ్ళిపోయేడు. గుమ్మం దాకా సాగనంపింది మాధవి. ప్రయాణం గురించి ఏమైనా చెప్తాదేమో ననుకుంది. అదేం పట్టనట్లు వెళ్ళిపోయేడు. కళ్ళల్లో కడివెడు నీళ్లు దాచుకొని మాధవి అలక పాన్పు ఎక్కింది.

ఇంట్లో పనంతా లత చేసుకుపోయింది. ఎంత బతిమిలాడినా భోజనం చెయ్యలేదు మాధవి. తను తినాలో తినకూడదో అర్థంకాలేదు.

మొహమాటం నీరసాన్నిచ్చింది.

నీరసం నిద్రలోకి పంపింది.

మెలుకువ వచ్చేసరికల్లా సీతాపతి కుర్చీలో సిగరెట్టు కాల్చుకుంటున్నాడు.

"ఏం ఇంతసేపు నిద్రపోయేవ్ ?!...."-

"బాగా నిద్రపట్టేసింది...."- లత సమాధానం.

సీతాపతి అలిసిపోయిన శరీరాన్ని కుర్చీలో పడుకోబెట్టి విశ్రాంతి నిస్తున్నాడు.

"డబ్బు తీసుకొచ్చేను.... ఏ బండి కెళ్తావ్ ?!"- చెదిరిపోతున్న సిగరెట్టు పొగను చూస్తూ సందర్భంగాని సందర్భంలో మాధవి నుద్దేసిస్తూ అన్నాడు.

నిప్పు తొక్కినట్లు కోపం తారస్థాయి నందుకొంది మాధవికి.

"నే వెళ్ళడం ఇష్టంలా వులది.... అవున్లెండి నే వెళ్ళటం ఇష్టంలా వుంది అన్నిటికీ అడ్డుగా వున్నాగా.... నా ఖర్మ.... ఏదో పాపం చేసుకొని మీకు దాపురించేను...."- అని అనకుండా వుండలేకపోయింది మాధవి.

కొంచెం కోపంవచ్చినమాట వాస్తవమైనా తమాయించుకొన్నాడు సీతాపతి.

"నువ్వేగా వెళ్తానన్నావ్ ?!"- నిదానంగా అన్నాడు.

"అంటే వద్దనకూర్లేదా ?!!! మీరు మనసులో ఏదో దాచుకుని మాట్లాడుతున్నారు.... ఇదివరకటిలా లేరు...."- పిలవకముందే వచ్చిన కన్నీరు అప్పటికే బుగ్గలమీదనుంచి జారేయి.

"ఇప్పుడేమన్నా కొంప్ములొచ్చేయా ?! ప్రతిదానికి ఎందుకలా పెడర్థాలు తీస్తావ్...."- సహనం సగం కోల్పోతూ అన్నాడు.

ఇద్దర్నీ చూస్తున్న లత పెరట్లోకి వెళ్ళింది. చటుక్కున సీతాపతి దృష్టి అటు మళ్ళింది.




"అవును నేనే ప్రతిదానికి పెడర్థాలు తీసేది...."– ఎక్కిళ్ళ మధ్య మాధవి గొంతు.

ఎలా సముదాయించాలో చాలాసేపటివరకు సీతాపతికి అర్థంకావడంలేదు.

"పోనీ వెళ్ళడం మానేయ్...."– విసుగ్గా కుర్చీలోంచి లేస్తూ అన్నాడు. సీతాపతి చెయ్యి పట్టుకుంది మాధవి.

"వెళ్ళకుండా ఇక్కడే వుండి అడ్డమైన వాళ్ళందరికీ వెట్టిచాకిరి చేస్తుంటాను...."

"రోజురోజుకీ చాలా అసహ్యంగా మాట్లాడ్డం నేర్చుకుంటున్నావ్...."– చెయ్యి విదిలించుకున్నాడు.

"నేనేం మాట్లాడినా అలానే వుంటుంది. మీరు చేసే పనులే బావుంటాయి.... నా సంసారంలో నిప్పులు పోసేదాకా మీకు, ఆవిడకు నిద్రపట్టదు...."– ఏం మాట్లాడుతుందో తనకే తెలియదు. దొర్లిపోయే మాటలను అదుపులోకి తెచ్చుకోలేకపోయింది.

"ఎంత దిగజారిపోయేవ్....!!?"–తనలోనే గొణుక్కున్నాడు. అతని మనసు పెరటివైపుకి పోయింది. ఆ సంభాషణ లత వింటే?! ఆలోచన రాగానే కుచించుకుపోయేడు.

మాధవి శోకాన్ని ఆపే ప్రయత్నం చెయ్యలేదు.

"ఏడుస్తావెందుకు?! నన్నేం చెయ్యమంటావ్?! సంధ్యవేళ నట్టింట్లో ఏడుపు లెందుకే!!?"–సహనం కూడదెచ్చుకొన్నాడు.

"నే చస్తేగాని ఈ కొంపలో ఏడుపులు పోవు...." —విసురుగా వంట గది లోకి పోయింది మాధవి.

ఆశ్చర్యంగా చూసేడు సీతాపతి.... షాక్‌నుంచి కోలుకొన్న తర్వాత పెరట్లోకి నడిచేడు.

నల్లచీర కట్టుకొంటున్న అకాశంవైపు చూస్తోంది లత.

సీతాపతి అడుగుల శబ్దానికి గిర్రున వెనక్కి—తిరిగి చూసింది. ఇద్దరి మధ్యా మసకచీకటి తెర.... పల్చటి గాలి.... ఇంట్లో గిన్నెలు పగుల్తున్న శబ్దం.

"ఎప్పుడూ అంతే అది.... ఆ మాటలు పట్టించుకోకు...." -ఇబ్బందిగా అన్నాడు.

"ఛ....ఛ.... అలాంటి దేమీ లేదు.... అనవసరంగా నా వల్ల మీకు, మీ సంసారంలో సమస్యలు తలెత్తటం...."- అర్ధతరంగా ఆగిపోయింది.

"అలా ఎప్పుడూ అనుకోకు లతా....!" —సీతాపతి మనసు లతకి దగ్గరయింది.

"ఏవండీ....!!.... మిమల్నే....!!"- కొంచెం శృతి పెరిగింది మాధవి గొంతులో. లత గుండె గొంతులోకి వచ్చింది. సీతాపతి దడుచుకోలేదు. అరుపు లకి అలవాటుపడ్డ సీతాపతి వెనక్కి- తిరిగి చూసేడు.

"ఏవండీ !!"— గాలినీ, చీకటిని చీలుస్తూ రణభేరిలా మళ్ళీ మాధవి గొంతు విన్పించింది. కదలక తప్పలేదు సీతాపతికి.

"దాని మాటలు విని మనసు పాడుచేసుకోకు....సరేనా ?!!"-

చిన్న చిర్నవ్వు లత పెదాలమీద దొర్లింది.

ఇంట్లో గొడవ విన్పిస్తోంది. మాధవి అరుపులు తప్ప సీతాపతి మాటలు విన్పించ లేదు. దబదబ మని శబ్దం. దగ్గర కెళ్ళింది లత. గోడకేసి తల బాదు కుంటోంది మాధవి. —చూస్తూ నిల్చున్నాడు సీతాపతి.

* * *

తమ్ముడి పెళ్ళికని పిల్లల్తో ప్రయాణం అయ్యింది మాధవి. నిజానికి వెళ్ళడం ఇష్టంలేకపోయినా తప్పలేదు.

"నే నొచ్చేసరికి లతని ఇక్కడ నుంచి పంపించెయ్యండి.... ఇల్లు—వళ్లు జాగ్రత్త.... కనీసం ముహూర్తం వేళకైనా రండి...."- అంటూ రైలు కదిలే ముందు హెచ్చరించింది సీతాపతిని.

సీతాపతి దిగులుగా చూశ్లేదు మాధవి కేసి.... కేన్సరుకు మందు కనుక్కో-

వచ్చుగాని మాధవి మనసు చదవటం చాలా కష్టం అని చాలాసార్లు అనుకొన్నాడు సీతాపతి.

ఆమె వెళ్ళినప్పటినుంచి ఇంట్లో సందడి లేదు. అసలే బాకీల బతుక్కి- మాధవి ప్రయాణం కొంచెం ఇబ్బంది కలిగించింది. అసలు అప్పులు ఎలా తీర్చాలని ఎప్పుడూ అనుకోలేదు. దెబ్బమీద దెబ్బ పడ్డట్లు ప్రతిసారీ ఏదో వంక ఇబ్బంది రావడంతో బాధపడటం ఆనవాయితీ అయిపోయింది సీతాపతికి.

మాధవి మాటలు పదేపదే గుర్తుకొచ్చేయి, 'ఎంత కాలం పెళ్ళికాని పరాయి అమ్మాయిని ఇంట్లో వుంచుకోవడం ?!!' -అన్న ప్రశ్న అతని చిన్న మెదడ్ని తొలిచేస్తోంది. ఏ ఆధారం, ఏ ఆదరణ లేని లతను ఇంటినుండి పంపెయ్యడం భావ్యంగా తోచలేదు. అలాగని జీవితాంతం పోషించడం తనలాంటి వారికి కష్టమే ?!!

* * *

చీకటి చల్లగా వుంది.

సన్నగా తుంపర పడ్తోంది. చెట్ల ఆకుల మధ్యనుంచి జారుతున్న నీటి బొట్లు నల్లముత్యాల్లా వున్నాయి. పగలు రాజీపడని జంటకి వాతావరణం రాజీ చేస్తోంది.

వరండాలో నిల్చున్న సీతాపతికి మీద పడ్తున్న వర్షం తుంపర చక్కిలిగిలి పెడ్తోంది. ఇంట్లో దీపం బద్ధకంగా చూస్తోంది.

మధ్యలో ఆకారం లేని మెరుపులు చీకటిని చీలుస్తున్నాయి. వర్షం వేగాన్ని పెంచుతోంది.

లత వూహల్లో విహరిస్తోంది.

'ఎంత మంచి మనిషి.... ఎంతో అదృష్టం చేసుకుంటేనేగాని ఇలాంటి భర్త దొరకడు... '- అని మనసులో మాధవి అదృష్టానికి అసూయపడింది. ఇన్నాళ్లూ అతని మంచితనం కదలకుండా కట్టేసింది. అతని మాటల్లో చల్లదనం వెన్నెలకు కూడా లేదు.

ఊహాలోకం నుంచి బయటపడ్డది లత.

ఎంతసేపటికీ మాట్లాడని సీతాపతిని చూసేసరికి నిత్య అతిధిని చూసినప్పుడు కల్గే కోపంలా చిరుకోపం వచ్చింది లతకి.

"ఆలోచనల్లో నిమగ్నమైనట్టున్నారు. ..?!"- దగ్గరకొస్తూ అంది లత.

సమాధానంగా తిరిగి చూసేడు సీతాపతి.

"చలిగా వుంది కదూ ?!!" _లత

"వర్షం పడ్తోంది కదా ?!!"

"భోంచేద్దామా ! ఆకలిగా వుంది...."-

మారు మాట్లాడకుండా కదిలేడు సీతాపతి.

"ఇలా మనిద్దరం వుండటం అంత మంచిది కాదేమో ?!"_ గోడమీద బల్లి కేసి చూస్తూ అన్నాడు.

"ఏం....?!!"_ లతకి ఏ అనుమానం కలుగలేదు.

"చుట్టుపక్కల వాళ్లు ఏమైనా అనుకుంటారేమో !;"_ ఇంకా ఏదో చెబ్దామను కొన్నాడు.

"నాకూ ఇలా మీ ఇంట్లో వుండటం బాగోలేదు... నా వుద్దేశ్యం.. లేనిపోని అనుమానాలకి తావివ్వడం మంచిదికాదేమోనని.... ఏం చెయ్యాలో తోచటం లేదు...."_ లత.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను...."

"నా ఖర్మ ఎలా రాసుందో ?!! మీరేం చెయ్యగలరు. ఎవరు ఎలా అవుతామో నిర్ణయించుకోలేము. తొందర్లోనే మీకు నా గురించి బాధలులేకుండా వుండటానికి ప్రయత్నిస్తాను...."_ లత గొంతులో మార్పు వచ్చింది. లత కళ్ళల్లో దీపం కాంతి మెరిసింది.

సీతాపతి చలించిపోయేడు. అప్రయత్నంగా ఆమె కన్నీళ్లు తుడిచేడు. అతని హస్త స్పర్శకి వూరట చెందింది. ఆ స్పర్శలో ఆత్మీయతకి ఆనందంతో వుక్కిరిబిక్కిరైయ్యింది.

ఆ రాత్రంతా సీతాపతికి కునుకు రాలేదు_ ఆలోచన్ల గజిబిజి... స్థిమితం దొరకని మనసు....క్షణాలు వేగంగా....వేడిగా కదిలిపోతున్నాయి.

* * *

రోజులు దొర్లిపోతున్నాయి.

కర్తవ్యం అర్థంకాని సీతాపతికి లత సమస్యలా తయారయ్యింది. అందరిలా తనూ ఆలోచిస్తే ఈ బాధపడే అవసరం వుండేది కాదు. కానీ తన నీడలో భయంలేకుండా విద్రపోయే మనిషిని ఆకలిగొన్న పులుల ముందు ఆహారంగా వుంచటానికి మనసొప్పటం లేదు. ధైర్యంచేసి నిర్ణయం తీసోకోడానికి తన బలహీనపు గుండె ఒప్పుకోవడం లేదు.









ఈ సమస్యకు ఏమిటని కుమిలిపోవడం తప్ప నిర్భయంగా నిర్ణయాన్ని తీసుకోలేక పోవడానికి తన నిస్సహాయస్థితి కూడా ఓ కారణం.

జీవితం మీద లత విరక్తిచెంది ఏదైనా అఘాయిత్యం చేస్తే....!? అన్న అనుమానం పెనుభూతంలా చుట్టేస్తోంది అనుక్షణం.

నిశ్చలంగా పారే ఏరుకి చెప్పకుండా వచ్చిన వరద బీభత్సంలా అతను గుండెకోతను అనుభవిస్తున్నాడు.

**4**

"మన సీతాపతి మళ్ళీ పెళ్ళిచేసుకొచ్చాడట....!!!"– ప్రపంచంలో అంతకన్నా గొప్ప వింత లేనట్లు ముసలి హెడ్‌గుమాస్తా అన్నాడు.

" అఁ..... నిజంగానే !!?"– మిగిలిన సోదర గుమాస్తాలు నోళ్లు తెరిచేశ.

"వీడి బ్రతుక్కి తోడు ఇద్దరా ?!!"?– ముక్కు మీద వేలేసుకొన్నాడు టైపిస్టు.

"ఇలాంటివాడని నేనెప్పుడూ అనుకోలేదు.... ఛీ . ఛీ...."– తన కూతుర్ని లేవదీసుకుపోయినంత బాధ అనవసరంగా చూపించేరు లావుపాటి క్లర్కుగారు.

"ఇంతకీ అ పిల్ల ఎవరో ?!!"– కుతూహలంగా అడిగేడు టెంపరరీ కుర్రాడు.

ఆఫీసుతోపాటు వూళ్లోకూడా ఈ వార్త వరదనీరులా పాకిపోయింది. కథలుగా చెప్పుకోవడానికి, కాలక్షేపానికి చోటిచ్చింది. దేశంలో ప్రముఖ వ్యక్తి మరణించినా చూపించనంత సానుభూతి చూపించేరు మాధవిమీద.

ఆ వీధిలో తమకు దక్కని భాన్సు సీతాపతికి దక్కిందని చాలా అర్జంటుగా అసూయచెందేరు చాలామంది.

"ఎవరెన్ని మాటలన్నా మన బంధం విడిపోదు...."- అని సీతాపతి కళ్ళతో చెప్పేడు లతకి. జనం కామెంట్సు విని హాయిగా నవ్వుకొన్నాడు. మిన్ను విరిగి మీదపడ్డా మాలో మార్పురాదు సుమా! అని హెచ్చరించినట్లు డాంబికంగా, హుందాగా రోజులు గడిపేస్తున్నా.... మనసులో మాధవి వచ్చింతర్వాత జరగబోయే పరిమాణాలను గూర్చిన భయం భయపెడ్తోంది. ఎంత నిబ్బరంగా వున్నా మాధవిని గురించిన ఆలోచన మొదలంగానే చీకట్లో చిన్నపిల్లాడిలా బెదిరిపోతున్నాడు.

లత కళ్ళల్లోని తృప్తిని— పీడకల చెదిరిపోయిందన్న ఆనందాన్ని- చావుకి బ్రతుక్కి మధ్యనున్న చీకటిలాంటి లోయనుంచి బయటపడ్డ అనుభూతిని చూసినప్పుడు సీతాపతి మనసు పారవశ్యంతో పొంగిపోయేది. దిక్కులేవి మనిషికి తనంటూ నీడను కల్పించేనన్న సంతృప్తి అతనికి మిగిలింది.

రాబోయే 'రేపు' గురించి అంతగా బాధపడలేదు. తను చేసింది మంచా, చెడా ?! అని మాత్రం తర్కించుకొన్నాడు.

లతలో ఎన్నో కొత్త కొత్త మార్పులు కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నాయి. కన్నీళ్ళకే అలవాటుపడ్డ కళ్ళల్లో కొత్త కాంతి....ఎన్నడూ లేని హుషారు ఆమె ప్రతి కదలికలోనూ గోచరిస్తోంది.

సీతాపతి వారంరోజులు కొత్త భాగస్వామితో వింత అనుభూతులు అనుభవించేడు.

* * *

సీతాపతి రెండో పెళ్ళి ముచ్చటై పదిరోజులు దాటిపోయింది.

ఓ రోజు....

ఉదయం వెలుగుతోపాటు మాధవి రిక్షాలో దిగింది. అప్పుడే కళ్ళుతెరిచిన సీతాపతికి మాధవిని చూడగానే నిద్రతాలూకు మత్తు- గతరాత్రి గుండెలమీద మల్లెలవాసన ఒక్కసారిగా దూరం అయ్యేయి.

ఎదురుగా వెళ్ళి సామాన్లు అందుకొన్నాడు. కోపంగా చూసింది మాధవి.

"అప్పుడే ఈ విషయం ఎలా తెల్సింది చెప్మా...."- సీతాపతిలో వున్న సీతాపతి అంగారుపడ్డాడు.

"పెళ్ళికి ఎందుకు రాలేదు ?!.... చుట్టాలంతా ఒకటే అడగటం మీరు రాలే

దేమని ...! అంత కొంపలంటుకుపోయే పనులేమున్నాయని రాలేదు....?!"- మాధవి గడపలోపల కాలుపెట్టగానే అడిగిన మొదటి ప్రశ్న.

ఏం మాట్లాడలేదు సీతాపతి.

మార్పులేని ఇంటిని మరోమారు పరిశీలించింది. కనుబొమలు పైకి వెళ్లేయి.

"బస్సులో వచ్చేవా అక్కయ్యా ?!"- లత పలకరింపు.

"....బస్సులోనే !!"- ముభావంగా అంది మాధవి. లతను చూడంగానే చిరుకోపం వచ్చినా నిగ్రహించుకొంది

"అక్కడికి వెళ్ళినప్పటినుంచి ఇద్దరు వెధవలకీ జర్వం.... అమ్మా నాన్నా ఇద్దర్నీ అక్కడే వుంచమన్నారు.... అందుకే వదిలేసి వచ్చా...."- కాఫీ తాగుతూ అంది మాధవి.

"జ్వరంతో వుంటే నువ్వెందుకొచ్చేవ్ ?! పోనీ తగ్గేక రాకపోయావా ?!"- తడబడ్డాడు సీతాపతి.

"అసలు నేను రాకపోతేనే బాగుండేలా వుంది మీకు...."- లతకేసి చూస్తూ అంది మాధవి.

నోరు జారినందుకు నాలిక్కరుచుకొన్నాడు సీతాపతి.

"ఇలా రండి.... మీతో మాట్లాడాలి...."- పెరట్లోకి వెళ్తూ అంది మాధవి.

లత మొహంలో కత్తిగాటుకి నెత్తురుచుక్క లేదు. 'ఇవ్వాళ్టినుంచి నా బ్రతుకేమిటో ?!'- అన్నట్లు చూసింది. అంతకన్నా జాలిగా చూసేడు సీతాపతి.

"నే నొచ్చేసరికి ఆ అమ్మాయికి ఏదో దారి చూపించమన్నానా ?! ఇలా ఎంత కాలమని పోషించగలం మనం డబ్బులు రాసులు పోసుకొని లేంగా"- నిలదీసింది.

"నువ్వు చెప్పినట్లే దారి చూపించేను...."- గీతోపదేశం తర్వాత అర్జునుడిలా బొత్తిగా తడబాటులేకుండా అన్నాడు.

"మరయితే ఇంకా ఇక్కడే వుందేం ?!"

సీతాపతి ఎటో చూస్తున్నాడు.

ఇద్దరి మధ్యా మాటలు లేవు. ఏం చేప్తాడో విందామని గుడ్లప్పగించి చూస్తోంది మాధవి. ఎలా చెప్పాలో అర్థంకాక తికమకపడుతున్నాడు సీతాపతి.

"చూడు మాధవీ.... మన జీవితాల్లో అనుకోని మార్పు జరిగింది. ఇందులో ఎవరి ప్రమేయం లేదు. నే చేసిన పనిని నీవు సమర్థిస్తావన్న ఆశలేదు. కానీ ఎందుకు చేసేనో కనీసం మంచిమనిషిగా ఆలోచిస్తావన్న నమ్మకం వుంది...."

"ఇంతకీ ఈ ఉపోద్ఘాతం దేనికో అర్థంకావటంలేదు. నా కేదో భయంగా వుంది. త్వరగా చెప్పండి...."- అంది ఆదుర్దాగా ;

"స్థిమితంగా విను. నేనూ లత పెళ్ళిచేసుకొన్నాం...."- నిదానంగా అన్నాడు. అవాక్కైయిపోయింది మాధవి.

ప్రపంచం అంతా గిర్రున తిరిగింది- సముద్రాలు ఘోషించేయి- ఎక్కడో ఒంటరి నక్క- అరుపు- విరిగిపడ్తున్న చెట్లు క్షణం కళ్ళముందు కనుపించేయి. కన్నీళ్ళల్లో సీతాపతి మసకగా, వికృతంగా, భయంకరంగా కన్పించేడు. రక్తం నురగలు కక్కుతోంది. కన్నీళ్లు వరదలా కారిపోతున్నాయి. చలనరహితం అయ్యింది మాధవి.

వీళ్ళద్దర్నీ చూస్తున్న లత కారడవిలో సంస్కారంలేని శిల్పంలా వుంది. వర్షం తాకిడికి తట్టుకోలేని గడ్డిపోచలా దీనంగా వుంది వదనం.

దిమ్మరపోయిన మాధవి కోలుకోలేదు. ఆ తర్వాత జరగబోయే సంగ్రామం ఎలా వుంటుందో సీతాపతికి తెలుసు.

అతని వ్యూహ తారుమారయింది.

ఆ రోజంతా మాధవి మాట్లాడలేదు. భోజనం చెయ్యలేదు.

శవాన్ని తరలించినట్లుగా వుంది ఆ ఇంట్లో నిశ్శబ్దం. ఎవ్వరూ నోరు మెదపలేదు.

కాలాని కేవేం పట్టనట్లు దొర్లిపోయింది.

*   *   *

రోజూ పరామర్శలతో పలకరింపులతో- ఆమెకు జరిగిన అన్యాయానికి తక్షణం తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి హెచ్చరించి వెళ్ళిపోతున్నారు. ఎవరైనా పలకరించగానే భోరున ఏడుస్తోంది మాధవి. గతించిన రోజులు తల్చుకొని కుమిలిపోతోంది.

మానసికంగా, శారీరకంగా బాగా దెబ్బతింది మాధవి.

## 5

రాక్ హడ్సన్‌లా అతనుండడు.

"నేను అందగాడ్నే !"- అని అతనెప్పుడూ అద్దం చూసుకొంటున్నప్పుడు అనుకోలేదు. అతని మాటలు తియ్యగా వుంటాయి. కొద్దిసేపు అతన్తో మాట్లాడితే ఏదో తెలీని అప్యాయత ఏర్పడుతుందని మాత్రం ఆడ, మగ ఏకగ్రీవంగా సర్టిఫికెట్ ఇచ్చేరు కాలేజీలో చదువుకునే రోజుల్లో ...

అతగాడు శ్రీకృష్ణుడిలా అమ్మాయిలమధ్య హుషారుగా కబుర్లు చెప్తూ తిరుగుతుంటే ఆ అదృష్టాన్ని చూసి చాలామంది అసూయపడ్డ మాట చాలా నిజం.

ఆ కృష్ణుడి పేరు శ్రీనివాసరావు.

ముద్దుపేరు వాసు.

చదువు ముగించి రెండు సంవత్సరాల గుమాస్తాగిరి వెలిగించగానే ఎంత వద్దంటున్నా మొహమాట పెట్టి పెళ్ళి చేసేరు. ఆ తర్వాత అతను మొహమాట పడకుండా-తన తప్పు బొత్తిగా లేదని ఇద్దరు పిల్లలకి తండ్రి కూడా అయ్యేడు.

మెల్లగా పడ్తున్న అడుగులు ఆగిపోయేయి. ఆ ఇల్లు ఎంత పాతదో అతనూహించటం లేదు.

వరండాలోకి వచ్చిన వాసుకి అప్రయత్నంగా ఎదురు గోడకి బూజుపట్టిన ఫోటోమీద పడింది దృష్టి. దాన్ని చూడంగానే పది సంవత్సరాలు వెనక్కి-పోయి ఆలోచించేడు. ఏవో మధుర స్మృతులు 'కట్' అయిన పాత సినిమా రీలులా గిర్రున తిరిగేయి.

నుయసభలో కాలుపెట్టి దారీ తెన్నూ అర్థంగాని ధుర్యోధనుడిలా వున్న కొత్త వ్యక్తిని చూడగానే "దొంగ .. దొంగ... " అని అరవలేదు లత. సినిమాలో విధివశాత్తు దాసీరూపంలో వున్న జమీందారుగారి అమ్మాయిలా వున్న లతను చూడగానే జంగుతిన్నాడు వాసు.

ఆమె సౌందర్యం చూసి నివ్వెరపోయేడు. వెలిసిపోయిన వాయిల్ చీరలో, అశోకవనంలో సీతలా వున్న ఆమెను చూడగానే ఏం మాట్లాడాలో అర్థం కాలేదు.

"కొంపదీసి మరో ఇంటికి రాలేదు కదా !!! ఆ ఫొటోలో వున్నది సీతాపతేనా ?!" అన్న అనుమానం మెదిలేసరికి మళ్ళీ ఫొటోను, ఆమెను వింతగా చూసేడు.

"ఇది సీతాపతి ఇల్లేనాండి ?!!"- పరిశీలించి, పరిశోధించిన పిమ్మట అడిగేడు.

"అవునండీ . !! మీరు కొత్తగా వచ్చేరా ఈ వూరు ?!!"-

"ట్రాన్సఫర్ మీద మొన్న వచ్చేను. నిన్ననే కలుద్దామంటే కుదరలేదు . ఇంట్లో లేడా ?!"-

లత ఏదో మాట్లాడబోయింది.

"నిఃజడే వున్నాడు . కూర్చోండి !"- గుమ్మం దగ్గర కొత్త కంఠం సౌమ్యంగా విన్పించింది. గబుక్కున తలెత్తి చూసేడు.

"ఫర్వాలేదు లెండి....."- చిరు మొహమాట పడ్డాడు.

"మంచినీళ్లు కావాలా ?!"- మాధవి.

"ఇప్పుడే కాఫీ తాగొస్తున్నాను.... సీతాపతి ఎన్ని గంటలకు వస్తాడో చెప్ప గల్రా ??"-

"కొద్ది సేపట్లో వస్తారు....."- లత సమాధానం.

ఇంకేం అడగాలో వాసుకి తెలీలేదు.

వాసు, సీతాపతుల స్నేహంకి దగ్గర దగ్గర పాతికేళ్ళ వయస్సు. చిన్నప్పుడు లాగుల్లేకుండా పెరిగినప్పటినుంచి - వంటిమీద బట్టల్లేని అమ్మాయిల గురించి మాట్లాడుకునే దాకా వాళ్ళిద్దరికీ ఏ అభిప్రాయంలోనూ ఏకీభవించేవారు కాదు. అయినా స్నేహం చెడిపోలేదు. సీతాపతికి మిగిలిన మంచి స్నేహితుడు వాసు.

మూడు నెలలు పెట్రోల్లో ముంచి అంటించినా అంటుకోని పడకుర్చీలోంచి వస్తున్న వొగత్ని చూసి కించిత్ ఆశ్చర్యపోయేడు సీతాపతి. తన రెండో పెళ్ళి తర్వాత అంత చొరవగా ఇంట్లో కూర్చున్న వ్యక్తి ఎవరో అర్థం కాలేదు.

"ఓరేయ్.....!! నువ్వట్రా ?!!.... ఎలా వున్నావ్ ?! ఎప్పుడొచ్చావ్ ?!"- ఆశ్చర్యం పటాపంచలై సంబరపడ్తూ అడిగేడు సీతాపతి.

"ట్రాన్స్ఫర్ అయిందిరా! ముందుగా రాద్దామనుకొన్నాను. అలవాటు లేని పనిచేస్తే అదోలా వుంటుందని రాయలేదు."-

"సంసారంతో దిగేవా ?!"

"సంసారాన్ని సాగరంలో తోసేసి నేను మాత్రం ఇటొచ్చేను. అదీ క్లుప్తంగా కథ...."- తాపీగా అన్నాడు వాసు.

"సాగరం అంటే ?!"-

"మా మావగారి కొంప...." -యోగిలా అన్నాడు నిదానంగా.

"మాధవీ....మాధవీ...." -పిలవటం మానేసి అరిచేడు దరిదాపు. కానీ అరుపు కన్నా ముందే మాధవి, లత గుమ్మంలోనే వున్నట్లు సీతాపతి స్నేహితుడ్ని చూసిన తన్మయత్వంలో మరచిపోయేడు.

"ఇక్కడే వున్నారా....!....వీడి పేరు వాసు.... నా చిన్ననాటి స్నేహితుడు. మన పెళ్ళికి కూడా వచ్చేడు. ఆ తర్వాత ఇప్పుడే ఆ వెధవ మొహం చూపించడం.... ఆమె నా భార్య మాధవి. గుర్తులేదురా ?!!"

ప్రతి నమస్కారాలు ముగిసేయి. కాని వాసు సందేహం నివృత్తి కాలేదు.



"ఈమె పేరు లత...."- వాక్యం పూర్తిచెయ్యకుండానే మాధవి వైపు చూసేడు. మెరుపులా గుమ్మంలోంచి గదిలోకి వెళ్ళిపోయింది.

"సంవత్సరం కాలేదు మా పెళ్ళయి..." సీతాపతికేసి చూస్తూ అంది లత. ఆశ్చర్యంగా చూసేడు వాసు. సీతాపతికి ఇద్దరు భార్యలన్న విషయం ఓ విధంగా మతి చెడగొట్టింది.

"ఏవండీ. !!"- లోపల్నించి కొంచెం గట్టిగానే విన్పించింది మాధవి గొంతు.

"మాట్లాడుతూ వుండు ఇప్పుడే వస్తా ..."- లోపలికి వెళ్లేడు సీతాపతి అఫీసరు కేక విన్న గుమస్తాలా .

వాసుకి కథ కొంచెం అర్థమైనట్లు అనిపించింది. లోపల మాటలు మెల్లగా విన్పిస్తున్నాయి. ఇబ్బందిగా కూర్చున్న వాసుకి ఎంత మరల్చుదామన్నా దృష్టి లతమీదకే పాకుతోంది.

"మీది ఈ వూరేనా ?!!"- శూన్యంలోకి చూస్తున్న లత నుద్దేశించి అన్నాడు.

అవునన్నట్లు తలాడించింది లత.

"మీ పేరెంట్స్ ఎక్కడుంటారు.. ?!"- డిటెక్టివ్‌లా అనలేదు.

"చిన్నప్పుడే పోయేరు...."- నిర్లిప్తంగా అంది.

"క్షమించండి. "

"ఫర్వాలేదు "

మౌనం వాళ్ళకేసి చూస్తోంది. ఆమె ఏదన్నా మాట్లాడుతుందేమోనని ఎదురు చూసేడు. కానీ ఆమె ఆ పని చెయ్యలేదు.

"ఓరేయ్ పద.... అలా వీధి చివరిదాకా వెళ్లొదాం .. -" వస్తూనే అన్నాడు సీతాపతి.

"మళ్ళీ కలుస్తానండి ... వస్తాను.. " వెళ్ళబోతూ అన్నాడు వాసు.

* * *

వెన్నెల చెట్లమీద పరచుకుంటోంది.

పక్కింట్లో రేడియో పాటల శబ్దం- అది ఇల్లో, హోటలో అర్థంకాకుండా వుంది. మధ్య మధ్యలో రోడ్డుమీద నవ్వులు ఇంట్లోకి దూరుతున్నాయి.

గదిలో దీపం నిశ్చలంగా వెలుగుతోంది.

అక్కడ చాలాసేపటినుంచి నిశ్శబ్దం గూడుకట్టుకొని వుంది.

"కొన్ని సందర్భాల్లో ఆవేశం అర్థంచేసుకునే శక్తిని చంపేస్తుంది.... ఆ క్షణంలో తీసుకొన్న నిర్ణయాలకు పర్యవసానం కొద్ది కాలం తర్వాతగాని తెలీదు. ఏమంటారు ?!"- అన్నాడు వాసు.

లత వుగితాడు ముందు నుల్చున్న మనిషిలా శూన్యంలోకి చూస్తోంది.

"నేనప్పుడున్న పరిస్థితుల్లో ఎవరైనా అలానే చేస్తారు పొరపాట్లు మనం చేస్తాం కాబట్టే మనల్ని మనుషు లన్నారు... "- తన మదనకి మాటల రూపం ఇచ్చింది లత.

మళ్ళీ మాట కదల్లేదు.

"ఇంకా సీతాపతి రాలేదేం చెప్మా ?! ఈ రోజు పిక్చరుకి వెళ్దాం అనుకున్నాం కదా .!"- టాపిక్ మారుస్తూ అన్నాడు.

"ఆయ నెప్పుడూ అంతే !!"- కోపంగా అంది లత.

ఆమె గాజుల శబ్దం సితారులా వుంది. ఆమె కళ్ళల్లో వెన్నెలనీడ అందంగా వుంది. జడ సవరించుకుంటున్న లత వున్నట్టుండి బొమ్మలా బిగుసుకుపోయింది. అందుకారణం గుమ్మంలోంచి తొంగిచూసి వెళ్ళిపోయిన మాధవిని చూసి. పళ్ళ మధ్య పెదిమ చిక్కుకుంది. అసహ్యం, కసి పెరిగేయి

"నిజంగా నాకు సినిమా చూడాలనే వుంది. మీరు రేపు తప్పకుండా రండి... ఆయన వచ్చినా రాకపోయినా మనిద్దరం వెళ్దాం మర్చిపోకగా !!"- మాధవికి వినిపించేలా గట్టిగా అంది.

"మతిమరుపు మీ ఆయనకుంది నాకు లేదండోయ్ నాకు ఏం తోచడం లేదు. వెళ్తానండి. ఆయనొస్తే వచ్చి వెళ్లేనని చెప్పండి"- అంటూ కుర్చీలో నుంచి లేచేడు.

గుమ్మందాకా వెళ్ళింది లత.

"మీరు అనవసరంగా వేటి గురించి ఆలోచించకండి. కాలమెప్పుడూ ఒకలా వుండదు వస్తాను రేపు రెడీగా వుండండి"

వెళ్తున్న వాసుకేసి చూస్తూ నిలబడిపోయింది లత. రోడ్డుమీద పోయే జనం గుమ్మంకేసి చూడకుండా మాత్రం వెళ్ళటంలేదు.

అవేం పట్టించుకోలేదు లత. నిరీక్షణలో తన్మయత్వం చెందుతున్నట్లు గుమ్మానికి చేరగిలపడింది. లోపల గుమ్మంలో అలకబూనిన సత్యభామలా వుంది మాధవి. ఆవిడ కళ్ళల్లో మంటలు ఎర్రగా వున్నాయి.

కనీసం గడ్డిపువ్వు కూడా తేలేని కృష్ణుడిలా నీరసంగా సీతాపతి వీధి గుమ్మం లోకి అడుగుపెట్టేడు. స్థాణువులా వున్న లతను చూసేడు. తన రాకను లత గమనించలేదని ఇట్టే పసిగట్టేడు.

"లతా ! ఏవిటి అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్ ?!"- పలకరించేడు.

"మిగిలింది-చెయ్యగలిగింది అదొక్కటేగా !!"- అనేసి సీతాపతి అయోమయంలో పడే లోపల ఇద్దరూ కలసి లోపలికి వచ్చేరు. ఎదురుగా బలివ్వాని భక్తుల వైపు చూసే అమ్మవారిలా, లేడి దొరకని పులిలా గుమ్మంలో మాధవి ఎదురైంది. చూడంగానే గతుక్కుమన్నా అలవాటయిపోయిన కధ కావటంతో పులితోలు కప్పుకొన్నాడు సీతాపతి.

"పిల్లలు పడుకొన్నారా ?!"- ఆమెకేసి చూడకుండానే అడిగేడు.

"ఈపాటికి పడుకునే వుంటారు మీవాళ్ళు !!"- గిర్రున లోపలికి వెళ్ళిపోయింది. చురుకుమనే వాత పెట్టినట్లయింది సీతాపతికి.

బట్టలు మార్చుకొని పడకుర్చీలో చేరి శరీరానికి విశ్రాంతి నిచ్చేడు. అత నెప్పుడూ ఎవర్నీ అడుగని ప్రశ్న మెదడ్ని తొలిచేస్తోంది సుఖం అంటే ఏమిటని ?!

గంభీరమైన అమావాస్యనాటి సముద్రంలా ఎన్నో బాధల్ని తనలో ఇముడ్చు కుంటున్నా అడ్డుకెరటాలు గట్టుదాటతాయేమోనన్న భయం మాత్రం అతన్ని చుట్టెయ్యని క్షణాలు చాలా తక్కువ.

కుర్చీ పక్కన మోకాళ్ళమీద తలానించి కూర్చున్న లత సీతాపతి కాళ్ళ మీద పిచ్చిగీతలు గీస్తోంది.

"అన్నం ఇక్కడికే తెమ్మంటారా ?!"- గుమ్మంలోకి వచ్చిన మాధవి అంది.

"కాసేపాగి తింటాలే .. ముందు మీ ఇద్దరూ కానీయండి . " సౌమ్యంగా అన్నాడు. వచ్చిన అలకల మొలక గుమ్మంలో చేరగిలపడింది మారుమాట్లాడ కుండా....

"వాసు వచ్చేడా ?!!"- చెదిరిపోతున్న పొగని చూస్తూ అడిగేడు. అడిగింది ఎవర్నో అతనికే తెలీదు.

"వచ్చినా నాతో ఎందుకు మాట్లాడుతారు.. !!"- మాధవి.

ఆమె మాటల్లోని వ్యంగం లత గుండెను గుచ్చుకుంది. పొంగివచ్చిన కోపం వేడి శ్వాసగా మారిపోయింది.

సీతాపతికి నోరుజారేనేమో నన్న అనుమానం వచ్చింది. అందుకే నోట్లో పాలతిత్తి పెట్టుకొన్న బుజ్జాయిలా బుద్ధిగా నోరు మెదపలేదు.

"ఇప్పటిదాకా కూర్చుని ఇప్పుడే వెళ్లేరు. . "- మాధవివైపు చూస్తూ అంది లత.

అన్ని శబ్దాల్ని మింగేసిన నిశ్శబ్దం ముగ్గురి మధ్యా చోటుచేసుకొంది.

"ఏవండీ. మరోసారి ఇలా రండి...."- ప్రశాంతతలో ప్రళయ ప్రభంజ నంలా వుంది మాధవి పిలుపు.

సీతాపతి ఏదో లోకంలో వున్నాడు.

"ఏవండీ ! మిమ్మల్నే !!"- రెట్టించింది మాధవి.

కదలక తప్పలేదు సీతాపతికి. లత నెమ్మదిగా లేచి అరుగుమీదకు వెళ్ళింది.

"ఎందుకు పిల్చేవ్ ?!"- గదిలోకి వస్తూ అడిగేడు.

"మన సంసారం సవ్యంగా వుండటం ఇష్టంలేదా ?! ఇప్పటికొచ్చిన అప్రతిష్ట చాలు. ఛీ ..ఛీ.. రోజురోజుకీ ఈ కొంపలో వుండాలంటే అసహ్యం వేస్తోంది.. ."- అసహ్యాన్ని వెళ్ళగక్కింది.

.. ఇద్దరు వ్యక్తులు కత్తులతో ఆ మేడ గోడ దూకారు..
· గోడ గడియారం ఒకటి కొట్టింది...




"కొంచెం నెమ్మదిగా మాట్లాడవే....!!"- సీతాపతి ఇబ్బంది.

"ఎంతసేపూ నా నోరు నొక్కాలనే తప్ప ఆవిడగారు చేసేపన్లు మటుకు కనబడవు...."- ఉక్రోషం పెరిగింది.

"ఇప్పుడేమయింది....?!"- అమాయకంగా అన్నాడు.

"ఏం కాలేదు?!"- ఎదురు ప్రశ్న.

మేష్టారి ప్రశ్నకు సమాధానం దొరకని విద్యార్థిలా అడకత్తెరలో పడ్డాడు. మెల్లగా గదపదాటే ప్రయత్నం చెయ్యబోయేడు.

ఆత్మహత్య చేసుకోడానికి ఉరి సులభమేనా?! లేక బావిలో దూకితే బాగుంటుందా?! అన్న అనుమానం వచ్చినట్లు ఆగిపోయేడు మాధవి కోరచూపుకి.

"వాళ్ళిద్దరూ వీధిగుమ్మంలో చేరి వికవికలు పకపకలు....ఛీ....ఛీ....బజార్లో తలెత్తుకొని తిరగ్గలమా?!.... ఇప్పటికయిన నిర్వాకం చాలదూ?!"-

"ఎవరి సంగతే నువ్వు చెప్పేది?!"- కొంచెం చిరాగ్గా అన్నాడు.

"ఎవరి సంగతో అయితే మీకుచెప్పి ఏడవడం దేనికి?! మన రాణిగారి సంగతే! ఛీ.... సిగ్గులేకపోతేసరి...."- పెదాన్ని విరిచి మరీ అంది.

ఎవరికి సిగ్గులేదో అర్థంకాని సీతాపతి పరిస్థితిని వూహించి గదిలోంచి పది సంవత్సరాల కఠిన కారాగారశిక్ష అనుభవించి విడుదలైనట్లు బయటకువచ్చేడు.

గుమ్మంలో లత రోడ్డుకేసి చూస్తోంది.

సీతాపతి కాళ్ళు చెప్పుల్లో దూరేయి. రోడ్డెక్కిన సీతాపతిని చూస్తూ వుండిపోయింది లత. గాలికోసం గుల్లల్లోంచి బయటకొచ్చే నత్తలా చీకటి ఆకాశం

లోకి చూసేడు. గాలి సవ్వడి లేదు. చీకటి చిక్కగా వుంది. మున్సిపాలిటీ దీపాలు మొహమాటంకోసం వెలుగుతున్నాయి.

తనకన్నా ముందుకు వెళ్ళిపోతున్న నీడను చేరాలనే ఆశవున్న మనిషిలా సాగుతున్న నీడ చూపించే దారిలో సీతాపతి మెల్లగా నడుస్తున్నాడు.

## 6

సంధ్య ముగుస్తోంది.

పక్షులు గూటికి చేరుకుంటున్నాయో లేదోగాని సీతాపతి ఇంకా గూటికి చేరుకోలేదు. రోజులు గడుస్తున్న కొద్దీ సీతాపతి ఇంటికి ఆలస్యంగా రావటం ఇద్దరు సతులు గమనించేరు.

"అ రాకపోవడమే మంచిది వచ్చేంచేయాలి .. ?! ఓ ముచ్చటా పాడా !."- అని మాధవి అనుకొని వుండొచ్చు.

"సరదాగా షికారుకి వెళ్ళడానికి లేదు... కులాసాగా కబుర్లు చెప్పుకోడానికి లేదు.... వచ్చినప్పటినుంచి ఏవోవొక గొడవేగా ?!"- అని లత మాత్రం ఖచ్చితంగా అనుకొంది.

"విధిలేక ఇంటికి చేరుకోవడమేగాని లేకపోతే హాయిగా ఏ చెట్టుకిందో బ్రతికితే హాయి.. "- అని సీతాపతి మాత్రం పదేపదే అనుకొన్నాడు.

మనం మంచి అనుకొన్నది లోకందృష్టిలో ఎందుకు చెడ్డగా కన్పిస్తుందో అర్థంకాలేదు. ఒక నిస్సహాయురాలికి చేయూతనివ్వడంలో తప్పేమిటో అంతు బట్టలేదు. అతను అందరితో మాట్లాడ్డం మానేసేడు. వంటరిగా వలయంలా వున్న బాధల గాథల్ని తవ్వుకోవటం రోజూ దైనందిన కార్యక్రమాల్లో ఒకటై పోయింది.

* * *

"నిన్నకూడా ఇలానే చేసేడు . మరీ ఇంత మతిమరుపు పీనుగై పోయే దేవిటండీ ?!"- వాచీ చూస్తూ ఓ మోస్తరు కోపంతో అన్నాడు.

"ఏదేనా పనుండి రాలేదేమో .రాత్రి పడుకునేటప్పుడుకూడా చెప్పేను "- అంది లత.

"వీడొచ్చేసరికి సెకండుషో లాస్టసీన్‌కి చేరుకొంటాం...."- రోడ్డెక్కిచూస్తూ అన్నాడు.

లత మాట్లాడలేదు.

వాసు వీధిగుమ్మం దగ్గరకొచ్చి చూసేడు. సీతాపతి జాడ కనుచూపు మేరలో కనబడలేదు.

క్షణం తర్వాత మళ్ళీ లోపలికొచ్చేడు.

"పోనీ మనం వెళ్దామా?!"–

సర్రున కోడెత్రాచులా బుసకొట్టలేదు లత. ఆశ్చర్యంగా అసలు చూళ్ళేదు. చిరాగ్గా మొహం చిట్లించలేదు కానీ ఏం మాట్లాడలేదు.

"మీ కేమైనా అభ్యంతరం అయితే వద్దులెండి!"–లత పక్కనే కుర్చీలో కూర్చుంటూ అన్నాడు వాసు.

పువ్వుల నవ్వులా నవ్వింది లత. మరోసారి గుమ్మంకేసి చూసింది.

"ఆవిడేమన్నా అనుకుంటుందేమోనని.."– ఎటో చూస్తూ అంది లత.

"ఆవిడ్నికూడా రమ్మందాం?!!"

గబుక్కున వాసువైపు చూసింది. పిలిచే ప్రయత్నంలో గదిలోకి వెళ్ళేడు.

"మీరూ సినిమాకి రాకూడదూ ..?!"– మాధవితో అన్నాడు

"మీరు వెళుతున్నారా?!"

"అంటే మీరుకూడా వస్తే బాగుంటుందని .. కాసేపు కాలక్షేపంకూడా అవుతుంది కదా?!"– నవ్వుతూ అన్నాడు వాసు.

"సినిమాలు చూడ్డం మానేసేను. మీరు వెళ్ళండి అయనొచ్చేసరికి ఎవ్వరం ఇంట్లో వుండకపోతే బాగోదు."– అంటూ లేచి వంటింట్లోకి వెళ్ళింది మాధవి.

"మనం వెళ్దాం రండి....!"– బయిటకొస్తూనే అన్నాడు వాసు.

క్షణం ఆలోచనలో పడింది లత.

"నేను సినిమాకి వెళ్తున్నానక్కయ్యా!!"– గోడకు చెప్పినట్లు చెప్పి సమాధానంకోసం ఎదురుచూడకుండా బయిటకొచ్చింది.

భూకంపం వచ్చింది–ప్రపంచంలో ఎవరూ కనీవినీ ఎరుగని వింత– పనిచేస్తున్న వాళ్ల కొంపలు కూలిపోయినట్లు గబగబా గుమ్మాల్లోకి వచ్చేరు. కరెంటుకన్నా, వెలుగుకన్నా వేగంగా జనానికి ఈ విషయం తెల్సిపోయింది– గుమ్మాల్లో అమ్మలక్కలు పోగయ్యేరు.

అందరూ బొమ్మల్లా బిగుసుకుపోయేరు.

అజంతా గుహల్లో వూపిరిపోసుకొని సరదాగా ఆ వూరు చూద్దామని వచ్చిన శిల్పంలా లత.

ఆమె పక్కన నడుస్తున్నది సీతాపతి కాదు.

వింతగా చూస్తున్న జనంకేసి చూళ్లేదు లత. ఇబ్బందిగా నడుస్తున్నాడు వాసు. వాళ్ళ ఆశ్చర్యం అర్థంకాక పక్కనే నడుస్తున్న లత కళ్ళల్లోకి చూసేడు. అందరిమీద అసహ్యం ఆమె కళ్ళల్లో స్పష్టంగా కన్పించింది.

వీధి మలుపు తిరిగేదాకా అచ్చెరువొందేరు చుట్టుపక్కలవాళ్లు. వీధి గుమ్మం లోకి వచ్చింది మాధవి.

పని వదిలేసి వింతను చూసిన అమ్మలక్కలందరూ ఒక్కుమ్మడిగా మాధవిని చుట్టుముట్టేరు.

అందరి విసుర్లు వోపిగ్గా వింది మాధవి.

కోపాన్ని దిగమింగుకోలేకపోయింది. ఏం చెయ్యాలో తోచక మాధవి మెరుపులా ఇంట్లోకి పోయి కుర్చీలో పడింది.

* * *

చీకటి బాగా చిక్కబడింది.

ఇంట్లో దీపం వెలిగించాలన్న ధ్యాస రాలేదు.

రిక్షా గంటల మోతలతో నిమిషాలు కరిగిపోతున్నాయి.

చాలా సేపు కుర్చీలో వుండిపోయింది మాధవి.

గబుక్కున కళ్ళు తెరిచింది.... క్షణం తనకేం అర్థంకాలేదు.... తనెక్కడుందో అర్థంకాలేదు.... చీకటి గుయ్యారంగా వున్న ఇల్లు చూడగానే గట్టిగా అరిచినంత పనైసింది.

ఎదురుగా స్తంభానికి ఆనుకొని తెల్లటి చొక్కా మనిషి....

'అరిస్తే పొడుస్తాడేమో ?!'— అనుకొంది. 'ఇప్పుడేం చెయ్యాలి ?!'— అనుమానం వచ్చింది. కలో వాస్తవమో తెలీలేదు. నిశితంగా పరికించి చూసింది.... కల కాదు.... మరి స్తంభాన్ని ఆనుకొన్న వ్యక్తి ఎవరు ?!!

స్కూల్ ఫైనల్ తప్పినప్పుడు చదివిన డిటెక్టివ్ సాహిత్యం ఒక్కసారి గిర్రున మనసులో సుడులు తిరిగింది.

భయంగా కుర్చీలోంచి లేచింది.

తెల్ల చొక్కా కదిలింది....

నుదిటిన చెమటలు పట్టేయి. భయంతో శరీరం వొణికిపోయింది. తత్తర పడింది.... వెంటనే ధైర్యాన్ని కూడదెచ్చుకొంది.

"ఎవరు మీరు ?! ఏం కావాలి ?!"— గట్టిగా అంది.

"కొంపలో దీపం పెట్టకుండా కూర్చున్నావేం ?!"— అంది తెల్లచొక్కా.




అవిరించిన భయం ఆమడదూరం పోయింది.

"ఇందాకటి నుంచీ మాట్లాడరేం.... భయంతో ఛస్తుంటే!!"- కోపంగా అంది.

లేచి దీపం వెలిగించింది.

దీపం వెలుగులో భర్త మొహంలోకి చూసింది.... గుప్పుమంటున్న వాసనకి కళ్ళు తిరిగేయి మతి చెడింది మాధవికి.

సీతాపతి నరకంనుంచి స్వర్గంలోకి ప్రయాణిస్తూ వింత అనుభూతులు పొందుతున్నాడు. మందు మహాత్యం ఇన్నాళ్లూ తెలీనందుకు చాలా బాధపడ్డట్టు కన్పిస్తున్నాడు. తెలివొస్తే తప్పకుండా మందు కనిపెట్టినవాడ్ని అర్జంటుగా అభినందించొచ్చు బహుశా!

వీధి గుమ్మంలో నవ్వుల సవ్వడి.

మాధవి గుమ్మంకేసి చూసింది.

లత గుమ్మంలో నుల్చుని వాసుతో మాట్లాడుతోంది.

కోపం తారస్థాయికి చేరుకొంది మాధవికి. ఒళ్లు వశం తప్పింది. బోను లోంచి బయటపడ్డ పులిలా ఒక్కసారి చూసింది.

లత మెల్లగా అడుగులేసుకుంటూ వచ్చింది.

పులికి అరిచే ఓపిక లేనట్లు లతను చూసి తుపాకీని చూసినట్లు చూస్తూ వుండిపోయింది.

లత సీతాపతిని గమనించలేదు.

బట్టలు మార్చుకొని వచ్చింది.

వరండాలోని కుర్చీలో రిట్రెంచ్‌మెంటులో వుద్యోగంపోయిన గుమాస్తాలా వున్న సీతాపతిని చూసి భయపడింది.

"ఏమైంది అలా పడుకొన్నారు !!"_ అన్నట్లు మాధవికేసి చూసింది.

"తాగటం మొదటిసారి గనక .."_ అని గదిలోకి వెళ్ళిపోయింది.

సినిమా చూసిన ఆనందం ఇట్టే ఎగిరిపోయింది.

సీతాపతికేసి చూసింది.

అతనిలో చలనం లేదు. లత దృష్టి మరల్చలేదు.

ఆకాశం జుట్టు విరబోసుకొన్నట్లు చీకటి.

గదిలో దీపం వెల్తురు వరండాలో పడ్తోంది. పడిన ఆ కాస్తమేరా చీకటి పారిపోయింది.

కాలం కరగటం లేదు. చీకటి చెదిరిపోవటం లేదు.

ఆ రాత్రి ఎవ్వరికీ భోజనాలులేవని చెప్పొచ్చు. గదిలో మాధవి-వరండాలో లత-కుర్చీలో సీతాపతి-వాళ్ళ ముగ్గురికీ ప్రాణాలు వున్నాయో లేదోనన్న అనుమానం వస్తుంది చూస్తే !!

నియాన్ లైట్ల కాంతిలా మెరుస్తున్న కళ్ళతో ఓ గండుపిల్లి పక్కింట్లో పాలు తాగి ఆ ఇంట్లోకి పట్టాభిషేకం చేయించుకోడానికి వస్తున్న యువరాజులా ఠీవిగా వచ్చింది.

## 7

ఈడొచ్చిన ఆడపిల్ల కోర్కెలా కొత్త సంవత్సరం వచ్చింది.

నూతన వధువులా కళకళలాడుతూ రాలేదు. మొగుడు చావబాది పెళ్ళినాటి కట్నం తాలుకు బకాయి తెమ్మని పుట్టింటికి పంపివేసిన పాత ఇల్లాల్లా వచ్చింది. రాజకీయ నాయకుడు ఐదుసంవత్సరాల తర్వాత మళ్ళీ ఓట్లకోసం నవ్వేనవ్వులా ఆ కొత్త సంవత్సరం సీతాపతికి పాతగానే వుంది.

కాలంతోపాటు దేశంలో చాలా మార్పులొచ్చేయి అని అతగాడికి తెలీదు. మార్కెట్టులో నూనె ధర విపరీతంగా పెరిగిపోయిందని మాధవి మాటల వల్ల తెల్సింది. ఆ సంవత్సరం రావడం వల్ల అతనికి కన్పించిన, తెలిసిన మార్పల్లా జీతం మరో ఐదు రూపాయలు పెరిగిందని_ అప్పులిచ్చేవాళ్ళసంఖ్య తరిగిందని. అది తెలిసిన మరుక్షణం నుంచి అప్పు లెన్నివిధాలుగా పుట్టించవచ్చునో అన్న విషయం గురించి తీవ్రంగా ఆలోచించడం మొదలుపెట్టేడు.

గబ్బిలం మార్పుచెంది అందమైన సీతాకోక చిలుకలా మారొచ్చే మోగాని సీతాపతి బ్రతుకు మధ్యతరగతినుంచి మరో మెట్టు పైకిపోక కిందికిరాక మధ్యలో స్తబ్దుగా వుండిపోయింది. దీనికి కారణం ఏంటని ఎప్పుడూ ఆలోచించలేదు. ఎంతకాలమైనా సమస్యలకు తలవంచడం తప్ప ఏటికి ఎదురీదే మన స్తత్వం కాదతనిది.

తన్ను కట్టుకొన్నవాళ్ళ గతేమిటని అతనెన్నడూ ఆలోచించిన జ్ఞాపకంలేదు. జీవితం వేగాన్ని పుంజుకుంటుందన్న ఆశనుమాత్రం పూర్తిగా చంపుకోలేదు.

మాధవిని, లతని తను సరిగా అర్థంచేసుకోలేదా !? తనని వాళ్లు అర్థంచేసుకోలేదా ?!! ఎన్నోరకాలుగా ఇద్దర్నీ ఒకటిగా చెయ్యాలని వృధాప్రయాస పడ్డాడు.

ఆర్థికంగా మానసికంగా అతను బాగా కృంగిపోయాడు. జీవితాంతం ఇలానే రోజుల్ని ఈడవాల్సి వస్తుందన్న బెంగ పట్టుకొంది. తన బాధల్ని ఎవ్వరికీ చెప్పుకోలేడు .. తన్ని చూసి జాలిపడేవారు ఎవ్వరూ లేరని అతనికి బాగా తెలుసు.

* * *

సీతాపతి చీకటిమయమైన జీవితంలో కొత్తకాంతులు వెదజల్లేయి. విసిగి వేసారిన మనసుకి కొత్తవూపిరి వచ్చింది. జీవంలేదనుకొన్న నవ్వుకి రవ్వంత ప్రాణం వచ్చింది.

అందరి వదనాల్లో కొత్తకాంతి ప్రజ్వరిల్లింది.

విషాదం జీర్ణించుకుపోయిన ఆ గడపలో నూతనోత్సాహం అవధుల్లేకుండా ఆ ఇంట్లో విచ్చలవిడిగా తిరుగుతోంది. నవ్వులు, కిలకిలలు, కేరింతలు ఆ పాత ఇంట్లో కొత్తగా చోటుచేసుకొన్నాయి.

సీతాపతి ఎప్పుడో మర్చిపోయిన పాలడబ్బాలవేట మళ్ళీ ప్రారంభించాడు. అవి సంపాదించడానికి అతను పడ్తున్న బాధలో మధురమైన అనుభూతిని పొందేడు.

ముద్దులు మూటకట్టుకొచ్చిన బొద్దుగా, తెల్లగావున్న ఆ పాపకి 'హిమబిందు' అని పేరుపెట్టేడు సీతాపతి. ఆ విషయంలో ఎవ్వరూ జోక్యం కలిగించుకోలేదు.

ఆడవాళ్ళను అర్థంచేసుకునేవాళ్లు ఈ భూమిమీద ఎవ్వరూ లేరు. అలాంటిది ఏ నిమిషం ఎలావుంటుందో, అర్థంగాని మాధవిని అర్థంచేసుకోవడం బహుకష్టం.

తనతోపాటు ఆనందం పంచుకొంటున్న మాధవిని చూసి బోల్డంత ఆశ్చర్యపోయింది లత.

లతకి సపర్యలతోపాటు, పాప పనులతో నాన్‌స్టాప్ ఎక్స్‌ప్రెస్‌లా దూసుకు

పోతోంది మాధవి. ఒక్క క్షణం కూడా పాపను విడిచివుండలేదు. స్నానం చేయించడం. కాటుక దిద్దటం వగైరాదులన్నీ మాధవే చేస్తోంది. మధ్యరాత్రి ఏడ్చినా మాధవే నిద్రపుచ్చుతుంది.... కొత్తవాళ్లు ఎవరైనా చూస్తే ఆ పాప ఎవరి పిల్లో అర్థంగాదు.

పాప రాకతో మాధవిలో జీవకళ వచ్చింది. అమితంగా ఆ పాపమీద అంత ప్రేమ ఎలా పెంచుకొందో మాత్రం ఎవ్వరికీ తెలీదు. తెలుసుకుందామని ప్రయత్నిస్తే పిచ్చెక్కడం ఖాయం...

## 8

ఆ రాత్రి...

నల్లని కొప్పులో తెల్లచామంతిలా వున్నాడు చంద్రుడు. గాలికి జారిపోయిన కన్నెపిల్ల పైటలా అక్కడక్కడ తెల్లని మేఘాలు .

ఆకాశం చీరకి అందమైన డిజైన్‌లా మిణుకుమిణుకు మంటూ తారలు.

కిటికీలోంచి చల్లగాలి హాయిగా తగుల్తోంది. కిటికీ పూచలమధ్య చంద్రుడు ఇరుక్కుపోయేడు.

లత కిటికీకేసి చూస్తోంది. సీతాపతి దోమల్ని చంపడంలో నిమగ్నమై పోయేడు. లత మనసు గాల్లో తేలిపోతోంది. వెచ్చటి శ్వాసలు గదిలో చోటు చేసుకొంటున్నాయి.

లత చేతిగాజులు గలగలమన్నాయి- చెయ్యి సీతాపతిని స్పృశించింది. నిద్ర పట్టని సీతాపతి తిరిగి చూసేడు. నరాల్లో తెలియని స్పందన. శరీరం అతనికి తెలీకుండా మెల్లగా జరిగింది.

నాలుగు కళ్ళూ చేరువయ్యాయి.

"అమ్మా"- అంటూ గట్టిగా బిందు పిలుపు.

ఇద్దరిలో చలనం లేదు.

మళ్ళీ పిల్చింది బిందు

సీతాపతి వాస్తవంలోకి జారుకోబోయేడు. మళ్ళీ పిలవలేదు బిందు. మధుర మైన క్షణాలు వేడిగా దొర్లిపోయేయి.

గుమ్మంలో గాజుల శబ్దం. తలెత్తి చూసేడు. చీకట్లో మృత్యువును చూసినట్లు భయపడ్డాడు- సిగ్గుతో చచ్చిపోయేడు. కరెంట్ షాక్‌తిన్నట్లు వణికిపోయేడు. తలని దిండులో దాచుకొన్నాడు.

చెరిగిన ముంగురుల్ని తొలిగిపోయిన పైటని సర్దుకొంది లత.




పక్కి గదిలోంచి శబ్దం విన్పించింది.

సీతాపతి కదల్లేదు.

వంటింట్లో గ్లాసు శబ్దం. పిల్లికాదని సీతాపతికి తెలుసు. సంశయంలో చిక్కుకున్నాడు. వెళ్ళకపోతే జరగబోయే పర్యవసానం సీతాపతికి తెలుసు.

లత మెల్లగా నిద్రలోకి జారుకుంటోంది. చిన్నగా లేచేడు. ఫుల్ బాటిల్ రమ్ము తాగినట్లు ఒక్కసారి తూలేడు. తమాయించుకొన్నాడు.

వంటింటి గుమ్మందగ్గరకు వెళ్ళేడు.

బిందు గ్లాసుతో నీళ్లు తాగుతోంది. మాధవి కళ్ళనుంచి కన్నీరు వొలక బోతోంది.

మాధవి జడలో నలిగిన మల్లెలసువాసన గుప్పుమంది ప్రత్యక్షమైన దేవుడు అడిగిన వరమియ్యకపోతే ఏమిచెయ్యలేని భక్తురాలిలా చూసింది అతనివైపు.

సీతాపతి ఆమెవంక చూడలేక తల దించుకొన్నాడు.

బిందుని తీసుకొని గదిలోకి వెళ్ళిపోయి చాపమీద బోర్లాపడుకొని వెక్కి వెక్కి నిశబ్దంగా ఏడుస్తోంది మాధవి.

సీతాపతికి ఎలా వోదార్చాలో, ఏం మాట్లాడాలో తెలీలేదు.

"బిందు మంచినీళ్లు కావాలంది. అందుకు లేచేను ."_ అంది దిండు చాటు నుంచి పొంగే దుఃఖం ఆపుకుంటూ

* * *

గోరంత సూర్యుడు కొండంత వెలుగునిస్తూ ప్రపంచాన్ని మేలుకొలిపేడు. జరుగుతున్న చరిత్రలో మరో కొత్త రోజుకి నాందిపలికేడు.

చుర్రుమని ఎండ వంటికి తగిలేసరికి రంగుల స్వప్నాలు కరిగిపోయేయి.

బద్ధకంగా లేచింది లత. మాదవి స్నానంచేస్తోంది.

బిందు ఆకలికి సిగ్నలిచ్చింది. పెరటిలో మాధవి కన్పించలేదు బిందుకి. 'అమ్మా - అమ్మా' అంటూ స్నానాలగది దగ్గరకు వెళ్ళింది.

"ఉండమ్మా! స్నానం చేసొచ్చి పాలు కలిపిస్తాను "- లోపల్నించే బుజ్జగించింది.

అదేం లాభంలేదన్నట్లు ఏడుపుకి శృతి పెంచింది బిందు.

"నేను కలిపిస్తాను. దా "- అంటూ బిందుని ఎత్తుకుంది లత.

"నువ్వొద్దు అమ్మ వస్తుంది...."- ఏడుస్తూనే అంది.

"నేనూ అమ్మనే .. నేనిస్తా దా...."- నిదానంగా అంది లత.

"వద్దు నువ్వు అమ్మ కాదు...."- గట్టిగా ఏడ్చింది బిందు.

"వేలెడంత లేవు నువ్వు కూడా మాట వినకపోవడమే!! నేను అమ్మను కాదటే ?!"- కోపం ప్రొద్దుటే ఆకాశం అందుకొంది.

ఫలితం బిందు వీపు చిట్లింది.

సీతాపతి కలత నిద్ర చెడింది.

"అబ్బా! దాన్నెందుకు కొడ్తావ్ ?!"- కదలకుండా కుర్చీలోంచే విసుక్కొన్నాడు సీతాపతి.

"కొట్టాలా ?! చంపాలా! నేనిస్తే పాలు పనికిరావట .."- చిరాగ్గా అంది.

"పోనీ ఇవ్వడం మానెయ్ "- తనలోనే గొణుక్కొన్నాడు.

"తాగవే....! తాగుతావా గొంతులో పొయ్యనా?!" గద్దించింది.

"చిన్నపిల్ల దానికేం తెల్సు.. నువ్వూరుకో.... మాధవి ఇస్తుంది.. "- మళ్ళీ కుర్చీలో ముడుచుకొన్నాడు.

బిందు ఏడుపు ఆపలేదు.

లతకి కోపం తగ్గలేదు.

మాధవిని చూడంగానే ఏడుస్తూ వెళ్ళి పెనవేసుకొంది బిందు.

"నా వల్ల దెబ్బలు తిన్నావు కదే పిచ్చితల్లీ !!"- ఎత్తుకొని లోపలికి తీసుకు వెళ్ళింది మాధవి.

"పిల్లల్ని పెంచటం తెలీనప్పుడు కనకుండా వుండటం మంచిది...."- పాలు పడ్తూ అంది మాధవి.

"ఆ మాత్రం నాకూ తెల్సు...."- అణుచుకొన్నకోపంతో పక్కగదిలోంచి అంది లత.

"తెలిస్తే పిల్లల్ని ఎవరూ కొట్టరు .. "- మాధవి.

సీతాపతికి నిద్ర పూర్తిగా పోయింది. అయినా కళ్ళు తెరవలేదు. బిందు పాలు తాగేసింది.

"ఏమ్మా ! ఇంకా కావాలా ?!" అడిగింది మాధవి.

కావాలన్నట్లు తలాడించింది బిందు. మాధవి పాలకోసం గదిలోకి వెళ్ళింది. పక్కబట్టలు తీస్తున్న లత కొరకొరా చూసింది. బిందు బెదిరిపోయింది. గట్టిగా కొట్టినట్లు ఏడ్చింది. గబగబా మాధవి బయిట కొచ్చింది.



లత బలవంతంగా దగ్గరకు తీసు కొంది బిందుని.

"ఇదిగో పాలు ... పట్టు...."- అని అక్కడ గ్లాసు పెట్టి వెళ్ళిపోయింది మాధవి.

"తాగవే.... ఎందుకు వూరికే ఏడుస్తావ్ ?!"- అని గ్లాసు అందించింది.

వద్దని తలూపింది ఏడుస్తూనే బిందు.

"తాగుతావా ?! తన్నమంటావా ?!"- గర్జించింది లత.

మెరుపులా ఒణికింది బిందు.

మళ్ళీ కేకలు-అరుపులు-ఏడుపు-చెంప ఛెళ్ళుమన్న శబ్దం. వంటింట్లో మాధవికి గుండాగినంత పనైంది. సీతాపతికి లేవక తప్పలేదు. లత ఇంకా బలవంతం చేస్తూనే వుంది. బిందు మొండికెత్తింది. లతకి ఎవరిమీద కోపమో తెలీదు కాని కోపాగ్ని జ్వాలల్లో మాడిపోతున్నది మాత్రం బిందు.

మాధవి రాలిపోతున్న నక్షత్రంలా వేగంగా వచ్చింది. లత చేతిలో గ్లాసు లాక్కుంది.

"ఛీ ....ఛీ.... నువ్వు తల్లివేనా ?!"— కసిగా అనేసి బిందునెత్తుకొని వెళ్ళిపోయింది.

"నిజంగా నువ్వు దాన్ని కన్నదానివేనా ?!"— అన్నట్లుగా చూసేడు సీతాపతి.

అహం దెబ్బతింది లతకి. పూనకం వచ్చినట్లు వూగిపోయింది. ఆ ఇంటికి కిరసనాయిలు పోసి తగలబెడదామనిపించింది. అంత కిరసనాయిలు లేదని తెలుసు కాబట్టి తుపాకీ దెబ్బతిన్న పిట్టలా ఉక్కిరి సులకమంచంలో వాలిపోయింది.

సీతాపతి మౌనంగా చూస్తూ వుండిపోయేడు.

ప్రొద్దుటే ఎవరి మొహం చూసేడో గుర్తుకి తెచ్చుకొంటున్నాడు. ఇంతటితో ఈ యుద్ధకాండ ముగుస్తుందో లేక దాని ప్రభావం ఎంతకాల ముంటుందో ?! అటు తిరిగి ఇటు తిరిగి తన్ని కేంద్రంగా చేసుకుంటారేమోనన్న అనుమానం వచ్చేసరికి కళ్లా మత్తు వదలి పాదరసంలా జారుకొన్నాడు సీతాపతి.

* * *

ఆ ఇంటి వాతావరణంలో పెరిగితే తన బిడ్డ తనకి కాకుండా పోతుందేమోనన్న బెంగ ఆమెను వదలటం లేదు. ఉదయం జరిగిన సంఘటన మళ్ళీ మళ్ళీ గుర్తుకొచ్చింది లతకు.

గదంతా చీకటిగా వుంది. మనసులో ముసురుతున్న అనుమానాల్లా ! బిందు కోసం పక్కన చూసింది లత.

సీతాపతి మంచం దగ్గిర కొచ్చింది.

కాలికి గ్లాసు తగిలి శబ్దం అయ్యింది.

"ఎవరది ...?!"— సీతాపతి కళ్లు తెరిచి చూసేడు.

"ఇంకా నిద్రపోలేదా ?."

"బిందు ఏది ?!"— లత.

"మాధవి దగ్గిర పడుకొంది.... ఎందుకు ?!!"— మత్తు వదిలిన సీతాపతి.

"నా పక్కన పడుకోబెట్టుకొంటా ?!"— అంటూ మంచందగ్గిర నుంచి కదిలింది.

"అది నిద్ర లేస్తుందంటే ఓ పట్టాన పడుకోదు....నువ్వెళ్ళి పడుకో లతా !"— సీతాపతి వారించేడు.

"ఏం.... నా పక్కన పడుకోకూడదా ?!"

వింత ప్రశ్నకు అచ్చెరువొందేడు సీతాపతి.

"సరే.... నీ యిష్టం .."_ విసుగ్గా అన్నాడు.

క్షణం స్థాణువులా వుండిపోయింది, వెంటనే గదిలోకి వెళ్ళిపోయింది. నిద్రపట్టని సీతాపతి ఆమె వెళ్ళినవైపు చూస్తూ వుండిపోయేడు.

గదిలో సన్నగా ఏడుస్తున్న ధ్వని. రోదన శబ్దం కొంచెం పెరిగింది. వెళ్ళక తప్పలేదు సీతాపతికి.

"లతా ! ఎందు కేడుస్తున్నావ్ ?! నే నేమన్నానని ?!"

లత ఏడుపే సమాధానం.

"ఇపుడేం జరిగిందని నువ్వు రోజురోజుకి చిన్నపిల్లలా తయారవు తున్నావ్" _సహనం కోల్పోని సీతాపతి లతను దగ్గరగా తీసుకొన్నాడు.

లత దుఃఖంస్థాయి కొంచెం తగ్గింది.

సీతాపతి ఆలోచన్లు అనుమానాలుగా మారుతున్నాయి.

"ఏవండీ ! నాకీ ఇంట్లో బాగుండలేదు.. "_ మెల్లగా అంది లత.

"అదేవిటి ?!!"

"నే నిక్కడ వుండలేను "

సీతాపతి గుండె ఒక్క క్షణం కొట్టుకోవటం మర్చిపోయింది.

"మరి ఎక్కడి కెళ్తావ్ ?!!"_ చిన్నపిల్లాడిలా అడిగేడు.

"నేను కాదు మనం "

"నీ కేమన్నా పిచ్చెక్కిందా ?!"

"కొంత కాలం పోతే తప్పదు..."

"లతా ! హాయిగా నిద్రపో నీ మనసేం బాగున్నట్లులేదు "_ మెల్లగా అక్కడనుంచి కదిలే ప్రయత్నంలో అన్నాడు.

"మనం వేరే కాపురం పెడదాం... "

లేవబోయిన సీతాపతి శిలగా మారిపోయేడు. అతినెన్నడూ వూహించని ప్రశ్న.. మామూలు స్థితిలోకి వచ్చేడు. చిన్న చిరునవ్వు పేలవంగా వచ్చింది బయటకు.

"మాట్లాడరేం ?!!"_ లత గొంతులో మార్పు కొట్టొచ్చినట్లు కనిపించింది.

"ఏం మాట్లాడమంటావ్ ?! అన్నీ తెలిసిన నువ్వే ఇలా మాట్లాడుతుంటే నేనేం జవాబు చెప్పాలి ?!"

"అయితే ఎల్లకాలం ఇలానే వుండాలా ?!"

"ఇప్పుడు నీకేం తక్కువైందని ?!"

"తక్కువకానిది ఏమైనావుంటే చెప్పండి ?!!"

"నీలో ఇంత మార్పు వస్తుందని నే నెప్పుడూ వూహించలేదు.. "-
"కాలంతోపాటు మనుషులు - మనసులు మారడం సహజం.. "
"అలాంటి వాళ్ళంటే నాకు పరమ అసహ్యం.. "
"మారకుండా ఏ రాయిలాగో రప్పలాగో పడుండం అలవాటుకాలేదు నాకు. "
సీతాపతి సహనాన్ని కోల్పోయేడు.
"అవును ... నేను ఏ రాయినో అయ్యుంటే ఎవరెక్కడ వుండేవాళ్ళమో జ్ఞాపకం చేసుకో!!!"- విసురుగా గదిలోంచి వరండాలోనికి వచ్చి మంచంలో నడుమువాల్చేడు.
లత గుమ్మందగ్గర కొచ్చింది.
"నే నంతా వింటూనే వున్నాను నిద్రపోలేదు "- అన్నట్లుగా చిన్నగా దగ్గింది మాధవి. సీతాపతికి బల్బు వెంటనే వెలిగింది. కిక్కురు మనకుండా దుప్పటి పూర్తిగా కప్పేసేడు.
లత చాలాసేపు గుమ్మందగ్గర వుండిపోయింది. మెల్లగా గదిలోకి వెళ్ళింది. ఆలోచన్లు మరిగిపోతున్నాయి. కసి, కోపం, అసహ్యంతో వొళ్లు భుగ, భుగలాడింది.
ఆమెకు తెలీని అవస్థలో మెల్లగా నిద్రలోకి జారుకొంది.

## 9

పల్చటి చీకటి పరదాల్ని అడ్డుపెట్టుకుంటోంది వూరు.
ఆకాశం మండి మసైపోయిన బూడిదలా వుంది.
భూమి ఆకాశం కలసివున్న చోటుకేసి చూస్తున్నాడు వాసు.
నలిగి, ఎండిపోయిన గడ్డిపరకల్ని పీకుతోంది లత.
చాలా క్షణాలనుంచి మౌనం వాళ్ళమధ్య వూరేగుతోంది. ఇద్దరి మస్తిష్కాలలో ఏవో ఆలోచన్ల ఆకారాలు చేసుకొంటున్నాయి.
"మీ నిర్ణయం నా కెందుకో సబబుగా తోచలేదు...."-
"అంతకన్నా మరోమార్గం కనిపించటంలేదు...."- అంది లత ఏదో నిశ్చయానికి వచ్చినట్లు.
"వేరే కాపురం వుండటం అంటే మాటలతో అయ్యేది కాదు. ఆర్థికంగా ఇన్ని ఇబ్బందుల్లోవుండి మరో సంసారం నడిపించటం అంటే సీతాపతివల్ల కాదు. మీరూ ఆలోచించండి...."- వాసు.






“నిజమే! కానీ ఇలా ఎంతకాలం ?”

“కాలం సమస్యలు పరిష్కరించేవరకు ”

“పరిష్కారం కుదిరే సమస్యలు కావు మావి”—

“అలా అని ఎందుకనుకోవాలి ?!”

“ఎందుకనుకోకూడదో చెప్పండి ”

“మీరూ నిర్ణయానికొస్తే నేనేం చెప్పలేను. కానీ మనం మంచి జరుగుతుందని ఆశిద్దాం .”

“నన్నూ నా పిల్లను వేరుచేస్తున్నారు. అది నా దగ్గిరకు రావటంలేదు. పొద్దుట లేచిందగ్గరనుంచి రాత్రి పడుకునేదాకా ఆవిడ్ని వదిలి వుండదు. కనీసం నన్ను అమ్మా అని పిలవదు అలా పిలవాలని వాళ్ళెవ్వరూ చెప్పరు ” లత కళ్ళల్లో కన్నీళ్లు చేరుకుంటున్నాయి.

“దాని గురించి మీరింత బాధపడటం అవివేకం.. చిన్నపిల్ల దానికేం తెలుస్తుంది చెప్పండి.... ఎవరు దగ్గరకు తీస్తే వాళ్ళదగ్గరకే వెళతారు .. కేవలం ఈ కారణంగా మీరు వేరే కాపురం వుండాల్సిన అగత్యం లేదు ”

“లేదండి. నాకు రోజురోజుకీ ఆ ఇంటిమీద మనుష్యులమీద రోత కల్గుతోంది. మా పెళ్ళయి మూడేళ్లు.. ఒక్క రోజుకూడా మేం సరదాగా గడపలేదు.... కనీసం ఓ సినిమాకూడా చూళ్లేదు . అంటే సినిమా చూడాలని కాదు. అంత

చిన్న కోరిక కూడా తీరలేదు. ఎన్నో కోరికల్ని చంపుకొన్నాను. నాకేం బంగారు నగలు చేయించమని అడగలేదు. పండగలకి చీరలు కొనమని కోరలేదు కనీసం ఓ అరగంట సరదాగా కబుర్లు చెప్పుకోడానికి కూడాలేదు. జీవితంలో ఆనందాన్ని గాని, వైవాహిక జీవితంలో మాధుర్యాన్ని గాని నే ననుభవించలేదు. నాకూ ఎన్నో కోరికలున్నాయి- సరదాలున్నాయి . వాటన్నిటిని పొందాలన్న ఆశవుంది .. అవేవీ తీరలేదు ఇకముందు తీరుతాయన్న నమ్మకంలేదు "- లత ఆవేదన వెల్లువికింది.

వాసు మాటలకోసం వెదుకుతున్నాడు.

ప్రపంచం నల్లరంగు పూసుకొంది.

వాళ్లు కూర్చున్న పార్కులో దీపాలు వెలిగాయి.

"పెళ్ళనేది క్షణాల్లో నిర్ణయాలు తీసుకొనేది కాదు. అలాంటప్పుడు మీరు తొందరపడి నిర్ణయం తీసుకొన్నపుడు ఇలాంటి ఎన్నో సమస్యలు ఎదురౌతాయి. వాటన్నిటికీ ఆలోచాల్సిందే మరి "

"ఆ రోజుల్లో నా ఆలోచనల్లా ఒక్కటే మా ఇంటినుంచి ఎంత తొందరగా దూరమౌదామా ! అనే అంతకుమించి మరోటి ఆలోచించలేదు. సహాయం చేసేవాళ్లు కానీ, సలహా ఇచ్చేవాళ్లు కానీ ఎవ్వరూ లేరు. ఈ మూడేళ్ళల్లో ప్రపంచాన్ని, మనుషుల్ని బాగా అర్థంచేసుకొన్నాను. అందుకే కనీసం రాబోయే కాలంలోనైనా సుఖపడ్దామని... "-

"ఆశపడటం మానవ సహజం. కానీ అవి తీరడానికి పరిస్థితులు కూడా అనుకూలించాలిగా ! మీరు మీ భవిష్యత్తు గురించే ఆలోచిస్తున్నారు. మరి వాడు దేన్నిగురించి ఆలోచించాలి ?! ఇప్పటి కొచ్చిన అభాండాలతో.... తీరని అప్పులతో, సమస్యలతో మనశ్శాంతిలేక పిచ్చెక్కిపోతున్నాడు. ఇప్పుడు మీరు మరో కొత్త సమస్య పెడితే అతనేమౌతాడో ఆలోచించేరా.... ! కొద్దికాలం ఓపికపట్టండి. పరిస్థితులు చక్కపడ్డాక మీ ఇష్టప్రకారం చెయ్యొచ్చు . " లత మాట్లాడలేదు. బలికి తీసుకువెళ్లే మేకలా చూస్తోంది,

చాలా క్షణాలు తెలియకుండా జరిగిపోయేయి.

"ఇక వెళ్దామా ?"- లేచే ప్రయత్నంలో అన్నాడు వాసు.

లత ఎటో చూస్తోంది- అతని మాట చెవినపడలేదు.

"ఈ బతుకు బతకాలన్న కోరికా లేదు... చావడానికి ధైర్యం లేదు . "- గాద్గదికంగా అంది లత.

"బాధపడకండి జీవితం అనే నిరంతర యాత్రలో ఎన్నో వొడిదుడుకులు వస్తుంటాయి. వాటిల్ని తట్టుకొని కాలానికి ఎదురీదలేదుగాని అధైర్యపడి ఓడిపో కూడదు ..."

లత వాసుకేసి చూసింది.

"రండి వెళ్దాం "_ అంటూ లేచేడు.

ఇద్దరూ మౌనంగా చెట్ల చీకటిమాటునుంచి బయిటకొచ్చేరు.

* * *

"అమ్మా ఏం చేస్తున్నావ్ ??"_ మెడని వాటేసుకొని అంది బిందు.

"నా ఖర్మ కాలి ఏడుస్తున్నా.. " _చిరాగ్గా అంది మాధవి.

"ఏడుస్తున్నావా ?!!"_ ముద్దుగా అంది బిందు.

"ఆ ఏడుస్తున్నా...."_ కోపంగా అంది.

"నేనూ ఏడ్చేదా ?!"

మాధవి మాట్లాడలేదు.

"అమ్మా .. నేనూ ఏడ్చేదా ?!"_ మళ్ళీ అడిగింది బిందు.

"నోర్మూసుకొని అవతలికి పో. నీ వాగుడుతో చంపేస్తున్నావ్ .."_విసుగ్గా నెట్టింది మాధవి.

కిందపడ్డ బిందు కెవ్వుమని ఏడుపు లంకించుకొంది. నిశ్శబ్దంగా వున్న వాతావరణం చెదిరిపోయింది.

"నోర్మూస్తావా... లేదా ?!.... నోర్మూయ్_" వీపుమీద దెబ్బపడింది.

మరింత గట్టిగా ఏడ్చింది బిందు.

"ఛీ.... ఛీ.... చంపుకుతింటున్నారు. మీ అమ్మ దేశాలమీద పడి తిరుగు తోంది.. నువ్వు నన్ను చంపు... అంతా నా ఖర్మ.. "

బిందు తాపీగా, దెబ్బ గుర్తుకు తెచ్చుకొని ఏడుస్తోంది. కళ్ళవెంట నీరు ఏకధారగా కారిపోతోంది. ఏడవడానికి వోపిక లేనట్లు మెల్లగా స్థాయి తగ్గించింది.

మాధవి బిందుకేసి చూసింది.

బిందుని చూడగానే జాలేసింది మాధవికి. తనెంత అమానుషంగా ప్రవర్తించింది గుర్తుకు రాగానే సిగ్గుతో కుచించుకుపోయింది. దగ్గిరకొస్తున్న మాధవిని చూసి భయపడింది బిందు. ఎక్కిళ్లు ఎక్కువైయేయి. బిందును దగ్గరకు తీసుకుంది.... ముద్దులతో వళ్లు నింపేసింది.

బిందు మాత్రం వులుకుపలుకూ లేకుండా వుంది.

"పిచ్చితల్లీ....! దెబ్బ గట్టిగా తగిలిందా ?!.... అనవసరంగా దెబ్బలు తిన్నావు కదే !"– మబ్బులు విడిన ఆకాశంలా వుంది మాధవి మనసు. బిందు మాధవి వొళ్లో వుక్కిరిబిక్కిరై పోయింది.

"అమ్మా ! అవేంటి ?!"

"నక్షత్రాలు...."– చూపిస్తూ చెప్పింది.

"నక్షత్రాలా ?!"

"అవును...."

"ఎందుకక్కడున్నాయి....?!–" ఆశ్చర్యంగా అంది.

"అక్కడే వుంటాయి...."

"ఎందుకు ?!"

"ఏం పనిలేక."

"పనిలేకనా ?!"

"అవును... "

మళ్ళీ ప్రశ్న వెయ్యలేదు. పనిలేని నక్షత్రాల వంక తదేకంగా చూస్తూ వుండిపోయింది బిందు.

సీతాపతి తను చూసిన చిన్నప్పటి సినిమాలో పాట నాన్చుకుంటూ వచ్చేడు.

లేచి నిల్చుంది మాధవి. బిందు సీతాపతి కాళ్ళను చుట్టేసింది.

"నాన్నా!!"

"ఇంకా నిద్రపోలేదమ్మా !? ఏంటి అలా వున్నావ్ ?! అమ్మ కొట్టిందా" –ముద్దుముద్దుగా అడిగేడు బిందు నెత్తుకొని.

"ఆ దెబ్బలు పెద్దలకు పడ్తే బాగుండును....బుద్ధైనా వస్తుంది ..."– ఇంట్లోకి వెళ్తూ అంది మాధవి.

పట్టించుకోలేదు సీతాపతి.

"అన్నం తిన్నావా ?!"

"తిన్నా .. నువ్వో ?!"

"లేదమ్మా.. మీ అమ్మ పెడితేగదా !"

"నే పెట్టేదా ?!"

"పెట్టు తల్లీ ...."

బిందు గబగబా గదిలోకి పరిగెట్టింది.

"అమ్మా ! నాన్నకి అన్నం పెట్టు...."– అర్డరు వేసింది.








"నే పెడతాగాని ముందు నువ్వు పోయి పడుకో "

గదిలోకి వచ్చిన సీతాపతికి లత కనిపించలేదు. ఎకి.డికెళ్ళిందో మాధవిని అడుగుదామనిపించింది. మళ్ళీ ఏదో జంకు కలిగి అడగలేదు.

"మాధవీ ! ఏవిటలా వున్నావ్ ?!" —ప్రేమగా పలకరించేడు.

"పాపం దాన్ని అనవసరంగా కొట్టేనండి . పిచ్చిముండ చాలా సేపు ఏడుస్తూ కూర్చుంది ."— అంటూ సీతాపతి పక్కనే కూర్చుంది.

"భోం చేసేవా ??"

"మీరు రాకుండా ఎన్నడేనా తిన్నానా ?!" షోగ్గా అంది.

"నా గురించి ఎందుకు ఎదురుచూడ్డం .. వేళాపాళా లేకుండా వస్తాను... " సన్నటి నవ్వు పెదాలమీద నాట్యంచేస్తుండగా అన్నాడు.

చాలాకాలం తర్వాత సీతాపతి అంత చనువుగా వుండడం మాధవికి ఆనందం వేసింది. సంతోషం వుప్పెనలా మనసుని చుట్టేసింది.

"నాన్నా నాకు బంతి కొనివ్వవూ ?!" —మంచంమీదనుంచే అడిగింది బిందు.

"ఓసి రాక్షసీ ఇంకా పడుకోలేదే ?!"— మాదవి.

"కొనిస్తానమ్మా.. రేపు బజారు వెళ్తాగా అప్పుడు కొనిస్తాగాని ముందు నిద్రపో. " —సీతాపతి నమ్మించేడు.

"ఏవంటీ చాలా కాలంనుంచి మిమల్ని వొక టడుగుదామనుకుంటే

ఎప్పుడూ కుదరటం లేదు. ఈ దీపావళికి చీర కొనిపెట్టరూ... ?!"_ గోముగా అంది.

చీకట్లో సీతాపతి చిరునవ్వు కలిసిపోయింది.

"మాట్లాడరేం ?!"

"మాట్లాడాని కేముంది.... తప్పకుండా కొనిస్తా !"

"అదేవిటండీ ... అలా అన్నారు."

"ఏం ?! ఎలా అన్నాను...."

"నే నెప్పుడైనా అడిగేనా మిమల్ని "_ చెప్పింది మాధవి,

"అడిగేవని అన్నానా కొనిస్తానన్నాగా !!"

"ఏవండీ ! ఒక్కసారి పిల్లల్ని చూసొద్దాం .. "

"నాకూ చూడాలనే వుంది కానీ డబ్బు లెక్కడనుంచి తేవాలి ?!"

"మనం ఒక్కసారేనా వెళ్ళకపోతే ఏం బావుంటుంది చెప్పండి .."

"నిజమే కానీ నేను మాత్రం ఏం చెయ్యను చెప్పు చూస్తూనే వున్నావుగా.... కనీసం దానికి బొమ్మ కొందామంటే డబ్బుల్లేవు.... ఇప్పటికే వూరంతా అప్పులు. ఇంకె రిస్తారు మనకి... ?"_ పడకుర్చీలో వాలిపోయేడు. గట్టిగా దమ్ము లాగేడు.

"లేవండి భోంచేద్దాం... "

"కొద్దిసేపాగి తింటాను మీ రిద్దరూ ముందు భోంచెయ్యండి...."_ నిదానంగా అన్నాడు.

"రాణీగారు దేశం ఏలడానికి వెళ్లేరు....వారి కిష్టమైనప్పుడు కొంప కొస్తారు.. రోజురోజుకీ కొంప సత్రమైపోతోంది... చుట్టుపక్కలవాళ్లు ఏమనుకుంటారోనన్న జ్ఞానం లేదు.... పొరపాటున మానవ జన్మ ఎత్తింది. .."_ గొంతులో మాటలో అసహ్యం తొణికిసలాడింది.

సీతాపతి మౌనంలో యోగి ' వున్నాడు.

"అయినా అతనికి బుద్ధిలేదేం ?! రోడ్ల వెంట తిప్పుతుంటే ఆయన పెళ్లాం ఏం చేస్తోందో ??. అది రాగానే మీరేనా గట్టిగా చెప్పండి లేదా నేనే చెప్పాల్సుంటుంది.. "_ అంటూ లేచి వెళ్ళిపోయింది.

ఇది కాబోయే రణరంగానికి నాంది అవ్వచ్చునన్న అనుమానం మెదిలింది. వెన్నెముక వొక్కసారి వణికిపోయింది. తన అనుమానం నిజం అయితే జరగబోయే యుద్ధకాండను వీక్షించటం కన్నా సద్దుమణిగిం తర్వాత బుద్ధిగా ఇంటి

కొస్తే ఎలా వుంటుంది ?! అన్న బ్రహ్మాండమైన ఐడియా రాగానే.. అందుకు సంబరపడి గబగబా బట్టలేసుకొచ్చాడు.

"మళ్ళీ ఎక్కడికీ చాంద్రాయణం...."- విసుగ్గా అంది మాధవి.

"అబ్బే ఇక్కడిదాకానే సిగిరెట్లు కొనుక్కొస్తాను .. "- అంటూ ఆమె పర్మిషన్ కోసం ఎదురుచూడకుండా రోడ్డుమీద కొచ్చేడు.

* * *

"లతా ! అమ్మాయి లతా !!"- అన్న పిలుపు ఆ ఉదయం ఎండలా ఇంట్లో దూరింది.

బైటకొచ్చిన మాధవి వచ్చినవాళ్ళను చిరాగ్గా చూసి లోపలికి వెళ్ళిపోయింది.

సీతాపతికి ఇష్టంలేకపోయినా పలకరించక తప్పలేదు. అందుకే ఆ పని చేసి లోపలికి పోయేడు.

రాజమందిరాన్ని చూస్తున్నట్లు కొత్తగా వింతగా పరిశీలిస్తున్నారు దంపతులిద్దరూ ఆ ఇంటిని.

ఉదయం నుంచి చిరాగ్గా వున్న లతకి వాళ్ళ రాకలోని అంతర్యాన్ని గురించిన అనుమానాలు మెల్లమెల్లగా గూడుకట్టుకొంటున్నాయి.

"బాగున్నావా ?!"- అని అడగటంతో బాటు జాయింటుగా ఆశ్చర్యపోయేరు.

"బాగానే వున్నాను .. "- ముభావంగా అంది లత.

"ఈ మధ్య వూళ్లో లేం తెలుసుగా !?"- అన్నారు ముసలాయన.

"అలాగా !! ఏ వూరు వెళ్లేరు ?!"- అని లత అడగలేదు.

"పొత్తురు పుట్టి రేండేళ్ళయినా ఆ మాట చెప్పడానికి పరాయివాళ్ళం అయ్యేమజే ?!"- నిలదీసింది ముసలావిడ.

లత మౌనమే సమాధానం.

"వూళ్లో లేం కదా అందుకే రాలేకపోయేం .. అదిగాక ఇల్లుకూడా ఇప్పుడు బాగా దూరమాయే అందుకే వద్దామని వున్నా వీలుచిక్కలేదు... "

"ఎంత మారిపోయేవే !!"- ముసలాయన మళ్ళీ ఆశ్చర్యపోతూ !

"పాపేది ?!"

"లోపల నిద్రపోతోంది .. "- ముక్తసరిగా సమాధానం చెప్పింది.

"సంసారం ఎలా వుంది ?!"- ముసలాయన.

"హాయిగా వుంది "- పుల్ల విరిచినట్లుగా అంది లత.

"నువ్వెంత హాయిగా వుందన్నా... నిన్ను చూస్తే తెలుస్తూనే వుంది ..."

మొహంమీద సుఖంగా లేనని రాసుందా ?!"

ముసలాయన ఖంగు తిన్నాడు.

"ఎలా చిక్కి పోయేవే! పూర్వం బక్షణంగా వుండేదానివి...."-

బోల్డు బాధపడింది ముసలావిడ.

"మీరు నా గురించి బాధపడనవసరం లేదు. . నేను క్షేమంగానే వున్నాను. "

"పోనీ కొంత కాలం మా దగ్గిరుంటి వెళ్ళొచ్చుగా . !"-

"చూడు లతా! నువ్వెంత నీ గురించి దాచినా లోకం కోడై కూస్తోంది. ఇప్పటికైనా మించిపోయింది లేదు. బాగా ఆలోచించు. మా గురించి కాక పోయినా నీ బిడ్డ భవిష్యత్తు గురించి . ఈ రోజు నిన్నూ నీ పిల్లనూ ప్రేమగా చూసుకొన్నా.. రేపొద్దున్న వాళ్ళ పిల్లలు ఎదిగి చేతికొచ్చేసరికి నిన్నూ నీ పిల్లనూ ఎలా చూస్తారో వూహించు . కలలో వూహించిన వన్నీ వాస్తవంలో జరగాలనుకోవడం అవివేకం.... నీ కోసం ఎప్పుడూ ఎదురు చూస్తుంటాం వస్తాం "- అని హితబోధ చేసి వెళ్ళిపోయేరు ఇద్దరూ....

వాళ్లు వెళ్ళిపోయినా గుమ్మంలోంచి కదల్లేదు లత.

మావయ్య అన్న మాటలు పదేపదే గుర్తుకొస్తున్నాయి .. చెవుల్లో మార్మోగుతున్నాయి.... రాసురాను వాళ్ళమీదున్న అసహ్యం మెల్లమెల్లగా చెరిగి పోతోంది ఆయన అన్నమాటల్లో యదార్థం గురించి ఆలోచించడంలో నిమగ్నమైపోయింది లత.

* * *

జీవితం చీకటిమయమైనప్పుడు వెలుగుబాట వెదుక్కోవడం విజ్ఞుల లక్షణం. తమంతట తాము తెల్సుకోలేనివాళ్లు ఇతరులు చెప్పిన, నచ్చిన మార్గంలో పయనించడంకూడా సన్మార్గుల పనే! తప్పటడుగులు వేసేటప్పుడు చేయూతనందుకోవడంలో తప్పులేదు. అదే తప్పటడుగు వెయ్యటానికి కూడా ఓ మార్గదర్శకుడు కావాలి.

తెలిసి చేసేదాన్ని పొరపాటనకూడదు.

తెలియకుండా తప్పుచెయ్యడానికి లత వయస్సులో చిన్నదికాదు. తెలిసి తప్పుచెయ్యడానికి మనస్సు ఒప్పుకోడం లేదు. అలాగని ఒక నిర్ణయంమీద కట్టుబడి వుండలేకుండా పోతోంది. అందుక్కారణం తన పరిస్థితులు- కూలిపోతున్న తన కలలు.

ఏ రాత్రి కంటిమీదకు కునుకు రావటంలేదు.






ముందు రాబోయే జీవితం విడవని పీడకలలా అనుక్షణం మెదిలి భయపెడ్తుంటే ఏం చెయ్యాలో తోచక సందిగ్ధావస్థలో పడిపోయింది లత.

జాటీ లాగేసిన బొంగరం– లత.

* * *

ఉదయించిన చంద్రుడ్ని నల్లటి కారుమేఘాలు లోకానికి కన్పించకుండా అడ్డుకొన్నాయి.

చీకటి దయ్యంలా నల్లగా వుంది.

దీపాలు చీకటిని పారదోలుతున్నాయి.

సందులో జనసంచారం అంతగా లేదు.

తిరనాళ్ళల్లో తప్పిపోయినవాడిలా పాతఇళ్ళని కొత్తగా చూస్తూ మెల్లగా అడుగువేస్తున్నాడు. జేబులు తడిమి చూసేడు.

అప్పులవాళ్లు ఎవరైనా కన్పిస్తారేమోనన్నట్లు రోడ్డువారగా వెళ్తున్న సీతాపతి అడుగులు అప్రయత్నంగా ఆగిపోయాయి.

పక్కనుంచి నవ్వులరిక్షా దూసుకుపోయింది.

నిశితంగా వెళ్తున్న రిక్షాను చూసేడు.

ఏదో అనుమానం మనసుని చుట్టేసింది. అంతవరకు ఇతడులు చెప్పిందే గాని తనుగా చూళ్లేదు– చూసినా తన మనసులో ఏ అనుమానం చోటుచేసుకోలేదు.

ఆ క్షణంలో మాధవి మాటలు కొత్తగా మళ్ళీ గుర్తుకొచ్చేయి.

గుండెలో బాకు దించినట్లయింది. ఎంత ప్రయత్నించినా కాళ్లు కదల్లేదు.

రిక్షా చీకట్లో కలిసిపోయింది.

శిలలా రోడ్డుమీద వుండిపోయాడు.

ఎన్నడూలేని అనుమానం దహించేస్తోంది. కోపం కట్టలు తెంచుకొంది.... మళ్ళీ ఏదో భయం.... మనిషి సతమతమయ్యేడు... గుండె వేగంగా కొట్టుకోవడం ప్రారంభించింది.

"ఏరా! ఇక్కడ నుల్చున్నావ్ ?!"

తలెత్తిచూసేడు. ఎదురుగ్గా వాసు.

నివ్వెరపోయాడు సీతాపతి.

నిప్పులు చెరుగుతున్న ఆలోచనలకు మంచునీళ్లు చల్లినట్లయింది.

ఎగాదిగా వాసుకేసి చూసేడు. ఏదో అడగాలని తపన– అడగడానికి మళ్ళీ ఏదో సంకోచం.... ఈ రెండింటి మధ్యా నలిగిపోయేడు....

"ఏరా! అలా చూస్తున్నావ్ ? వంట్లో బాగోలేదా ?!"

"వొంట్లో బాగానే వుంది... !"– మాటల్లో కాఠిన్యం వాసు మెదడుకి పని కల్పించింది.

"పద.. కాసిని టీనీళ్లు తాగుదాం...."– అంటూ చెయ్యిపట్టుకొని సీతాపతిని నడిపించేడు వాసు.

దారి మధ్యలో ఎవ్వరూ మాట్లాడలేదు.

ఆకాశాన్నంటే కెరటాలతో ప్రపంచాన్ని తనలో కలుపుకోవాలనుకొనే సముద్రఘోషలా ఆలోచనలతో సీతాపతి నీరసంగా అడుగులేస్తున్నాడు.

టీ చప్పరిస్తూ వాసు కళ్ళలోకి సూటిగా చూసేడు.

సీతాపతి ఏవో సమస్యతో సతమతమౌతున్నాడని అతని వాలకాన్నిబట్టి ఇట్టే గ్రహించేడు.

"ఇందాక రిక్షాలో వెళ్ళింది...."

"నేనూ – లత. మా ఇంటికొచ్చింది ... దిగవిడిచి వస్తున్నాను. నువ్వు కన్పించేవు ఏం ?."– సిగిరెట్టు వెలిగిస్తూ అన్నాడు వాసు.

"ఎందుకు వచ్చింది ?!"– అన్నట్టుగా చూసేడు సీతాపతి.

"ఆవిడకు ఇంటిమీదా సంసారంమీదా విరక్తి కలిగింది..."– ఎటో చూస్తూ అన్నాడు వాసు.

సీతాపతి రాయిలా చలనంలేకుండా వున్నాడు.

"అందరికీ దూరంగా వెళ్ళిపోవాలన్న కోర్కె చాలా బలంగా ఆవిడ మనసులో నాటుకుపోయింది "

"అని నీతో చెప్పిందా ?!"

"ఇంకా చాలా చెప్పింది...."

"అప్పన్నే ఆర్చేవాడివి, తీర్చేవాడివి నువ్వుండగా ఆవిడికి దిగుల్లేదు. కనీసం పదిపైసల పువ్వులు కొనలేని నా మీద ఈ బ్రతుకుమీద అసహ్యం పెంచుకోక ఏం చేస్తుంది...."

"అంటే నీ వుద్దేశ్యం ?!"

"నా స్వంతం ఏమీలేదు. లోకం కోడై కూస్తున్నా ఇన్నాళ్ళు విన్నాను. కానీ చూడాల్సిన అవసరంకూడా కల్పించేరు...."

"ఏం చూసేవు ?! ఏం విన్నావ్ ?!"– వాసు కోపం కళ్ళల్లో కన్పిస్తోంది.

"విన్నవి చాలా వున్నాయ్.... చూసింది మాత్రం ఒక్కటే...."

"ఏవిటది ?!"– శరీరం తన అదుపు తప్పుతోందని అనుమానం మెదిలింది వాసుకి.

"వాసూ మనిద్దరం ఎంతోకాలంగా స్నేహితులం. నువ్వేపని చేసినా నాకిష్టమే! కానీ అది నా మంచితనంమీద గొడ్డలి పెట్టయినపుడుమాత్రం భరించలేను.... అంతకన్నా నే నేంచెప్పలేను...."

"సీతాపతీ! నువ్వింత వక్రంగా ఆలోచిస్తావనుకోలేదు. ఇప్పుడు నీకు నిజం చెప్పినా అది అబద్ధంలాగే అన్పిస్తుంది. స్నేహితుడి భార్యమీద కోర్కెలు పెంచుకునేంత నీచస్థితికి దిగజారలేదు.

ప్రతి చిన్న విషయం లత పెద్ద సమస్యలా భయంకరంగా వూహించుకొంటోంది. దాని క్కారణం నువ్వు!.... నిజంగా నువ్వెప్పుడేనా ఆమెగురించి ఏమైనా అడిగేవా ?! బాధపడ్తున్నప్పుడు ఓదార్చేవా ?! తనకున్న పరిధిలో ప్రతి కదలికను, మాటను భూతద్దంలో చూసి భయపడ్తోంది. సరిగ్గా అలాంటి పరిస్థితుల్లో ఆమెను ఓదార్చేను. ఆమె బాధల్ని పూర్తిగా విన్నాను. అందువల్ల ఆమె నాకు చేరువైంది. మనసుకి కష్టం కలిగినప్పుడు రెండు మంచి మాటలు చెప్తే ఎదుటి మనిషిమీద అభిమానం పెరగడం సహజం. –అదే నే చేసిన తప్పయితే నన్ను క్షమించు. ఇకనుంచి నీ సమస్యలకు–మీ ఇంటికి దూరంగా వుంటాను. కనీసం కొంత కాలం తర్వాతనైనా నిజం గ్రహిస్తావన్న నమ్మకం వుంది.... వస్తా...."– అని వేగంగా బయిటకొచ్చేడు వాసు.

మొహం కమిలిపోయింది.

రోడ్డంతా చెరిగిపోయిన రంగులబొమ్మలా కన్పించింది.

పెళ్ళయిన నెల రోజులకే పెళ్ళాం పక్కింటివాడితో లేచిపోతే-వెంట తరిమే నవ్వుల్ని పట్టుకోలేని మనిషిలా వున్నాడు సీతాపతి.

వికవికలు, పకపకలు, సర్వర్ల కేకలతో షతిచెడింది సీతాపతికి. తన కళ్ళ ముందున్న ప్రపంచం ప్రేతల నృత్యం చేస్తున్న శ్మశానవాటికలా వుంది. తన వునికి తనకే భయంవేసింది. చెమటలు కారిపోతున్నాయి. తన మీద తనకే అసహ్యం వేసింది. ఆడపిల్లలా కన్నీరు కార్చేడు.

మెల్లగా, భారంగా బయిటకొచ్చేడు.

రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది. వెలుగు కన్పిస్తున్న మేర వాసు కోసం కలయచూసేడు. పిచ్చిగా జుట్టు పీక్కున్నాడు.

అతని అడుగులు ఇంకా నిద్ర కుపక్రమించని భూలోకస్వర్గంవేపు మళ్ళేయి. అక్కడ దొరికే అమృతం ఆయువును పెంచకపోయినా ఆలోచన్లని పెంచదు. అతనికి ఆ ఆయువుకన్నా ఆలోచన్లు ముఖ్యం- అందుకే అతని దారి సారాయి దుకాణం వైపు వుంది.

* * *

గుమ్మం దగ్గర మాధవి ఆకలిగొన్న ఆడిపులిలా వుంది.

ఇల్లంతా చీకటిగా వుంది. కిటికీలో దీపం చీకటిని చీలుస్తోంది.

"ఎక్కడ నుంచి రావడం....?!"

రిక్షా దిగి లోపలికి వస్తున్న లతకి అనుకోని ప్రశ్న- అడగకూడని కంఠం ఎదురైంది. లత మెదడు చురుగ్గా పన్జేయలేదు. తన్ను కాదన్నట్లు కదల బోయింది.

"అడిగేది నిన్నే.... ఎవరితో రావటం... ?!"

కరెంటులా కోపం నవనాడుల్లోకి పాకిపోయింది లతకి. కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ కొరకొరా చూసింది.

"నువ్వింట్లోకి రానక్కరలేదు.... ఇది సంసారులుండే ఇల్లు...."

లత అహం దెబ్బతింది చేతిలో ఆయుధం వుంటే ఎలా వుండేదో?! ముట్టు కుంటే దహించుకుపోయేలా వుంది.

"నోటి కొచ్చినట్లు మాట్లాడకు...."- కర్కశంగా అంది లత.

వెయ్యేనుగులు మీద పడ్డట్టయింది మాధవికి.




"అడ్డమైనవాళ్ళతో మాట్లాడటం నా కనవసరం. మర్యాదగా చెప్తున్నాను. నువ్వింట్లోకి రావడానికి వీల్లేదు."_ గుమ్మానికి అడ్డంగా నిల్చుంది.

"అడ్డు చెప్పడానికి నువ్వెవరు ?!"

"ఆ ప్రశ్న వెయ్యడానికి నువ్వెవరో ముందు చెప్పు...."

"చెప్పాల్సిన అవసరం లేదు...."

"వినే ఓపిక ఇక్కడెవ్వరికీ లేదు.... ముందు బయటకు నడు...."

"వెళ్ళను.... ఇది నా ఇల్లు... వెళ్ళమని చెప్పడానికి నీకెంత హక్కు వుందో వుండడానికి నాకూ అంతే హక్కు వుంది....గుర్తుంచుకో...."

"ఏమిటి నీ హక్కు.... జాలి తలచినందుకు నా సంసారం కూల్చి అమాయకుడ్ని చేసి పదిమందితో కులికే నీకు హక్కా ?!!"

పిచ్చిపిచ్చిగా మాట్లాడకు...."

"బెదిరిస్తున్నావా ?!"

"అదిలిస్తున్నాన్నా... "

"అందరూ నీలా జంతువు లనుకోకు...."

"ఏదేనా ప్రవర్తన బట్టే చెప్పేది...."

"అందుకే ఇన్నిసార్లు చెప్తున్నాను బయటకు పొమ్మనమని...."

"బయటకు పొమ్మని చెప్పడానికి నువ్వెవరు.... అడ్డులే ముందు...."

ఇద్దరి గొంతులు రోడ్డుమీద కొచ్చేయి. వీధంతా నిశ్శబ్దంగా వుండటంతో గాలితో పాటు మాటలు అన్ని ఇళ్ళల్లోకి దూరిపోయేయి. నిద్రపోతున్న ఇళ్ళల్లో లైట్లు వెలిగేయి. జనం కిటికీలోంచి చూస్తున్నారు. చీకటింట్లో గొంతులు తప్ప ఆకారాలు కన్పించలేదు.

కానీ ఖర్చు లేకుండా సినిమా చూడొచ్చనుకొన్న ఇద్దరు ముగ్గురు పెద్దలు నిద్ర చెడిపోగా రోడ్డుమీద కొచ్చి మాటల యుద్ధాన్ని విని ఆనందిస్తున్నారు.

మబ్బుల ఆకాశం అరుపుఃకి అదిరిపోతోంది.

మేఘాల రాపిడికి పుత్పన్నమయ్యే పురుములా వాళ్ళిద్దరి పోట్లాట మధ్యే బిందు ఏడుపు. ఎవ్వరూ విడదీయడానిక్కి ప్రయత్నించలేదు.

మూగుతున్న జనాన్ని పట్టించుకునే స్థితిలో ఇద్దరూ లేరు. బహువచనం ఏకవచనమై శాస్త్రీయమైన బూతులు బయిటకొస్తున్నాయి.

రణరంగంగా మారింది- గారడీ చూస్తున్న జనంలా అందరూ వీధి గుమ్మం లోకి చేరేరు.

ఏడుపులు- పెడబొబ్బలు.

అమ్మలక్కల్లో గుసగుసలు.

సీతాపతి రోడ్డుమీద నడుస్తున్నాడు—గాల్లో తేల్తున్నాడు. అర్ధంకాకుండా వస్తున్నాడు. దీపాల వెల్తురు తీగలా పాకుతున్నట్లు కన్పించిఁది. అలికేసినట్లుగా వున్నాయి ఇళ్లు—అలవాటయిన దారి కావటంతో తేలీకుండానే ఇంటిదారి పట్టింది నడక—అనుమానం వచ్చినచోట అగ్గిపుల్ల వెలిగించి చూస్తున్నాడు.

కళ్లు వుబ్బిపోయి నీటిలో శవంలా, వురితాడుకి వేల్లాడుతున్న మనిషిలా వున్నాడు.

మధ్య మధ్యలో తెలీకుండా ఏడుస్తున్నాడు- గొణుక్కుంటున్నాడు.

చిన్నగా ఇంటిదగ్గరకు చేరాడు.

గుమ్మానికి దడికట్టివున్న జనాన్నిచూసి అయోమయంలో పడ్డాడు. తను వచ్చిన సందు కరెక్టు అవునో కాదోనని వెనక్కి తిరిగిచూసేడు. ఏవీ కనబడలేదు- వీధంతా నల్లగా కన్పించింది.

అతన్నే చూస్తున్న జనం మనుషుల్ని పీక్కుతినే రాక్షసుల్లా కన్పించేరు.

దర్బారుల్లో రాజుగారొచ్చినపుడు స్వాగతం పలికే సామంతుల్లా ఇంట్లో కెళ్ళడానికి దారిచ్చేరు జనం.

అతను రాజులా వెళ్లలేదు.

వీధి గుమ్మంలోంచి వరండా దగ్గరకొచ్చేసరికి అడుగులు ఆగేయి.

లత - మాధవి ఇద్దరూ ఒక్కసారి తన్ని చుట్టుముట్టేసరికి కొంచెం మత్తు దూరమైంది.

ఇద్దరి మాటల బాణాలు గుచ్చుకునేసరికి అది తనిల్లేనని గట్టి నిర్ణయానికి రాక పోవడమే కాకుండా - వంటికి కొంచెం స్పర్శకూడా తెల్సింది.

"చూడు బాబూ! ఇన్నాళ్లూ మీ గొడవ భరించలేక చస్తున్నాం.... సంసారం చెయ్యడం చేతగాకపోతే ముగ్గురూపోయి గంగలో దూకండి "- అన్నాడో పెద్దాయన భరించలేక.

"అంత దూరం పోవడానికి ఛార్జీలు ఇవ్వండి...."- అన్నట్టు ఆయనకేసి చూసేడు సీతాపతి.

"ఏం పావుకుందామని ఇద్దర్ని కట్టుకొన్నావు స్వామి ?!"- మరో కంఠం.

ఒక్కసారి గొల్లుమన్నాయి గొంతుకలు.

"మనీ సానికొంపలా తయారయిందండి...."- అనుకుంటూ చుట్టుపక్కల వాళ్లు మెల్లగా బయటకు వెళ్లేరు.

సీతాపతి రాకతో తనతోపాటు తెచ్చుకొన్న సువాసన దెబ్బకి అమ్మలక్క లందరూ జాలి వర్షం, తిట్లజోరు తగ్గించి ఇళ్ళకి వెళ్ళిపోయేరు.

సీతాపతికి సగం స్పృహ వచ్చింది.

ఇంకా చుట్టూ జనం నవ్వుతున్నట్లే వుంది....

జుట్టు విరబోసుకొన్న మాధవిని చూడంగానే ఏంజరిగివుంటుందో వూహించే ప్రయత్నంలోపడ్డాడు.

"ముందే చెప్తున్నాను దాన్ని ఇంట్లోకి రానిచ్చారో నే బావిలో దూకి చస్తాను...."- అంది మాధవి సీతాపతి భుజంపట్టుకొని కుదుపుతూ.

సీతాపతి స్తంభానికి చేరగిలపడ్డాడు.

"ఇందాకటినుంచి నానా మాటలంటోంది.... నేను చెడిపోయిన దాన్నట. అలాంటి మాట లనిపించుకోవడంకన్నా చావడం మేలు "- కన్నీళ్లు తుడుచు కుంటూ అంది లత.

"చస్తాను.... చస్తాను.... అంటారే కాని ఇద్దరూ ఒక్కసారైనా చావరే!!"- అన్నట్టు ఇద్దర్నీ చూసేడు.

బిందు అందర్నీ భయంగా చూస్తోంది.

"మీకు ఆనాడే చెప్పేను ప్రతి అడ్డమైనవాళ్ళని కొంపలోకి తీసుకురావద్దని....

నా కొంప కూలేచ్చేదాకా నిద్దరపట్టలేదు. నీతి, జాతి లేనివాళ్ళందరిచేత మాటలు పడాల్సొస్తోంది....”— దుఃఖం కట్టలు తెంచుకొంది.

ఉక్రోషం పెరిగిపోయింది.

సీతాపతి మౌనం అగ్నికి ఆజ్యంపోసినట్లయింది. మాధవి వొళ్లు వశంతప్పింది.

“మాట్లాడరేం.... దాన్ని మెడబట్టుకొని బయటకు నెట్టండి....”— చొక్కా పట్టుకొని గుంజింది మాధవి.

లత ఏడవడంతప్ప మాట్లాడలేదు.

సీతాపతి మత్తు వదుల్తున్న కళ్ళతో లతని చూసేడు.

చెరిగిపోయిన బొట్టుతో నుదురంతా ఎర్రగా వుంది. కళ్లు చింతనిప్పుల్లా మెరుస్తున్నాయి. దీపం చిరుగువెలుగులో సహగమనానికి సన్నిద్ధురాలౌతున్న వితంతువులా వుంది లత.

గదిలోంచి ఇంకా మాధవి అరుపులు వినిపిస్తూనే వున్నాయి.

మెల్లగా గదిలోకి వెళ్లేడు సీతాపతి.

“మీకు ఇన్నాళ్లూ మనశ్శాంతి లేకుండా పోయింది నావల్ల.... ఆలస్యంగా తెలివొచ్చింది.... నే వెళ్ళిపోతున్నాను....”— లత నిర్ణయం సీతాపతిని కలవర పెట్టింది.

“నువ్వెళ్ళినంత మాత్రాన నా కొచ్చిన మాట పోదు.... మనల్ని మనం సంస్కరించుకుని ఎదుటి మనిషిని అర్థంచేసుకుంటే ఇన్ని మాటలు పడాల్సిన అవసరం వుండేది కాదు— ఈ పరిస్థితి వచ్చేది కాదు.... పద లోపలికి....”—

నా నిర్ణయం మారదన్నట్లు కదల్లేదు లత.

“మళ్ళీ దాన్ని ఇంట్లోకి రానీయకండి.... దానికేం.... పెట్టి పోషించేవాళ్లు చాలామంది వున్నారు వూళ్లో....”—

“మాధవీ !!”— కోపంగా అరిచేడు.

“ఏం ! నే నన్నమాటంటే కోపం వచ్చిందా ! మీరు చేసే పన్లకి నాకెంత కోపం రావాలి.... ఎన్నిచేసినా సహిస్తూ వూరుకున్నాను.... ఇంక వోపికలేదు. సూటిపోటి మాటలు వింటూ ఈ సంసారాన్ని నరకంచేస్తుంటే చూసి వూరుకొని భరించేశక్తి నాకులేదు....”— మాధవి రెచ్చిపోయింది.

“ఇనాళ్లు నాతో సంసారం చేసి ఇలా అసహ్యంగా మాట్లాడమా నువ్వు నేర్చుకొంది ?!”

“నే నెంత అనుభవిస్తున్నానో మీ రెప్పుడైనా ఆలోచించేరా ?! నేను కాబట్టి



ఇంకా ఇంతకాలం వోర్చుకున్నాను. దాన్ని చూస్తే నాకు అసహ్యం.... ముందు దాన్ని బయటకు గెంటండి...."_ ఏం మాట్లాడుతోందో తనకే తెలీటంలేదు.

సీతాపతి ఓర్పు మెల్లగా నశిస్తోంది....

"చుట్టుపక్కలవాళ్లు వింటారన్న జ్ఞానంలేకుంగా సిగ్గుఎగ్గు లేకుండా బజారున పడ్తారా ?! ఇదేనా మీ సంస్కారం... ?!!"

"అంత సంస్కారం వున్నవాళ్లు పెళ్ళాంవుండగా ఇంకోదాన్ని తెచ్చిపెట్టుకోవడం.... అది బరితెగించి ఇష్టంవచ్చినట్లు తిరుగుతుంటే అప్పుడు పరువు, ప్రతిష్ఠలు, చుట్టుపక్కలవాళ్లు చూస్తారన్న జ్ఞానం అప్పుడేమయింది ?!....ఇంత జరిగింతర్వాత మే మిద్దరం కల్సివుండటం జరగని పని...."_మాటలు ఈటెల్లా సీతాపతి గుండెను గుచ్చుకొన్నాయి.

బిందు మళ్ళీ ఏడుపు అందుకొంది.

లత కోపం బిందుమీద చూపించింది- దాంతో మాధవికి విపరీతంగా కోపం వచ్చింది. బిందుని దగ్గిరకు తీసుకుంది ఒక్క వుదుటున. దాంతో మళ్ళీ యుద్ధం ఆరంభం.

"నా పిల్లను నా ఇష్టంవచ్చినట్లు కొట్టుకుంటా- ముందు దాన్నిటివ్వు.. "-లత మళ్ళీ శక్తిని పుంజుకుంది.

"కసంగానే సరిపోదు.... అరిచి గీపెట్టినా దాన్నివ్వను...."-

ఇద్దరి మధ్య ప్రేక్షుడయ్యాడు. నిమిషనిమిషానికి మాటలు పదను పెరిగి చేతులదాకా వచ్చింది. రెండు పొటేళ్ళమధ్య తలదూరిస్తే ఏమౌతుందో సీతాపతికి తెలుసు.

ప్రతిదానికి ఇలారోషాలుపెంచుకొని ఇంతదారుణంగాప్రవర్తిస్తారని ఎప్పుడూ వూహించలేదు. అతనిలో సహనం చచ్చిపోతున్నకొద్దీ వాళ్ళ కీచులాటస్థాయి పెరిగింది. వారించి విఫలుడయ్యేడు మళ్ళీ జనం గుమిగూడతారేమోనన్న అనుమానం మెదిలేసరికి శరీరం కంపించింది. గుట్టుగావున్న సంసారం ఇంత దారుణంగా రోడ్డుమీది కొచ్చిందన్న తలంపు రాగానే సహించి వూరుకోవడం సీతాపతివల్ల కాలేదు.

తను పశువుగా మారిపోతున్నాననే అనుమానం మెదిలేసరికి తన్ని తాను సంభాళించుకొన్నాడు. వాళ్ళిద్దరూ తన్ని అర్థంచేసుకొనే స్థితిలో లేరు.

అతని సహనానికి పరీక్ష ॥

సీతాపతి ఓడిపోయేడు. అతనెన్నడూ చెయ్యని పని- ఎప్పుడూ వూహించనిది - ఎత్తిన చెయ్యి దించకుండా తను మనిషినన్న విషయం మర్చిపోయి ఆవేశంలో ఇద్దర్నీ గొడ్డును బాదినట్లు బాదేడు. దాంతో మాధవికి షాక్ తగిలి నట్లయింది. తన పదేళ్ళ సంసారంలో సీతాపతి వుగ్రరూపం ఎప్పుడూ చూళ్లేదు.

నోటివెంట కారుతున్న రక్తం చూసుకొని అవాక్కయింది.

జంతువు మార్పుచెందుతూ మార్పు ఆగిపోయి సహం జంతువు సహం మనిషిలా వున్నట్లు కన్పించేడు మాధవి కళ్ళకి సీతాపతి. అతని కోపాగ్ని జ్వాలలు తట్టుకొని నిలబడే ధైర్యం రాలేదు. నోటికి కుట్లుపడ్డట్టు ఎదురుగా యముడిని చూసినట్లుగా సీతాపతికేసి చూస్తూ వున్నచోటునే కూలబడిపోయింది.

లత ఎక్కిళ్ళను ఆపుకుంటూ గదిలో చాపమీద పడుకొంది.




బిందు భయంగా మాధవికేసి చూస్తోంది.

సీతాపతి లోకంలోకి వచ్చేడు. తను చేసిన పని గుర్తుకొచ్చేసరికి తనమీద తనకే చెప్పలేనంత అసహ్యం వేసింది. ఎప్పుడూ కన్నీరెరుగని సీతాపతి కంటి వెంట వెచ్చటి అశ్రువు రాలిపడింది.

"నే నే పనయితే చెయ్యకూడదనున్నానో.... దాన్ని నా చేత చేయించేరు.... ఇంతకన్నా మీరు చస్తే ఓసారి ఏడ్చి వూరుకొందును.... ఛీ....ఛీ...."- అని విసురుగా బయటకు వెళ్ళిపోయేడు.

*　　　*　　　*

ఊరు మేల్కొంది కోళ్ళ అరుపులతో- పాలవాళ్ళ కేకల్తో- పేపరువేసే కుర్రాళ్ళ హడావిడితో- పంపుగొడవల్తో....

పక్కింటి పాతరేడియో సుప్రభాతం పాడుతోంది.

ఎదిరింటి కుర్రాళ్లు గట్టిగా చదువుతున్నారు.

దొంగలుపడ్డ ఆర్నెల్లకు పోలీసు లొచ్చినట్లు చిన్నగా ఆకాశంలోకి వచ్చేడు సూర్యుడు.

పూర్తిగా బద్ధకం తొలగించుకొంది వూరు.

సీతాపతికి మెలుకువ రాలేదు. కిటికీలోంచి ఎండ మీదపడి రాత్రి పుదంతాన్ని మళ్ళీ కొత్తగా గుర్తుచేస్తోంది లతకి. అయినా కళ్లు తెరవబుద్ధి కాలేదు. ఒళ్ళంతా

పచ్చిపుండులా వుంది.... నీరసంగా వుంది.... ఒకసారి గదిని కలయజూసింది. వెల్తురు వెల్లవేస్తోంది గదిలో.... మళ్ళీ కళ్లుమూసుకొంది.

పంపుదగ్గర బిందెలగొడవ- పక్కింటి రేడియో శబ్దం సీతాపతిని బలవంతంగా నిద్రలేపేయి.

బద్ధకంగా లేచేడు. కాఫీకోసం ఎదురుచూసేడు.

ఇంట్లోంచి ఏ శబ్దం విన్పించలేదు.

గతరాత్రి జరిగింది ఆ క్షణంలో గుర్తుకు రాలేదు. మంచంమీదనుంచి లేవబోయేడు.... మళ్ళీ బద్ధకంగా కూలబడిపోయేడు. సిగిరెట్టు వెలిగించేడు.

మధ్యరాత్రి మహారణ్యంలా నిశ్శబ్దంగావున్న వాతావరణం చిరాకనిపించింది. లేచి లోపలి గదిలోకి వచ్చేడు.

గదిలో లత పారేసిన బొమ్మలా పడుంది చాపమీద. చెదిరిపోయిన జుట్టు- చెరిగిపోయిన బొట్టు-బుగ్గలమీద కన్నీటి మరకలు- ప్రాణం వున్నా లేనట్లుగా వుంది.

సీతాపతికి ఆమెను చూడంగానే అదోలా మారిపోయేడు. ఆమె ఎడల సానుభూతి కల్గింది. మొగ్గగా వుండగానే వాడిలి రాలిపోయినట్లుగా వుంది లత.

పక్కగదిలో మాధవి లేదు.... బిందు కనబడలేదు.... పెరట్లోకి వెళ్ళి చూసేడు. అక్కడా లేరు. ఏదో తెలీని భయం ఆవరించింది. మళ్ళీ ఇల్లంతా కలయచూసేడు. గాభరాపడ్డాడు.... గందరగోళమైపోయేడు.

లతని నిద్ర లేపేడు.

కోపంగా చూసింది సీతాపతికేసి.

వరండాలోకి వచ్చేడు. మంచంమీద దృష్టిపడింది. తన తల దిండుదగ్గర మడతపెట్టిన కాగితం చూడంగానే గుండె గుభేల్ మంది.... నరాలు జివ్వుమన్నాయి.... గుండె దడదడలాడింది....

ఆత్రుతగా అందుకొన్నాడు కాగితం.

అతి జాగ్రత్తగా మడతలు విప్పేడు. చేతులు వణికేయి.

"సీతాపతిగారికి....

రాత్రి మీ చర్య నా వ్యక్తిత్వానికో పెద్ద దెబ్బ. పదేళ్ళ సంసార జీవితంలో నేను మిమ్మల్ని తప్పుగా అర్థంచేసుకొన్నానో మీరు నన్ను అర్థంచేసుకోలేదో తర్కించుకొనే వోపిక, అవసరం రెండూ లేవు. కలలో అమృతం తాగి కలకాలం బ్రతకాలని నే నెప్పుడూ ఆశపడలేదు.

సంసారంలో ఎన్ని ఒడిదుడుకు లొచ్చినా మొదట్నించి సర్దుకుపోవడం అలవాటు చేసుకొన్నాను. నా కెన్నో ఆశలున్నా వాటిని మీ సహచర్యంలో చంపేసుకొన్నాను. అందుకు నే నెన్నడూ చింతించలేదు. నాకు అంతవరకే ప్రాప్తం అని సర్దుకుపోయేను.



ఏ ఆడదైనా తన స్థానంలో మరో స్త్రీని వూహించుకోదు. అక్కడమాత్రం త్యాగం చెయ్యలేదు. మన సాంప్రదాయాలు వగైరాదులు అడ్డురావచ్చు.... అంత గొప్పగా ఆలోచించే మనసు లేకపోవచ్చు. అది ఏదేనా కావచ్చు. నేను సామాన్యురాలిని. నా స్థానంలో మరొకళ్ళను భరించలేను.

ఒకే మంచంమీద ఇద్దరు పడుకో వచ్చుగాని ఇద్దరికీ ఒకే కల రావాలను కోవడం కేవలం అవివేకం. అదే మీరు చేసిన పొరపాటు. దిద్దుకోలేని పొరపాటు కావచ్చు....

రాత్రి మీరు చేసిన పని మరోసారి మీ చేతిదెబ్బ తినటం ఇష్టంలేదు. జరిగినంత కాలం ఫర్వాలేదు. ఆ స్థితి, పరిస్థితి ఏర్పర్చుకొన్నాక అది అక్కడితోనే ఆగిపోతుందన్న నమ్మకం లేదు.... మరోసారి.... మరోసారి....జరగొచ్చు.... నవ్వులపాలైన జీవితాన్ని మరింత నవ్వులపాలు చేసుకోలేను. అందుకే మీ అందరికీ దూరంగా వెళ్ళిపోతున్నాను. ఎక్కడికో నాకూ తెలీదు. ఇంతకన్నా మంచి జీవితం దొరకక్కపోయినా ప్రశాంతంగా బ్రతకగలనన్న నమ్మకముంది.

నేను లేకపోయినా మీరు సుఖంగా బ్రతకగలరని నా విశ్వాసం. ఎప్పుడేనా ఓ క్షణం మీ ఆలోచనల్లో నేను చోటుచేసుకోగలిగితే చాలు.

నాతోపాటు బిందునికూడా తీసుకెళ్తున్నా.... ఎందుకో నాకూ తెలీదు. నా స్వంతం పిల్లలకన్నా అదంటేనే ప్రేమ.... ఎందుకో తెలీదు. అది లేకపోతే

బ్రతకలేనేమోనన్న అనుమానం....అంతగా దానిమీద అనుబంధం ఎలా పెంచు కొన్నానో నాకూ తెలీదు. నేను ఎలా వున్నా దాన్ని చక్కగా పెంచుతాను.

మరోసారి అవకాశం వుంటే తప్పకుండా కలుస్తాను.... ఆ అవకాశం రాకూడదనే భగవంతుడ్ని ప్రార్థిస్తున్నాను.

మీరు మా ఇంటికెళ్లి పిల్లల్ని మాత్రం తీసుకురాకండి.... ఆ వొక్కపని నా కోసం చెయ్యండి. అలానే నా కోసం వెతకడం మాత్రం చెయ్యకండి.

సెలవ్

మాధవి."

సీతాపతి వుత్తరం చదవడం ముగించగానే కన్నీటి పొరలు అతని చూపుల్ని అడ్డుకొన్నాయి.

దిగాలుపడిపోయేడు. శిలలా బిగుసుకుపోయేడు ... ఆలోచన్లు పదేళ్ల వెనక్కి పోయేయి.

తన ముందున్న ప్రపంచం నల్లగా అసహ్యంగా కన్పించింది.... ఏదో వింత ఆహాకారాలు విన్పిస్తున్నాయి .... మెదడు మొద్దుబారిపోయింది.

అడుగుల చప్పుడుకు చలనం కలగలేదు.

అతని చేతిలోని కాగితం ఎగిరిపోయే ప్రాణంలా వుంది.

లత సీతాపతికేసి చూసింది.

ప్రాణం కళ్ళల్లోంచి పోయినవాడిలా చూస్తున్నాడు సీతాపతి. అతని చేతిలో వుత్తరం తీసుకొంది లత.

ఉదయం ఎండ కాలిపోతోంది.

రోడ్డుమీద శబ్దాలు విన్పిస్తూనే వున్నాయి.

పక్కింటి రేడియో పాడుతూనే వుంది.

సీతాపతి ప్రాణంలేని శిలలా – కరిగే కాలంలా వున్నాడు.

ఏ జీవితానికి ఎప్పుడు ముగింపో తెలుసుకోవడం కష్టం– అనుకొన్నవన్నీ జరిగిపోతే నా వునికివి ఎవరు గుర్తుచేసుకొంటారు?! అన్నట్టుగా చూస్తున్నాడు గోడకి వేల్లాడుతున్న నామాలున్న దేవుడు.

---

# కళ్యాణ ఘడియ

గోపీకృష్ణ



చేతిలోని కవరు పక్కనపడేసి గట్టిగా వళ్లు విరుచుకున్నాడు శివాజి.

కిటికీలోంచి చూశాడు బయటికి. శీతాకాల సాయంత్రం ఎప్పట్లా ఆహ్లాదంగా ఉంది చల్లనిగాలి వీస్తూ, సూర్యుడు సంధ్యాదేవి కౌగిలిచేరేందుకు వేగంగా పరుగులుతీస్తున్నాడు. పొట్ట కూటికై విశాల ప్రపంచంలోకి పోయిన పక్షులు మంద్రంగా రెక్కలల్లార్చుతూ గూళ్లు చేరుతుంటే, పంజరం దాటిన పిట్టల్లా కేరింతలు కొడుతూ వీధిలో పిల్లలు ఆటలాడుతున్నారు. దూరంగా ఓ గోళీల తగవు. శివాజి నవ్వుకుంటూ మరో కవరు తెరిచాడు—

"మైడియరన్నయ్యా,

నేను క్షేమంగా ఉన్నానని మళ్లీ వేరే రాయాలా? అక్కర్లేదు కదూ!

అన్నయ్యా నువు ఎంత చక్కగా రాస్తావు ఉత్తరాలు! అసలు ఉత్తరాలు రాయడం నీ దగ్గర్నుండే నేర్చుకోవాలేమో ఎవరైనా. నీ ఉత్తరాలు చదువుతూంటే నాకు నిన్ను చూస్తున్నట్టే ఉంటుంది నిజంగా. సరే ఏమిటిది కవిత్వం రాస్తుందనుకుంటున్నావా? పోనీ రాయన్లే!

నువ్వేమీ అనుకోకపోతే ఓ చిన్న డవుటన్నయ్యా ఇంత చక్కగా నాకే ఉత్తరాలు రాస్తావే! నువ్వు యింక ఏ 'వదిన'కైనా అయితే యింకెంత బాగా రాస్తావో. ఏయ్ నన్ను మట్టుకు తిట్టకేం సరదాకి రాశానంతే. నా పిచ్చిగానీ, అసలు పెళ్లేకాని వాడికి పెళ్లాం ఏమిటి? ఏమిటన్నయ్యా, నీకంటే ఎంతో చిన్నదాన్ని నా పెళ్లికూడా అయిపోయింది.... ఇంకెప్పుడు చేసుకుంటావ్???"

"పెళ్లి....హ....హ...." అని నవ్వుకుంటూ ప్రశాంతంగా వెనక్కు వాలి కళ్లు మూసుకున్నాడు శివాజీ.

సిగరెట్ వెలిగించుకొని తాపీగా పొగ వదిలాడు.

"ఇంకో ఏడాదిలో రిటైర్ కాబో తున్నవాడికి పెళ్లా!"

నవ్వుకు, ప్రేమగా చెల్లెలి ఉత్త రాన్ని గుండెకదుముకున్నాడు.

పక్కనే ఉన్న కుర్చీలో ఓ ఉత్తరాల బొత్తి. చదివిన సూచనగా కొన్ని కవర్లు విడిగా పడిఉన్నాయి. ఆ ఉత్తరాలు ఈనాటివి కావు. దాదాపు పాతిక ముప్ఫయ్యేళ్ల క్రితానివి.... ఎన్నో జ్ఞాప కాలు, యింకెన్నో మధుర భావాలు, వింత సంఘటనలకు ప్రతీకలవి.

గత స్మృతులు మెల్లగా నిద్రలేవ సాగాయి...

* * *

"ఇంత చిన్నప్పుడే ఉద్యోగమేమి టండీ బావగారూ, చదివించండింకా వాణ్ని" పిన్ని.

"ఓస్, బోడి బియ్యే పాసవ్వగానే ఉద్యోగా లెవడిస్తాడండీ...."

"అందులో ఈ ఏడేగా పాసయింది"

"ఉద్యోగం రావాలంటే కనీసమో రెండేళ్లయినా పడుతుందిగా అన్నయ్యా, ఎమ్మే కానివ్వకయ్యా" బాబాయిల హెచ్చ రికలూ, సలహాలూ.

"మాకు మాత్రం చదివించచాలని లేదంటారా, కానీ ఆయనొక్కరి సంపా దనమీద ఏడుగురం తినాలండి. ఎందరి కని కట్టం ఫీజులు? యూనివర్శిటీ అంటే యిప్పుడు ఫీజులు కాకుండా నెలనెలా ఓ రెండొందలైనా పంపాలా? ఎలా సాధ్య మౌతుందండీ...." అమ్మ వివరణ.

"చూద్దాం! ఏ లాటరీ అన్నా తగలక పోతుందా ఈ లోపులో" అన్నట్టు మాట్లాడే నాన్న.

ఆ చర్చ అంతా తనగురించే అయినా తనకేమీ పట్టనట్టు దీక్షగా బొమ్మ గీయ డంలో నిమగ్నమై ఉన్న శివాజీకి చెదురు మదురుగా విన్పిస్తున్నాయి వాళ్ల మాటలు. కొన్ని మాటలయితే చెవిలో దూరు తున్నాయిగానీ వాటి భావమేమీ బుర్ర కందటంలేదు ఏకాగ్రతతో బొమ్మ గీయడం వలన. మొదలుపెట్టినప్పుడు అనుకున్నదానికంటే కూడా ఎంతో బాగా ఈ బొమ్మను గీయగలిగాననే తృప్తి మనసంతా నిండుకుని మరింత ఉత్సా హంగా మెరుగులు దిద్దుతున్నాడు ఆ నాట్యభంగిమ కాలి అందెలకు!

"మేం లేమేమిటండీ సహాయం చెయ్యాలంటే ఎప్పుడన్నా. యిబ్బంద యితే చూసుకోవచ్చుగానీ చదివించండి వాణ్ని. మావాళ్లెలానూ చదివేట్టులేరు.."

తలెత్తాడు.

రాఘవ బాబాయి మాట్లాటది. తనకు తెలుసు. అందరూ ఒకరి సంపాదన మీద ఆధారపడినవాళ్లే.... ప్రయాణీకు లెక్కువే కాని నావను లాగేదిమాత్రం ఒక్కడే అన్ని సంసారాల్లోనూ. అభి మానం వాళ్లనలా అనిపిస్తోంది.

"ఎందుకులే బాబాయ్. డిగ్రీ అయిం దిగా ఏదో ఒక ఉద్యోగం గ్యారంటే అంటున్నారంతా."









"నోర్మయ్యవోయ్ పెద్దచెప్పొచ్చావ్. ఇంతకూ నువ్వేంచేస్తున్నావక్కడ ?"

"ఆఁ ఏంలేదు.... ఏదో చిన్న బొమ్మ " మధ్యగదిలో ఉన్నవాళ్లకు దూరంనుండే చూపించాడు.

"వార్నీ ఇంకా మానలేదేవిట్రా ఆ బొమ్మలూ ???" ఆశ్చర్యంగా అన్నాడు రవి బాబాయ్

పిన్నలయితే పరుగెత్తుకొచ్చేశారు బొమ్మ చూడగానే 'ఎంత చక్కగా వేశావురా' అంటూ.

సంభాషణ దారిమళ్లింది. పంచదార కోటానుంచి ఫారిన్ ఎక్స్చేంజివరకూ సంభాషణలు సాగుతున్నయ్ వాళ్లమధ్య. ఉద్యోగాల మూలాన వేర్వేరు చోట్ల ఉండేవాళ్లు అలా రెండుమూడేళ్లకోసారి ఎక్కడైనా ప్రీప్లాన్డ్‌గా కలిసి ఎంజాయ్ చేసేవారు.

వాళ్లు మళ్లీ సంభాషణలో పడడంతో శివాజీ మళ్లా తన దృష్టిని చిత్రంపై కేంద్రీకరించాడు.

చిన్నపటినుండే ఏదో బొమ్మలు గీస్తుండేవాడు శివాజీ. మొదట్లో ఏదైనా బొమ్మను ఆధారంగా తీసుకుని మళ్లా దాన్ని రిప్రొడ్యూస్ చేయడమో, ఎన్లార్జ్ చేయడమో చేసేవాడు. రానురాను స్వయంగా ఊహాచిత్రాలుగా అనుకున్న ప్రతీ భావననూ మలిచే స్థితికొచ్చాడు.

ఆర్టిస్ట్‌గా అతను చాలా 'సెన్సిటివ్'.

ప్రతి చిన్న విషయానికి కూడా స్పందించేవాడు.

వేసే ప్రతి బొమ్మా అతనికి అలౌకికమైన తృప్తి, ఆనందం పంచేవి.

శివాజీని చదువు చెడగొడుతున్నావని తల్లిదండ్రులు మందలించిన రోజులూ ఉన్నయ్.

* * *

గడియారం ఠంగున మోగడంతో వాస్తవంలోకొచ్చాడు.

అయిదున్నర.

ఉత్తరం గుండెలమీదనుండీ తీసి కళ్ళజోడు సరిచేసి చూశాడు....

"నా పెళ్ళికూడా అయిపోయింది. ఇంకా నువ్వెప్పుడు చేసుకుంటావు అన్నయ్యా ?"

నవ్వుకుంటూ పేజీతిరగేసి చూశాడు. చివరగా—

"నీ ప్రియమైన చెల్లెలు
రుక్మిణి."

"ప్రియమైన... అవును ప్రియమైన... అందరూ ప్రియమైనవారే నాకు." గొణుక్కున్నాడు. తల్లిదండ్రులూ, బంధువులూ, స్నేహితులూ అందరూ ప్రియమైనవారే తనకు. అందరూ ప్రేమించేవాళ్ళే. ఇంత మంది ప్రేమించేవాళ్ళు, మంచిచెడ్డలు చూసి బాగుకోరేవాళ్ళూ ఉన్నా మనిషి పెళ్ళిచేసుకోక తప్పదా? ఏమిటి పెళ్ళంటే? ఈ బంధం లేకుంటే మనిషికి మనుగడ లేదా ? ఎందుకు లేదు ? తప్పకుండా ఉంది. అందుకు ఉదహరణ తనే!

మళ్ళా ఒకసారి ఉత్తరం వంక చూశాడు....

"ఇంకా ఇప్పుడు పెళ్ళేమిటమ్మా చెల్లాయ్ !" స్వగతంగా అనుకుంటూ ఉత్తరాన్ని ముద్దుపెట్టుకున్నాడు ప్రేమగా. పాత ఉత్తరాన్ని చదువుతుంటే ఆవరించిన నిస్సత్తువ జారిపోయి మళ్ళా యవ్వనం ప్రవేశించినట్టయింది. ముఖాన వెలుగు.... కళ్ళలో కాంతి. దీప్తివంతమైన వదనంతో పక్కనే పడున్న కవర్లోకి ఆ కాగితాన్ని మడిచి తోశాడు.

హు ! ముప్పయేళ్ళనాటి సంగతి. అప్పట్లో పెళ్ళో పెళ్ళో అంటూ అందరూ ఒకటే గోల. "ఇరవై ఎనిమిదొచ్చాయి యింకెప్పుడు చేస్కుంటావురా" అని సొద. అంతవరకూ చదువే ధ్యేయంగా ఉండేది. ఎలాగైతే 'ఎమ్మే' పూర్తి చేయడం; అదృష్టంకొద్దీ ఓ మంచి కాలేజీలో ఏడాదికే ఎకనమిక్స్ లెక్చరర్‌గా ఎపాయింట్‌మెంట్ దొరకడంతో ఇరవై అయిదేళ్ళకే సంపాదన మొదలైంది. అప్పట్నుంచీ వయసు గుర్తుచేస్తూ 'పెళ్ళి.... పెళ్ళి' అంటూ వెంటపడ్డా రందరూ.

మొదట్లో ఏదో తెలియని ఉత్సాహం. పెళ్ళిచూపుల కెళ్ళేవాడు.

ఏ అందమైన అమ్మాయిని చూసినా ఓ సుందర చిత్రం మనోనేత్రం ముందు కదిలేది—

ఏదో తపన.... ఆరాధన.... ప్రతీ పడతీ అందానికే ప్రతిరూపంగా—

శివాజీ భావన ఇలా ఉంటే....

అతని కెంతేనా నచ్చిన అందాల రాశులను కట్నకానుకల పేచీతో వదులుకున్నారు తల్లిదండ్రులు.

అతనిలోని ఆర్టిస్ట్ చాలా సెన్సిటివ్‌గా ఫీలయాడు... మానసికంగా దెబ్బతిన్నట్టయ్యాడు.... ఈ విషయంలో తిరస్కరించిన అమ్మాయిల్ని ఊహించలేక పోయేవాడు. ఎంతో బాధపడేవాడు.

"సృష్టిలోని అందానికి ప్రతిరూపం ఆడపిల్ల."

"సృష్టిలోని ప్రతి అణువణువూ రమణీయమైనదే.... అలాటి ఎన్నో అణువుల పొందిక, ఓ అంగాల అణిముత్యాల మాలికే రమణీమణి...."

—అనుకునేవాడు. అటువంటి 'అందానికి' ఈ హింస; అవమానం ఏమిటి? మథనపడ్డాడు.... క్రమేణా శివాజీ దృష్టిలో 'పెళ్ళి' అన్నది తేలిపోయింది.... అతనిలోని సంఘర్షణకు ఫలిత మిది:

"అప్పుడే నాకు పెళ్ళొద్దు" అని అన్నాడు ఓ రోజు—

తరువాత ఎవరెన్నిసార్లడిగినా అదే సమాధానం చిరునవ్వుతో.

శివాజీలో ఓ మార్పు ప్రత్యక్షంగా కన్పించింది ఆ తర్వాత....

మిగతా చిత్రాలెలా ఉన్నా ముఖ్యంగా అందమైన అమ్మాయిలను చిత్రించడానికే ఉత్సాహం చూపసాగాడు. రకరకాల కావ్యకన్యకలు కదలి రాసాగారతని చేతి కదలికల్లో. అనూహ్యమైన అందగత్తెలు జీవంపోసుకున్నారు 'కాన్వాసు' మీద శివాజీ కోర్కెమీద. అయితే ఆ చిత్రణ ఏ 'వికారం' వల్లనూ కాదు. వేసే ప్రతి చిత్తరువూ అతనికో తృప్తి, ఆహ్లాదం ఈయగా ప్రతి గీతా పవిత్రభావంతో, పెదవులపై చిరునవ్వు చెదరకుండా గీసేవాడు. వలువలలో ఒదిగిన వనితనే చిత్రించాడు తప్ప వస్త్రాలు విడిచి వయ్యారాలొలకబోసే వగలాడి శివాజీ కుంచెనుండి ఏనాడూ వెలువడలేదు. అలా ఖాళీ సమయాలన్నీ మరో ధ్యాస లేకుండా గడపసాగాడు ఉత్సాహంగా!

వెన్నాడుతున్న జ్ఞాపకాలనుండి తేరుకుని కవర్లన్నీ జాగ్రత్తగా మడచి వరుసగా సర్ది కట్టగట్టి లేచి అల్మయిరాలో సర్దాడు. తిరిగివచ్చి పడక్కుర్చీలో కూర్చుని సిగరెట్ వెలిగించి ఆలోచించసాగాడు.

"తనకు జీవితంలో ఏదైనా లోటుందా?"

"లేదు" అనుకున్నాడు తృప్తిగా.

పాతికేళ్ల క్రితం తమ్ముళ్ల ప్రశ్న చెవుల్లో గింగురుమంది.

"ఒరే అన్నయ్యా మా పిల్లల్ని చూస్తున్నావా ఆ సందడి కోసమైనా పెళ్లిచేసుకోవేంరా?"

శివాజీ నవ్వేడు.

"ఏరా, వాళ్లు నా పిల్లలు కారా? పెదనాన్నా అనే పిలుపులో మాత్రం మాధుర్యం లేదా?"

"నాన్న-అన్నదిమధురమైనదని ఒప్పుకుంటూనే ఎందుకురా యిలా జారుకుంటావ్! పోనీ ఎవర్నయినా ప్రేమించి మోసపోయావా?"

ఒకర్నేముంది, తను అందర్నీ ప్రేమించాడు. కానీ ఈ ప్రేమ వేరు, తమ్ముడడిగేది. అందుకే తల అడ్డంగా ఊపాడు-ఎదురుగా కూర్చున్న తమ్ముడు కులపతి కళ్లలోకి చూస్తూ అన్నాడు.

"ప్రేమించే మనసు నాకు లేదురా. ఇంక మోసపోయే దేముంది?"

"ఎందుకురా మమ్మల్నిలా బాధపెడ్తావ్? నువ్వు చేసుకోకుండానే మమ్మల్ని చేసుకోమని పట్టుబట్టావ్. పంతం నెగ్గించుకున్నావ్. ఇప్పుడైతే ఏం పోయింది చేసుకోరాదూ_"

"మీ రెందుకురా బాధపడడం! నేనా ఉద్యోగమేదో చేసుకుంటూ హాయిగానే ఉన్నా కదా!" నవ్వుతూ తేల్చేశాడు శివాజీ.

"నీలో....నీలో...ఏ....లో....ప....మైనా..." అడగలేక అడగలేక అడిగాడు, కులపతి.

ఉలిక్కిపడ్డాడు శివాజీ పడక్కుర్చీలో. అప్పటి తమ్ముడి ప్రశ్న ఇప్పుడూ ఉలిక్కిపాటు కలిగించింది. తనకు ఏదైనా లోపమా?

"నో!"

తనకూ యౌవన తొలిదశలో అన్ని కోరికలూ ఉండేవి. మధుర భావాలూ కలిగేవి. కానీ తనలోని కళాకారునికి పెళ్లికీ ఎందుకో పొసగలేదు. అతనిని కళాతృష్ణ గెలుచుకుంది.

చిత్రలేఖనమే ప్రాణం!

బొమ్మ గీయడమంటే తీయని అనుభూతి!!

బలంగా నాటుకున్న దొకే కోరిక;

ఆడపిల్లను అమృతవాహినిగా, ప్రకృతి కాంత రూపారవిందంగా అందానికే మారుపేరుగా చిత్రించాలి! ప్రపంచానికే అందమంటే ఏమిటో తెల్పాలి!!

సృజనాత్మక శక్తిగలవాడతను. అందుకే రాణించాడు_చిరకాలంలోనే.

ఈనాడు శివాజీ ఓ పెద్ద ఆర్టిస్ట్. ఎన్నో ప్రదర్శన లిచ్చాడు తన కిష్టం లేకున్నా మిత్రుల ప్రోద్బలం వల్ల. తానుగా ఎన్నో బహుమతు లందుకున్నాడు. శివాజీ బొమ్మలకు ప్రత్యేకత ఫేం, ప్రజల్లో ఒక విశిష్ట స్థానం అతనికుంచెకు. అతడు చిత్రించిన కావ్యకన్యలకు ప్రజలు జోహార్లర్పించా... అయినప్పటికీ కదలివంటిది అతని తృష్ణ.... ఇంకా తీరలేదతని దాహం.

సిగరెట్ ఆఖరు దమ్ము పీల్చి బట్








8

కిటికీలోంచి బయటకు విసిరాడు, ఆలోచిస్తూనే.

"మాష్టారూ" పిలుపు వినబడ్డంతో ఉలిక్కిపడ్డాడు. ఆలోచనలకు సడన్ బ్రేక్ పడింది.

"యస్ కమిన్!"

"నమస్తే మాష్టారూ...."

"ఓ ప్రభాకర్, నువ్వా. ఇలా వచ్చావేమిటోయ్?"

"లా ఆఫ్ ప్రపోర్షనల్ రిటర్న్స్ క్లాసులో అర్థంకాలేదండీ... మీరు...."

"ష్యూర్. కాస్త ఆ లైట్ ఆన్ చెయ్యి.... చీకటిపడింది బాగా."

"అదేనండీ. లైట్ లేదు; మీరు వున్నారోలేదో తెలియక బయటే నుంచుండిపోయాను" అంటూ స్విచ్ నొక్కి ట్యూబ్ వెలగగానే అరచేతిని ముద్దుపెట్టుకున్నాడు ప్రభాకర్.

నవ్వుకున్నాడు శివాజీ.

"కమాన్ కూర్చో" కుర్చీ చూపించాడు.

శివాజీ క్లాసులో ఎంత స్ట్రిక్ట్‌గా ఉంటాడో బయట అంత సరదాగానూ ఉంటాడు విద్యార్థులతో. అనర్గళమైన ఇంగ్లీషులో ఎలా చెబుతాడో అంత అందంగానూ తెలుగులోనూ చెబుతాడు. మిగతా పిరియడ్స్‌కి రాని విద్యార్థులు కూడా శివాజీ ఎకనమిక్స్ పాఠానికి వచ్చిన సందర్భాలున్నాయి. విద్యార్థులకు శివాజీ అంటే గౌరవం, ప్రాణం. అందుకు కారణం అతని ప్రవర్తనే. ఎవరూ వేలెత్తి చూపలేనంత ఉన్నతుడు లెక్చరర్‌గా.

"థాంక్యూ సర్!"

పాఠం విన్న ప్రభాకర్ నమ్రతతో

అన్నాడు. అతని ముఖం సంతోషంతో నిండి ఉంది.

"ఎనీ మోర్ డౌట్స్ ?"

"నో, సర్ !"

రెండు నిముషాలలా నిశ్చలంగా కూర్చున్నారు_

ఎందుకో శివాజీకి సరళ గుర్తుకొచ్చింది. సరళ చాలా తెలివైన పిల్ల. శివాజీ శిష్యురాలు నాలుగేళ్ల క్రితం.

"అక్కెలా ఉంది ప్రభాకర్ ?" ప్రశ్నించాడు.

అంతవరకు నవ్వుతూ ఉన్న ప్రభాకర్ ముఖం వివర్ణమయింది.

నెమ్మదిగా అన్నాడు_ "బాగానే ఉంది మాష్టారూ."

మౌనంగా మరి రెండు క్షణాలు దొర్లాయిద్దరి మధ్య.

"వెళ్లొస్తాను మాష్టారూ" ప్రభాకర్ లేచాడు.

"ఒకే, గుడ్ నైట్"

"గుడ్ నైట్, సర్ !" నీరసంగా వెళ్లిపోయాడు ప్రభాకర్.

శివాజీ ఆలోచనలు సరళ చుట్టూ తిరగసాగాయి.

సరళను తను ప్రేమించాడు !!!

ఎలా ???

అందరిలా 'వ్యక్తి' ని కాదు_

ఆమెలోని అందాన్ని ప్రేమించాడు ఓ చిత్రకారునిగా !

ఆమెలోని విద్యార్థినిని ప్రేమించాడు గురువుగా !

ప్రకృతిలోని అందం మూర్తీభవించిన కన్య సరళ !

తాను గీసిన ఎన్నో బొమ్మల కాధారం సరళ !

తనకు తెలుసు తనలో భావ ప్రేరణకు సరళే ఆ మధ్య కాలంలో కారకురాలు. తనకు ఎన్నో ఊహాలు కలిగించి అనేక చిత్రాలు చిత్రించడానికి కారణం ఆమేనని ఆమెకు తెలియదు.... కానీ తనకది తెలుసు. ఆమెకు పెళ్లి నిశ్చయమైందని తెలిసినపుడు ఎంతో ఆనందించాడు; ఏదో తృప్తి ఫీలయ్యాడు.

పెళ్లికి రమ్మని శుభలేఖ యిచ్చిన సరళను మనస్ఫూర్తిగా ఆశీర్వదించాడు కూడా....

కానీ....

పెళ్లయిన నెల్లాళ్లకే మనసుపడి ఆమె చేసుకున్న బావను ఆమె కళ్లముందే దారుణంగా లారీ తొక్కిపోయిందని తెలుసుకున్న తనకు నోట మాటరాలేదు. నిశ్చేష్టుడయ్యాడు.

ఏం చెయ్యగల రెవరైనా ?

పరామర్శించడానికి వెళ్లాడు_పెళ్లికి వెళ్లకపోయినా....

అతని కేమీ అర్థంకాలేదు_

అంతా ఆశ్చర్యంగా ఉంది....తనను ఎన్నో చిత్రాలు గీయడానికి ప్రేరణ

విచ్చిన ముగ్ధ ఈమేనా? ఎక్కడికి పోయిందా సౌందర్యమంతా?

ఏమిటి జుత్తు విరబోసుకుని తెల్లని చీరలో నుదుట బొట్టులేక, చేతులు నిర్జీవంగా గలగలలు విన్పించే గాజులే లేక అసలు శోకానికే ప్రతిబింబంలా....

"సరళా" పూడుకుపోతున్న గొంతు పెగల్చాడు శివాజీ.

వాడిన పూవులా తలెత్తింది—చూడ లేకపోయాడు.

"పిలిచినప్పుడు మనోహరంగా నవ్వే ఆ కళ్ళేవి?"

కన్నీటి కడలిలా ఉన్నాయి ఆ విశాల నేత్రాలిపుడు.

"అయామ్ సో సారీ...."

వికృతంగా నవ్వింది.

తనింక అక్కడ ఉండలేకపోయాడు. తిరిగొచ్చాక ఓ వారం రోజులు నిద్రాహారాలు లేవు. ఒకటే టార్చర్? ఎలాగో తెలిసింది, 'ముండనం' తలపెట్టేలా ఉన్నారని. ఇక ఊరుకోలేక పోయాడు. తనే వెళ్ళి సరళ తల్లిదండ్రులతో తీవ్రంగా వాదించాడు. ఎన్నడూ ఇలా బయటపడని వ్యక్తి అంత గట్టిగా పట్టుబట్టేసరికి మిగతా లెక్చరర్లు కూడా శివాజీకి వత్తాసుపలికారు. శివాజీ నెగ్గాడు. 'ముండనం' ఆగిపోయింది గాని మిగతా తంతు నాపలేకపోయారెవరూ. అదే చాలుననుకుని తృప్తిపడ్డారందరూ.... శివాజీని మెచ్చుకున్నారు. కానీ శివాజీ బాధ మరింతగా పెరిగింది. అందానికే విధించిన శిక్ష యిది? ప్రకృతిసిద్ధ సౌందర్యానికి ఇంత దారుణమైన శిక్ష. అసలెలా విధించగలిగారు??? అందాన్ని చిత్రహింసలు పెట్టేందుకుపిశాచాలంతా? "ఛ; అసలీ సమాజానికి బుద్ధిలేదు," తీవ్రంగా అనుకున్నాడు.

"రుక్మిణీ నా బుర్రంతా పాడుచేశావు కదే ఇవాళ.... అసలా పాత ఉత్తరాలు చదవకుండా ఉండాల్సింది," అను కుంటూ స్నానానికి లేచాడు వళ్ళు విరుచు కుంటూ. కణతలు బలంగా నొక్కు కున్నాడు, బాధగా. ట్యూబ్ లైటు ఒక్కసారి ఆరి మళ్ళీ 'టప్‌టప్' మని వెలిగింది వెంటనే.

హీటర్‌తో నీళ్ళు కాసుకుని షాంపూ బాత్ కానిచ్చాడు. ఇంటికి తాళం వేసి భోజనానికి మెస్‌కి బయలుదేరాడు.

వండిపెట్టేవాళ్ళు లేరనే బాధ ఏనాడూ కలగలేదు. మెస్‌లకు బాగా అలవాటు పడిపోయాడు జీవితంలో. భోజనం కానిచ్చి యిల్లు చేరుకున్నాడు. దారిలో కొన్న కాన్వాస్ ఈజిల్‌కు తగిలించి చిత్రించసాగాడు. పేలట్ ఎడమచేతిలో పెట్టుకుని కుడిచేత కుంచెను కాన్వాసుపై నర్తింప సాగాడు. చకచకా నడవ సాగింది .. కాన్వాసు రంగులతో నిండి తడి ఆరక మెరుస్తుంది.... అక్కడ క్కడ మెరుగులు దిద్దాడు.... బొమ్మ

పూర్తయింది. పాలెట్‌లు, బ్రష్‌లు టేబిల్‌పై పడేసి నించున్నాడు శివాజీ.

పచ్చని గడపమీద కూర్చుని బారెడు జుట్టును చిక్కుతీసుకుంటున్న అతివ కాన్వాసు మీద ప్రత్యక్షమయింది.

ముఖాన మెరిసే కాంతివంతమైన ఎర్రని కుంకుమ తిలకం.... పాయలుగా జారిన జుట్టునుంచి అలవోకగా కన్పిస్తున్న చెవిపోగు....ముక్కున పగడపు పుడక ... ప్రేమ తొణికిసలాడే అరమోడ్చిన కళ్లు.... చిక్కని గాజులు నిండిన పొడవైన చేతులు.... తీర్చిదిద్దినట్టున్న అవయవ సౌందర్యంతో ఉన్న ఆ పడతిని తదేకంగా చూశాడు. తృప్తిగా నవ్వుకున్నాడు. కుంచె అందుకుని అందంగా వ్రాశాడు బొమ్మ క్రిందుగా "అమ్మ" అని.

ప్రేమగా చూసుకున్నాడు. నిండిన హృదయంతో పడకగదిలోకివెళ్లి లైట్ వేసి అలానే మంచంమీద వాలిపోయాడు....

గోడలనిండా అతనిచిత్రాలే.రకరకాల భంగిమల్లో పెయింటింగ్‌లు కనులపండువగా. అపేక్షగా చూసుకున్నాడుచుట్టూ.... అన్నీ అమ్మ బొమ్మల చిత్రాలే.. చెమ్మచెక్క ఆడుతూ, గొబ్బెమ్మల చుట్టూ తిరుగుతూ, పెరటిలో తానాలాడిస్తూ ఊయల ఊగుతూ సందెవెలుగులలో నీటి కడవలు మోస్తూ, ప్రియసమాగమానాయత్త చిత్తయై తలవాకిట ఎదురుతెన్నులుకాస్తూ

....ఇలాఎన్నో హాయిగా అనుకున్నాడు.

...."ఈ బొమ్మలు తన ప్రాణం. తనకు నచ్చిన రీతినే గీసుకున్నాడుతప్ప ఒకరికి లొంగిపోలేదెప్పుడూ. అవును ఇది తను సృష్టించుకున్న లోకం. ఈ చిన్న ప్రపంచంలో కళారాధనకే స్థానం. కళ అనంతం. అల్పమైన జీవితకాలంలో అనల్పమైన చిత్రీకరణలోని ఓ చిరుదివ్వెగా వెలిగితే చాలు...."

ఎదురుగా కన్పించే నిలువెత్తు చిత్రం వైపు తల తిప్పాడు.

గుండ్రని ముఖం; దీపశిఖవంటి చిరుతిలకంతో ఫాలం, అందంగా జారిన పాపిటబొట్టు,ఆకర్ణాంతమైన కనుబొమలు, తళతళమని చంచలంగా తిరిగే చేపల్లా అనిపించే పెద్ద గుండ్రని కళ్ళు, సంపంగిని తలపించే నాసిక, కెంపులు పొదిగిన అధరాలతో చిన్నగా వంపుతిరిగిన చుబుకం, నిబిడోన్నత వక్షస్థలిపై డోలలాడుతున్న హారం, లేదనిపించే సన్నని నడుము, మొగలిరేకులు మనోజ్ఞంగా అలరించిన పిరుదులు దాకే నీలవేణి, చివరగా జడకుచ్చులు, పాదాలవరకు అందంగా జాలువారిన కుచ్చిళ్లు, అలదిన పసుపు_పారాణి పాదాలకే వన్నె తేగా, ఎర్రని గాజులతోనిండిన తామరతూండ్ల వంటి చేతులలో దీపశిఖ నుంచుకుని నీలిరంగు చీరెలో నిండుగా, వయ్యారంగా స్వాగతిస్తున్న ప్రమద జీవకళ ఉట్టిపడుతున్నట్టుగా ఉంది....



ఈ చిత్రం తెనుగింటి ఆడపడుచుకు ప్రతీకగా తన సృష్టి; తాను చిత్రించిన ఓ 'మాస్టర్ పీస్'.

ఈ చిత్రానికి ప్రేరేపణ సరళ !

శివాజీ హృదయం బాధగా మూల్గింది.

అవును సరళను దృష్టిలో ఉంచుకునే తాను చిత్రించాడు.

ఆంధ్రుల ఆడపడుచుగా అందానికి మారుపేరుగా తన చిత్రంలో ఇప్పటికీ, ఎప్పటికీ- ఉంటుంది.

నిజానికామె జీవితం యిప్పుడు ఎండి వాడిన మోడు.

ప్రకృతి అందానికి విధించిన దారుణ శిక్ష యిది !

తానిది భరించలేకు. భర్తపోయినంత మాత్రాన ప్రకృతి ప్రసాదాన్ని తుడిచి వేయడానికి వాళ్లెవరు ? శివాజీకి కళ్లనీళ్లు తిరిగాయి గిర్రున.

బాధగా జుట్టు పీక్కున్నాడు...

ఏదో తెలియని కోపం, ఎవరిమీదో కూడా తెలియదు !

ఏమిటీ సంఘం విధించే ఆంక్షలు ??

మారుతున్న కాలంతోపాటు మారని ఈ న్యాయాలేమిటి ?

ఎంతవరకూ అవి అవసరమో ఆలోచించనక్కరలేదా ?

అందరూ బాధపడుతూనే ఎందుకు ఆంక్షలను, కట్టుబాట్లను అమలు జరపడం ?

ఈ కఠినత్వపు సంకెలలను ఛేదించే మార్గమే లేదా ?

ఏది ఏమైనా అందమైన జీవితాన్ని, ఓ అందాలరాశి సౌందర్యాన్ని కాల

రాయడం సహించలేకపోతున్నాడు. బూజు పట్టిన ఆచారాల్ని మాన్పించగలస్థాయిలో లేడు తాను. చెప్పినా వినరు.

అతనికంటే అతనిలోని చిత్రకారుని సున్నిత హృదయం పడే బాధ ఎక్కువగా ఉంది.

పెళ్ళికాకున్నా తాను ఏ బాధాలేకుండా సుఖంగానే ఉన్నాడు. కానీ కోరి పెళ్ళి చేసుకున్న ఆమెకీ కష్టాలేమిటి? తాను ఎంతగానో అభిమానించి, జీవితంలో స్వర్గసౌఖ్యాలతో సుఖపడాలని మనసారా కోరుకున్న వ్యక్తి జీవితం ఇలా అర్థాంతరంగా నాశనం కావడమేమిటి? ఇక ఆ అమ్మాయి జీవితాంతం తాను చేయని తప్పుకు కుళ్ళికుళ్ళి ఏడుస్తూ, చీకటి గదుల్లోనే మగ్గిపోతూ నిర్వచించలేని సంఘాన్ని లోలోన కసిగా తిట్టుకుంటూ తనను తానే నిందించుకుంటూ గడప వలసిందేనా?

కాకూడదు. అలా కాకూడదింకా. ఆ సౌందర్యరాశి జీవితంలో తిరిగి వెలుగులు నింపాలి.... సంతోషాన్ని తేవాలి. ఎలా? ఎలా? ఆమె నిత్యాలంకృతయై తనవంటి కళాపిపాసకులకు ప్రాణం పోస్తుండాలంటే ఎలా? ఎలా సాధ్యమది?

అతని మనసారోజెందుకో తీవ్రంగా ఆలోచించసాగింది. చుట్టూ ప్రపంచాన్నే మర్చిపోయి ఆలోచించసాగాడు. ఉన్నట్టుండి శివాజీ కనుబొమ ముడివడింది. విస్ఫారిత నేత్రాలను కళ్లకెదురుగా కనబడుతున్న ఆ మనోహరి నిలువెత్తు చిత్రంవైపు తిప్పాడు. తృప్తినిండిన చిరునవ్వు పెదాలపై వెలసింది పరిష్కార సూచకంగా.

తనదే ఈ సుందరి యికనుండీ.... దీపతోరణాలతో స్వాగతంపలికేది తనకే కాబోలు యినాళ్లనుండి.... ఆహ్వానాన్ని మన్నించాలి.... మన్నిస్తాడు కూడా. తానామెనుండి ఏమీ ఆశించడు.... తన కోరిక ఒక్కటే. తన చిత్రంలోని కన్యలా నిత్యం మంగళకరంగా ఆమె ఉండాలి. అవును.... తన కోరిక అదొక్కటే. ఆహ్వానిస్తూ చేతులు చాచాడు పడకపైనుంచే శివాజీ.

చిత్రంలోని ప్రమద వయ్యారంగా, కాలిమువ్వలు సరిగమలు మ్రోయగా, హంసలా నడుస్తూ, కుచ్చెళ్ల అలల్లా కదులుతుండగా తనవద్ద కొస్తున్నట్టు కన్పించింది శివాజీకి. తన వడలిన పెదాలకు కెమ్మోవి నాన్చి ముద్దాడింది. చేతులు బిగియారా చుట్టి కనులు మూసుకున్నాడు. నిట్టూర్పుగా ఊపిరి పీల్చాడు గుండెల నిండుగా. నిద్రలోకి జారిపోయాడు.... పెదవులమీద చిరునవ్వు మాత్రం చెదరలేదు రాత్రంతా.

* * *

మర్నాడు....

ఉషాత్పూర్వమే లేచి హుషారుగా తయారుకాసాగాడు శివాజీ....

కాస్సేపటికీ మంచుతెరలు చించుకుని ధవళకాంతులు వెదజిమ్ముతూ పైకొచ్చాడు సూర్యుడు.

---




**మురళి** వస్తున్నాడు.

కాన్పూరులో ఎం. టెక్. పూర్తిచేసి ఇంటికి వచ్చేస్తున్నాడు.

ఇన్నేళ్లూ చదువు వంకతో మురళిని వీలైనంత ఎక్కువ కాలం ఇంటికి దూరంగా ఉంచగలిగేను. ఇప్పుడింక ఏ మిషతోనూ మురళిని దూరంగా పంప లేను. మురళి ఇక్కడే ఉద్యోగంచూసు కొని స్థిరపడాలని రాధ కోరిక. ఇదివరకే మురళిని ఒప్పించి వాగ్దానం చేయించు కుంది. చిత్రమేమిటంటే మురళి దూరంగా ఉన్నప్పుడు చూడాలని తహ తహ లాడేవాడిని. ఇంటికి వస్తే ఎప్పుడు వెళ్ళిపోతాడా అని ఎదురుచూసేవాడిని. ఏమిటో నిలకడలేని మనస్సు! అందుకే అంటారు మనస్సు కోతిలాంటిదని!

నిజానికి ఒక్కగా నొక్క కొడుకు వృద్ధాప్యంలో కళ్ల కెదురుగా ఉండాలని ఎవరైనా కోరుకుంటారు. కాని నేను మురళిని రోజూ చూస్తూ వ్యథ భరించ లేను. అందుకే ఉత్తరం వచ్చినప్పటి నించి నాకు చాలా అశాంతిగా ఆందోళ నగా ఉంది.

నేనిలాగ జీవితాంతం అశాంతితో కుమిలిపోవలసిందేనా! ఏ అద్భుతమో జరిగి నాకు మనశ్శాంతి కలిగితే ఎంత బాగుండును!

* * *

అడ్వోకేటుగా ప్రాక్టీసుపెట్టిన కొద్ది కాలానికే పుష్కలంగా డబ్బును, పేరును ఆర్జించసాగేను. బి.ఎ. ప్యాస యిన అందమైన రాధను ఏరి కోరి పెళ్లి చేసుకున్నాను. ప్రతి వేసవిలో ఊళ్లకు వెళ్తూ ఎంతో హాయిగా ఉండేవాళ్లం. ఐదేళ్లు ఐదు క్షణాలలాగా గడిచి పోయాయి. ఇంట్లో ఉయ్యాలవేసే అవ




ఒప్పించి వచ్చింది. ఇప్పటినించే పెంచుకుంటే మీరే తల్లిదండ్రులు అనుకొని అభిమానంగా ఉంటాడు. మూడో నెల రాగానే దత్తతచేసుకొని దానికేమైనా ఇవ్వండి. పిచ్చిపిల్ల సంతోషిస్తుంది. కన్నబిడ్డను త్యాగం చెయ్యడమంటే మాటలుకాదు. ఏమిచ్చినా ఋణం తీరదు," మా అత్తగారి వాక్ప్రవాహం ఆగింది. నాకు భగ్గుమంది.

"తీర్చలేని ఋణాలు మా కొద్దులెండి," అనేసి విసురుగా బయటకు నడిచాను. మనస్సు చికాకుగా అయిపోయింది. నా డబ్బుచూసి, నే నడగకుండానే ఎవరికి వారే పెంపకాని కిస్తామంటూ పోటీపడుతున్నారు. పెంపకానికి తీసుకుంటే తామేదో గొప్ప త్యాగంచేసి మాకు పున్నామనరకం తప్పించి ఉద్ధరించినట్లు పోజుపెట్టి డబ్బు గుంజటానికి చూస్తారు.

నా తోబుట్టువు బిడ్డను తెచ్చుకుంటే రాధ పుట్టింటివారి కందరికీ కోపాలొస్తాయి. రాధతరపు పిల్లవాడిని తెచ్చుకుంటే నా వాళ్లందరూ కినుకవహిస్తారు. ఇద్దర్నీ కాదని ఏ అనాధపాపనో తెచ్చు

కుంటే అంధరూ కత్తిగడతారు. అందుకే కనీసం కొన్నేళ్ళవరకైనా దత్తత ప్రసక్తి పెట్టుకోకూడదని నిశ్చయించుకున్నాను.

* * *

చల్లని వెన్నెల్లో తెల్లని పక్కమీద పడుకున్న నేను హఠాత్తుగా ఏదో అనుమానం రాగానే మనస్సులోనే ఉలిక్కిపడ్డాను. తెల్లవారేసరికి ఆ అనుమానమే పెనుభూతమై నన్ను డాక్టరు శ్రీహరిరావుగారి దగ్గిరకి పరుగులెట్టించింది.

శ్రీహరిరావుగారితో నాకు స్నేహం ఉంది. ఆయన నిదానంగా అన్ని పరీక్షలు చేసి చెప్పిన కఠోరసత్యం నాలో అంతవరకు ఉన్న ఆశను కూలద్రోసి క్రుంగదీసింది.

"కృష్ణగారూ! బాధపడకండి. మీ భార్యనుకూడ తీసుకొని రండి. మీ సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నిస్తాను," అన్నారు శ్రీహరిరావుగారు.

* * *

"ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్‌ద్వారా మీరు సంతానాన్ని పొందవచ్చు కృష్ణగారూ! ఇందువలన బంధువులతో విరోధం వచ్చే ప్రమాదం ఉండదు. మీకూ స్వంతంగా బిడ్డను కని పెంచిన అనుభూతి కలుగుతుంది." శ్రీహరిరావుగారన్నారు.

నేను అప్రయత్నంగా రాధవంక చూశాను. ఆమెకళ్లు ఒప్పుకోమని ఆశగా అభ్యర్థిస్తున్నాయి. బిడ్డకోసం రాధపడే ఆరాటాన్ని కాదనగల శక్తి నాకు లేదు. భగవాన్! నా కేమిటీ దంపపుకోత!

శ్రీహరిరావుగారు కుర్చీలోంచి లేచి నావైపువచ్చి స్నేహపూర్వకంగా భుజం తట్టారు.

"ఆలోచించండి కృష్ణగారూ! ఈ విషయం పైవారికి తెలియగల అవకాశం లేకుండా అన్ని ఏర్పాట్లు చేస్తాను. మీరు సమాధాన పడగలిగితే ఇది చాల మంచి పద్ధతి," అన్నారు

"మళ్లీ కలుస్తాను," అని చెప్పేసి రాధను తీసుకొని బైటకు నడిచాను.

మౌనంగా కారు నడుపుతున్నాను.

"ఏమండీ!" నేను రాధవైపు చూశాను.

"నేను నోరువిప్పి అడగకుండానే ఎన్నో కోరికలు తీర్చేరు. మొదటిసారిగా కోరుకుంటున్న నా కోరికను తీర్చరూ! నన్ను అమ్మను చెయ్యరూ!"

"అయ్యో రాధా! నిన్ను అమ్మను చేసేది నేను కాదు. అజ్ఞాత వ్యక్తి ఎవరో!" అంటూ నా మనస్సు ఆక్రోసించింది.

"నన్ను ఆలోచించుకోనియ్యి రాధా! తొందరపెట్టకు," అన్నాను డ్రైవింగు మీద దృష్టిని కేంద్రీకరిస్తూ. రాధ మరి మాట్లాడలేదు.

నా రక్తం పంచుకోని బిడ్డ రాధ గర్భంలో పెరుగుతుందంటే నా కేమిటో

లాగా ఉంది. అలాగని రాధ కోరికను కాదనలేను. ఆలోచనలతో సతమత మౌతూ రెండు రోజులు మౌనంగా గడిపివేశాను.

ఆ రోజు నేను కోర్టుకు వెళ్లడానికి తయారవుతూంటే రాధ గదిలోకి వచ్చింది.

"కోరరాని కోరిక కోరి మిమ్మల్ని నొప్పించేను. నన్ను క్షమించండి. మీరు ముభావంగా ఉంటే నేను భరించ లేను. మామూలుగా మాట్లాడండి," అంది. ఆమె గొంతు దుఃఖాన్ని అణచు కుంటున్నట్లుంది. నాకు జాలివేసింది. అప్రయత్నంగా రాధను దగ్గరకు తీసుకున్నాను.

"నీది ప్రకృతి సహజమైన కోరిక రాధా! కోరరానిది కాదు. రేపే శ్రీహరి రావుగారి దగ్గరకి వెళ్దాం," అన్నాను కన్నీళ్లు తుడుస్తూ. రాధ ముఖం వెలిగి పోయింది.

* * *

రాధ గర్భవతి అయిందని తెలిసి మా అమ్మ, అత్తగారు హడావిడిగా వచ్చారు. సీమంతం, పువ్వుల ముడుపు చేస్తామంటే వద్దని రాధ వారించింది. అయినా వాళ్లు "ఎప్పటి వేడుక అప్పుడు జరగాలి," అంటూ ఒక మంచిరోజున రాధకు తలంటుపోసి పువ్వులజడ కుట్టి క్రొత్త పట్టుచీర కట్టబెట్టి చేతులనిండుగా రంగురంగుల గాజులు తొడిగి ముచ్చట తీర్చుకున్నారు. రాధ ఎంత అందంగానో కనబడేది.

పరాయి మగవాడి నీడకూడా సోకని మహా ఇల్లాలు రాధ! కాని ఆమె గర్భంలో పెరిగే బిడ్డ నాది కాదన్న చేదునిజం రాధను దగ్గిరకు తీసుకోవా లన్న నా ఆరాటాన్ని ఎప్పటికప్పుడు అణచివేస్తూ ఉండేది.

* * *

శ్రీహరిరావుగారి హాస్పిటల్‌లో రాధ బాబును ప్రసవించింది. ఆయన స్వయంగా ఫోన్‌లో కబురు చెప్పగానే నేను వెళ్లి రాధను, బాబును చూశాను. బాబు ముద్దుగా అందంగా ఉన్నాడు. అలసటతోపాటు రాధ కళ్లలో సంతృప్తి కొట్టవచ్చినట్లు కనబడింది.

బాబుకు 'మురళి' అని పేరు పెట్టింది రాధ. వాడి సంరక్షణలో, ముద్దు ముచ్చట్లలో పడిపోయిన రాధ నా గురించి పట్టించుకోవడం బాగా తగ్గించింది. ఎంత పని ఒత్తిడిఉన్నా నా అవసరాలన్నీ నేనే చూసుకోవలసి రావటం చాలా చికాకుగా ఉండేది.

"లోకంలో నువ్వొక్కర్తివే తల్లి వైనట్లు ఎందుకంత ఆర్భాటం రాధా? నా అవసరాలు గమనించవలసిన బాధ్యత లేదా?" అని కేకలు వేసేవాడిని.

"వస్తున్నానండీ," అంటూ పరుగులు పెడుతూ వచ్చి రాధ అవీ ఇవీ అందిస్తూ

ఉంటే, 'అయ్యో ! తొందరపడి రాధను నొప్పించానే' అని బాధ కలిగేది.

నేనుకూడా మురళిని చేరదీసి ముద్దు చేస్తూఉంటే రాధ నిర్లక్ష్యాన్ని పట్టించు కొనేవాడిని కానేమో ! కాళ్లూ, చేతులూ ఆడిస్తూ బోసినవ్వులు కురిపించే మురళిని ముద్దులాడాలని ఉయ్యాల దగ్గరకు వెళ్లే సరికి మురళిని స్పృశించడానికి చేతులు సమ్మెచేసేవి.

* * *

మురళిని స్కూల్లో చేర్చేము. వయ స్సుకి మించిన తెలివితేటలున్న మురళి టీచర్ల అభిమానానికి పాత్రుడయ్యాడు.

ఒకరోజు మురళికి యూనిఫారం వేసి క్రాపు దువ్వుతూంది రాధ.

"అమ్మా ! నాన్నగారు నాతో ఎందుకు మాట్లాడరమ్మా ?" మురళి ప్రశ్నకు రాధ ఏం జవాబు చెబుతుందోనని నేను చెవులు రిక్కించేను.

"నాన్నగారి కెక్కువ పని ఉంటుంది మురళీ ! అందుకే నాన్నగారికి మాట్లాడ టానికి టైము ఉండదు," అంది రాధ.

"మరి పక్కింటి శ్రీకాంత్‌వాళ్ల నాన్నగారికీ పని ఉంటుంది కదా ! ఎప్పుడూ శ్రీకాంత్‌తో నవ్వుతూమాట్లాడ తారట ." రాధ మురళి సందేహం తీర్చకుండానే, "త్వరగా జోళ్లు వేసుకో, బస్సు వచ్చేస్తుంది," అని తొందర పెట్టింది.

* * *

రాత్రి భోజనాలయేక నేను గదిలో కూర్చొని పుస్తకం చదువుకుంటున్నాను.

"ఏమండీ !" చాలా రోజుల తరువాత రాధ వచ్చి మంచంమీద కూర్చుంది.

"ఏమిటి రాధా !" అన్నాను పుస్తకం మూసి.

"మురళిని అనాధబిడ్డగా భావించి జాలిపడి అయినా ప్రేమించలేరా ?" అంది గద్గద స్వరంతో.

"ఎందుకలా నిష్ఠురంగా మాట్లాడతావు రాధా ? నేను మురళికేం లోటుచేశాను?"

"ఏంలోటు చేస్తున్నారో మీమనస్సుకు తెలుసు. కలవారింట్లో పుట్టేడు కనుక భోగభాగ్యాలు అనుభవిస్తున్నాడు. కాని తండ్రి ప్రేమకు నోచుకోని నిర్భాగ్యు డండీ వాడు. వాడికి జ్ఞానం వస్తూంది. మీరు తనను ప్రేమించడంలేదనే అను మానం వస్తే వాడి మనస్సు గాయపడు తుంది. ఆ బాధతో వాడు నాకు దూర మౌతాడేమోనని నా భయం," రాధ దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడవసాగింది.

"నా మనస్సును సమాధాన పర్చుకోవ టానికి ప్రయత్నిస్తూనే ఉన్నాను రాధా ! కనీసం మురళికి అనుమానం రాకుండా ప్రయత్నిస్తాను. సరేనా ! ఊరుకో !" అంటూ రాధను ఊరడించాను కన్నీళ్లు తుడుస్తూ. రాధ నా భుజంమీద తల వాల్చి చాలాసేపు ఉండిపోయింది.

* * *



మురళిని అప్పుడప్పుడు పలకరించి స్కూలు విశేషాలు అడుగుతూ ఉండేవాడిని. మురళి బెదురుగా, ముక్తసరిగా జవాబు లిచ్చి వెళ్లిపోయేవాడు. మా మధ్య దూరం పెరిగిందే తప్ప తరగ లేదు. వయస్సుతో శరీరమూ, ఆలోచనలతో, వ్యధతో మనస్సూ బలహీనమై పోయాయేమో తరచుగా చిరాకుతో కేకలుపెడుతూ ఉండేవాడిని. మురళి ఉనికిని సహించలే ననిపించేది. అందుకే వాడిని బోర్డింగు స్కూల్లో చేర్చడానికి నిశ్చయించేను. మురళి సంతోషంగా ఒప్పుకున్నాడు. రాధ మాత్రం ఇష్టపడ లేదు. చివరకు నెలకొకసారి తీసుకొని వస్తానన్న హామీ మీద అయిష్టంగానే ఒప్పుకుంది. మురళి ఋషీవేలీ స్కూల్లో చేరాడు. తీరా మురళిని దిగబెట్టి వచ్చాక ఇల్లంతా చిన్నబోయినట్లనిపించింది. నెలరోజులవగానే రాధ ప్రయణానికన్నీ సిద్ధంచేసింది. ఇద్దరం కారులో వెళ్లాము. మురళిని దగ్గరకు తీసుకొని ఎన్నెన్నో అడగాలని, కబుర్లు చెప్పాలని అనుకుంటూ వెళ్లిన నేను మురళి కనబడగానే నాకు తెలియకుండానే బిగుసుకుపోయాను. తల్లీకొడుకులు కబుర్లు చెప్పుకుంటూ ఉంటే మౌనంగా చూస్తూ ఉండి

పోయాను. ఆ వాతావరణానికి అలవాటు పడిన మురళి ఎంతో చలాకీగా కనిపించాడు.

మురళి రెసిడెన్షియల్ జూనియర్ కాలేజీలోనే ఇంటరు ముగించాడు. జాయింటు ఎంట్రెన్స్ పరీక్షలో నెగ్గి ఖర్గ్‌పూరు ఐ. ఐ. టి లో చేరాడు. పెద్దవాడైనా రాధ దగ్గిర పసివాడిలాగే ప్రవర్తించే వాడు. తల్లి వెనకాలే తిరుగుతూ ఖర్గ్‌పూరు విశేషాలు, కాలేజీ చదువు, ఫ్రెండ్సు గురించి, ఇంకా ఎన్నెన్నో చెప్తూ ఉండేవాడు. వాళ్ల కబుర్లకు అంతుండేది కాదు. వాళ్ల సంభాషణలో పాల్గొనాలని, వాళ్లతో కలిసి మనసారా నవ్వాలని, మురళిని, 'నా బాబూ' అంటూ దగ్గిరకు తీసుకొని ఇన్నేళ్ల వ్యధనుండి విముక్తి పొందాలని మనస్సు ఆరాటపడేది. కాని చేతులు, నోరు సమ్మె చేసేవి. గదిగుమ్మం వరకు వెళ్లిన వాడిని మౌనంగా వెనక్కి వెళ్లిపోవలసి వచ్చేది. మురళి కాన్పూరులో ఎం.టెక్. కూడ పూర్తిచేశాడు.

* * *

"ఏమండీ! ట్రెయిన్ వచ్చే టైమవుతూంది. మీరింకా బయలుదేరలేదేం!" అంది రాధ హడావిడిగా వచ్చి.

"స్టేషనుకు వెళ్లకపోతే ఏం రాధా! మురళి పైవాడు, ఇంటికి ఊరికి కొత్తవాడు కాదుకదా! రాలేడా!"

"అబ్బ అదేం కాదండీ! స్టేషనుకు ఎవ్వరం వెళ్లకపోతే చిన్నబుచ్చుకుంటాడు. నాకు పనులు తెమలలేదు. మీరైనా వెళ్లకపోతే మన ఆరోగ్యాలు బాగా లేవేమోనని కంగారుపడిపోతాడు. వెళ్లరూ!" అంది ప్రాధేయపడుతున్నట్లు. రాధ మాటను నే నేనాడు కాదనగలిగాను!

డ్రైవరు ఆ రోజు సెలవు పెట్టడంతో నేనే కారు తీసుకొని బయలుదేరాను. క్షణక్షణానికీ నాలో దిగులు కొండలాగా పెరిగిపోతూంది. మురళి నింక రోజూ చూస్తూ నేను నరకయాతన పడవలసిందే! భగవాన్! ఇన్నేళ్లయినా నేనెందుకు సమాధాన పడలేకపోతున్నాను! నేనేం పాపంచేసేనని నాకీ రంపపుకోత! నాలో నేను కుములుతూ పరాగ్గా కారు నడుపుతున్నాను. సికింద్రాబాద్ స్టేషను సమీపంలో నా కారు లారీని ఢీకొట్టడమే నాకు తెలుసు.

* * *

కళ్లు తెరిచేసరికి ఒళ్లు, తల భారంగా ఉన్నట్లు తోచింది. అతి కష్టంమీద కళ్లు పూర్తిగా తెరిచి అది హాస్పిటల్ అని తెలుసుకున్నాను. ప్రక్కనే ఉన్న స్టూలుమీద పీక్కుపోయిన ముఖంతో రాధ కూర్చుని ఉంది.

"నాకేమైంది రాధా?" నీరసంగా అడిగేను. రాధ లేచి దగ్గిరకు వచ్చింది.

"ఏంకాలేదు. మీరు రెస్టు తీసుకోండి. తరువాత మాట్లాడదాం," అంది నా

చెయ్యి మృదువుగా నిమురుతూ. నేను క్రమంగా నిద్రలోకి జారుకున్నాను.

*    *    *

నాకు బాగా తెలివివచ్చి నీరసం చాలా వరకు తగ్గేక రాధ చెప్పింది. లారీకి కారు గుద్దుకొన్నప్పుడు నా తలకు దెబ్బ తగిలిందని, ట్రెయినులోంచి అప్పుడే దిగిన మురళీ ఏక్సిడెంటు జరిగిన స్థలానికి వచ్చి కారును, నన్ను గుర్తించి వెంటనే హాస్పిటల్‌లో చేర్చాడనీ! అంత వరకు మామూలుగా వింటూన్న నేను రాధ చెప్పిన తరువాత విషయం విని ఉలిక్కిపడ్డాను.

"మురళీ మీకు రక్తం ఇచ్చాడండీ! బ్లడ్ బ్యాంకులో మీ గ్రూపుకి సప్పిన రక్తంలేక డాక్టర్లు కంగారుపడుతుంటే మురళీ రక్తమిచ్చాడు. అదృష్టవశాత్తూ గ్రూపు సప్పింది."

నేను మౌనంతోనే ప్రదర్శించిన నిరాదరణను, విముఖతను అర్థంచేసుకోలేని అమాయకుడు కాదు మురళీ! అయినా నాకు రక్త మిచ్చాడంటే మురళీ దెంత మంచి మనస్సు! మురళీ రక్తంలోని మంచితనం నా రక్తంలో కలిసిపోయి నా మనస్సును కదల్చివేసింది. మురళీని చూసి ఎన్నో యుగాలు అయినట్లుంది. ఇక మీదట మురళీని చూడకుండా ఒక్క క్షణంకూడా బ్రతకలేనని పిస్తూంది.

"మురళీ కనబడటం లేదేం రాధా?" అని అడిగేను.

"మురళీ ఫ్రెండు పెళ్లికని బొంబాయి వెళ్లాడు," అంది.

రాధ నాలోని మార్పుని గుర్తించినట్లు సంబరపడతూ, "నాలుగైదు రోజుల్లో వచ్చేస్తాడు" అంది.

*    *    *

మురళీని చూడాలన్న ఆరాటంవల్లనో, మనస్సులోని వ్యథ పూర్తిగా దూరమైపోవడంవల్లనో నేను అనుకున్నదానికంటె చాలా త్వరగా కోలుకొని డిస్చార్జి అయి ఇంటికి వచ్చేశాను. మురళీ రాకకోసం క్షణమొక యుగంగా ఎదురు చూస్తున్నాము.

ఆ రోజు మధ్యాహ్నం మూడు గంటలప్పుడు డైనింగురూంలో నేను, రాధ కాఫీ త్రాగుతున్నాము. పనికుర్రాడు ఒక కవరు తెచ్చి రాధ చేతికిచ్చాడు. కప్పు ప్రక్కనపెట్టి ఉత్తరం తీసి విప్పి చదువుతున్న రాధ అలాగే టేబిలుమీదకు ఒరిగిపోయింది. నేను కంగారుగా లేచి కుదుపుతూ, 'రాధా, రాధా?' అని పిలిచాను. పలకలేదు. వంటామె సహాయంతో రాధను బెడ్‌మీదకు చేర్చి ముఖంమీద నీళ్లు చిలకరించాను. రాధకు తెలివి వచ్చేలోపల మా ఫ్యామిలీ డాక్టరుగారికి ఫోన్ చేశాను. కొంతసేపటికి స్పృహలోకి వచ్చిన రాధ వెక్కివెక్కి ఏడవసాగింది. ఇంతలో డాక్టరుగారు వచ్చి ఇంజక్షను

ఇచ్చారు. దాని ప్రభావంతో రాధకు బాగా నిద్రపడుతుందని, లేచేసరికి మనస్సుకు ప్రశాంతత కలుగుతుందని చెప్పి వెళ్లారు. రాధ నిద్రపోయాక నాకు ఉత్తరం సంగతి గుర్తుకువచ్చింది. గబగబా వెళ్లి డైనింగు టేబిలుమీద పడివున్న ఉత్తరాన్ని తీసి చదవసాగేను. అది మురళి తల్లికి వ్రాసేడు.

'అమ్మా!

నాకోసం ఎదురుచూస్తూ ఉంటావు. కాని నేను రానమ్మా! నీతో తొందరగా వస్తానని చెప్పినందుకు నన్ను క్షమించు. నేను త్వరలోనే అమెరికా వెళ్లిపోతున్నాను. నాన్నగారు నా కెన్నో భోగభాగ్యాలిచ్చి నన్నింతవాడిని చేసినా నన్ను ఏనాడూ ప్రేమగా చేరదీయలేదనే కొరత ఎప్పుడూ వేధించేదమ్మా! కారణం కోసం ఏళ్లతరబడి నేను సాగిస్తూ వచ్చిన అన్వేషణ ఏడాది క్రితమే ఫలించింది. నేను సహజంగా పుట్టలేదని, ఎంతగానో అభివృద్ధిచెందిన విజ్ఞాన శాస్త్రాన్ని ఉపయోగించి నన్నీలోకం లోకి తెచ్చారని, తన రక్తం పంచుకొని పుట్టలేదన్న బాధ నాన్నగారిని చిత్రహింసకు గురిచేస్తూ ఉందని, సమాధాన పడలేకపోవడంవల్లనే నన్ను దూరంగా ఉంచారని తెలుసుకున్నాను. ఎంతో మంచి మనస్సుతో నా పుట్టుకకు దోహదంచేసిన నాన్నగారు ఆ మంచితనంతోనే నన్ను ప్రేమించివుంటే నే నెప్పటికీ మీకు దూరం అయిఉండేవాడిని కాను. కాని తండ్రి ప్రేమకు నోచుకోని విర్భాగ్యుడివి నేను. ఏక్సిడెంటులో గాయపడి ప్రమాదంలో ఉన్నప్పుడు ఒక్క క్షణం నా కనిపించింది— ఏనాడూ నన్ను అక్కున చేర్చుకోని వ్యక్తికోనం రక్తమెందుకు ధారపొయ్యాలని! కాని మరుక్షణం నాలో వివేకం మేల్కొంది. ఎంతో చిత్రహింస అనుభవిస్తున్నా నన్నింతవాడిని చేసిన వ్యక్తికి కృతజ్ఞత చూపాలని అది నా ధర్మమని గుర్తించాను. మొదట క్రూరంగా ఆలోచించినందుకు సిగ్గు, పశ్చాత్తాపం కలిగాయి. రక్తం ఇచ్చాక నా మనస్సు శాంతించింది. అమ్మా! నాన్నగారికింక భయంలేదు. కాని నే నింక నాన్నగారి ఎదురుగా ఉండి ఆయన్ని రంపపుకోతకు గురిచేయలేను. అందుకే దూరంగా వెళ్తున్నాను. నా గురించి బెంగపెట్టుకొని ఆరోగ్యం పాడుచేసుకోవద్దు అమ్మా! జీవితాల్లో ఎన్నో విచిత్ర సంఘటనలు జరుగుతూ ఉంటాయి కదమ్మా! అలాంటిదేదైనా జరిగి మనం కలుసుకుంటామేమో! నన్ను క్షమించమ్మా! దీవించమ్మా! నీ మురళి.' ఉత్తరం చదవగానే మనస్సు అయోమయం అయిపోయింది. మురళి బొంబాయిలో ఎక్కడుంటున్నాడో ఎప్పుడు వెళ్తున్నాడో తెలియకపోయినా వెంటనే బొంబాయికి విమానంలో రెండు టిక్కెట్లు బుక్ చేయించేశాను. మురళి గదిలోకి వెళ్లి

అలమార్లు, పుస్తకాలు, పెట్టెలు అన్నీ గాలించగా మురళీ బయలుదేరే తేదీవున్న కాగితం దొరికింది. మురళీ రెండు రోజుల్లో వెళ్ళిపోతాడు.

రాధకు తెలివివచ్చాక హార్లిక్సు త్రాగించాను. "మనం రేపే బయదేరి బొంబాయి వెళ్ళి మురళీని కలుసుకుందాం" అని చెప్పేను. రాధ కళ్ళలోకి వెలుగు వచ్చింది.

* * *

ఎయిర్‌పోర్టులో ఆత్రతగా మురళీ కోసం కళ్ళతో గాలిస్తున్న నేను మురళీ కనబడగానే పరిసరాలు మర్చిపోయి ఒక్క కేక పెట్టాను. మురళీ ఆశ్చర్యంతో దగ్గిరకు వచ్చి జాపిన నా చేతుల్లో వాలిపోయి, 'నాన్నా' అంటూ నన్ను చుట్టేశాడు. మురళీ రక్తం పంచుకొని పునర్జన్మ ఎత్తిన నేను తొలిసారిగా పుత్ర పరిష్వంగంలోని తియ్యదనాన్ని అనుభవించాను. మురళీ పిలుపు నాలోని ప్రతి అణువును పులకరింపజేసింది.

"మురళీ! నా కిప్పుడు కావలసింది నీ కృతజ్ఞత కాదు. నీ ప్రేమ కావాలి మురళీ! నిన్ను విడిచిపెట్టి నేను, అమ్మ బ్రతకలేం. నువ్వు మాతోనే ఉండు మురళీ!" అన్నాను, పూడుకుపోతున్న గొంతుతో. మురళీ కళ్ళు తుడుచుకున్నాడు. హఠాత్పంఘటనవల్ల కలిగిన ఆవేశాన్ని అదుపులో పెట్టుకున్నాడు.

"నాన్నగారూ! ఇది నేను ఎన్నో వ్యయప్రయాసలుపడి సంపాదించుకొన్న అవకాశం. దీన్ని వదులుకోలేను. మూడేళ్ళు పూర్తవగానే వచ్చేసి ఇక మీ దగ్గిరే ఉండిపోతాను. నన్ను నమ్మండి," అన్నాడు. అప్పటివరకూ మౌనంగా, నిండుగా మమ్మల్ని చూస్తూ ఉండిపోయిన రాధ మురళీని దగ్గిరకు తీసుకొని, ఎన్నో జాగ్రత్తలు చెప్పి ఉత్తరాలు తరుచుగా వ్రాయమని చెప్పింది. మురళీ వదల్లేక వదల్లేక వీడ్కోలు తీసుకొని విమానమెక్కాడు. మురళీ రాకకోసం మా నిరీక్షణ ఆ క్షణం నించే ప్రారంభమైంది.



# కెప్టెన్ కథ (సీరియల్)

తవఁయగోరలా ఏ తుడుంటే, నానిలా పామ్మీద ఇష్టమూర్తిలా తొంగోడం ఏం బాగోనేదండి. "కా నేటి చేస్తానండి? వొళ్ల వాశం లేనప్పుడు" కంపెనీ కామాక్షి హేష్డుబాబుతో అన్నట్టు.

"నానేటీ దాచనండి మరి. తవఁరుగోరు యినాలేగాని అంతా జెప్పేస్తానండి.... ఏటి తల్లీ! సరిగ్గా యీ టయాముకే రావాలా? కన్నెరికానికి కరీం సాయిబు తగులుకున్నాడని ... యింకా కత ఆరథించనే నేదు అప్పుడే తగులుకున్నావ్! తగులుకుంటే తగులుకున్నావ్ గాని—నా నోటడుగుతాను సెప్తావా? నీ సేతిలోదేటి? ఇనీమావా? ఇండీషనా? అంతున్నాది! ఏదోటి - వేగి పొడసీ. అవతల నా కత కోసరం ఆ బాబులు కాసుకూర్కుని కున్నారు.

అబ్బ నా తల్లే! కసరత్తు జేసినోడ్ని కాబట్టి యీ ఇండీషనుకి తట్టుకున్నాను. గాని ఇదే మరోడైతేనా? అడు సచ్చన్నా పోతాడు, నేకపోతే నిన్ను సంపేనన్నా సంపేస్తాడు.

ఈ యమ్మ యెప్పుడూ యింతే బాబూ. చెనానికో యిండీషను-చిటానికో మాత్తర తెస్తాది. ఇంతకీ తల్లీ యీ యిండీషను నాకా పకోడికా? యీ పాలి సూసుకు మరీ యియ్యమ్మా. నాను సచ్చినా పరవానేదు కాని ఆ బాబు సస్తే ఏడ్డానికి ఒక పెళ్లాం యిద్దరు ముండలూ ఉన్నట్టున్నారు.

ఎళ్లు తల్లీ ఎళ్లు.... మరింక ఇప్పుడప్పుడే రాక.... నాను సావన్లే— 'పాపీ సిరంజీవ'ని 'లా పాయింటు' మనపక్క ఉందిలే.

అమ్మయ్య! మొత్తాని కెలాగైతేనేం ఎల్లింది బాబూ. యిప్పుడు సెప్పండి. తవఁరుగోరికి ఏటి కావాలో? .... ఏటీ?....నా కతంటారా? అబ్బో అదో పెద్ద యిష్టరీ బాబు. నాపేరేటా? యెంత బతుకెంత కొచ్చినాదీ?

నా పేరు నా నోటితోటే సెప్పాల్సిన గతి పట్టినాది. యింతకీ బతికున్నప్పుడున్నది పేరు కాదు బాబూ సచ్చినాక మిగుల్తాదే ... అదిగో.... అదీ అసలు పేరు.

ముందపేడు వొరకూ మన పేరు సెప్తే సింహాలు కూడా నీళ్లు ముట్టేయి కావు.

ఇదిగో.... యీ జబ్బ జూసినారా? తవఁరిగోరి తొడంతున్నాది-అల్లప్పుడో పాలి....సావుకారింట్లో సోరీ కేసులో పట్టుకున్నప్పుడు, కనకయ్య హేడ్డు

బీనాదేవి



యిదిగో.... యీ జబ్బమీదే గుద్దినాడు -గుద్దినాడు-అంతే... కుడిసెయ్యివి-మూడు ఏళ్ల యిరిగిపోయి-మూణ్నెల్లు "మెడకల్లీవు" ఎట్టేసినాడు.

కనకయ్యగోడికి మంచి పనే అయ్యిందన్నాడు. ఎవుడూ?....సర్కిల్ బాబు.... అడ్ని కొడ్తే లాఠీలే ఇరిగిపోతాయి. సేత్తో కొడితే ఏటౌద్ది అని కూడా అన్నాడండి. ఇంతకీ తమరు గోరు నా పేరు గదండీ అడిగినారు. మన అసలు పేరు.... కొండండి. సిసలు పేరు కెప్టెనండి. తమరిగార్లాటోళ్లు కెప్టెనుగోడంటారండి .... ఆ పేరెందు కొచ్చిందో మరోసారి మనవిచేసుకుంటానండి!

కత ఎక్కడ మొదలెట్టడవోఁ తెలకుండా ఉంది బాబూ. ఎటీ! కత రాంపురంలో మొదలెట్టమంటారా? సిన్నప్పటి స్టోరీ కూడా కావాలంటారా? తమరు గోరి....ఇష్టవేఁ....

పేరుకే రాంపురం బాబూ. రాములోళ్లేరు.... సరికదా ఇబీషణులన్నాలేరు బాబు. సీతమ్మ తల్లెవర్తన్నా ఉంటే.... మన కంట బడ్నేదంతే... మూడొంతుల మంది రావణాసురుళ్లే బాబు. మిగిల్నోళ్లు మారీచ సుబాహులు....

మనకీ రాంపురాల్తోనూ, లచ్చింపురాల్తోనూ పన్లేదు బాబూ. మన్దసలు.... పట్నం బాబూ. కొత్తపేట వెయిసు గేంగుకి మనవేఁ లీడర్లవిఁ....

మనూరికి ఏ కార్నివాలు....వొచ్చినా మున్సిపాలిటి లైసెన్సు కన్నా ముందర

మన లైసెన్సు పుచ్చుకోవాల్సిందే.... బాబు.

ఎవుడు గేబ్లింగు డెన్ను యెట్టినా- ఏ ముండ డిపో యెట్టినా....మన పెర్మిషన్ పుచ్చుగోవలిసిందే నండి.

మనం ఆరు సుట్లు జైలు కెళ్లినాం. అదుగురి కాళ్లూ ముగ్గురి సేతులూ ఇరిసేసినాం.... ఉట్టినే కాదు బాబు మనకి అడ్డొస్తేనే....

మనకో ఫిలాసఫీ ఉందండి. ఏటో జెప్పనా?

మనం పుల్ని కూడా ఏఁవీఁ అనం....

అడ్డొస్తే మేకనైనా మెళ్లిరిసేస్తాం.

"ఆడూసు కెళ్లకండొరే....ఆడసలే మంచోడు గాడు" అనీసేవోరు డీయస్పీ బాబులు కూడా మన గురించి. మనం సెయిర్మన్‌కి నిలబళ్లేదు గానండి—నిలబడితే అయిపోయుండేవోళ్లం ... నయానికాకోక్కటుబడితే, బయానికి యెయ్యోట్లు పడతాయుండి మనకి-

ఎలక్సన్లొచ్చేయంటే సాలు, మనపే రెలిగిపోయాది....ఎటూ సాయం సెయ్యనందుకే ఇచ్చేవోడు రెండు పార్టీల వోళ్లూను....

మన గొప్ప మనం సెప్పుకోకూడదు గానండి ఓ సిన్న కత సెప్తాను....ఇనుకోండి.

ఓపాలి మున్సిపల్ ఎలక్సన్లొచ్చినాయి బాబూ. "యీడికెందుకియ్యాల ముడుపు? ఓటు సెస్తే యీడి ముందే ఓటెయ్యడు" అన్నాడు అప్పల్నాయిఁ— అప్పల్నాయంటే ఎవరా అనడుగుతారా? అల్లప్పుడు మంతర్నాని రేప్‌కేసులో ఇరుక్కున్నాడే, అడుగో— అడు - ఆడు అలాగన్నాడో లేదో - మనం ఊళ్లో దండోరా ఏయించీసేం. అప్పల్నాయిఁ సపోర్టర్లకి పార్కులో మీటింగని.... మీటింగుకి ఆడి సపోర్టరనోడు రాలే స్సరిగదా—అడు కూడా రాలేదు బాబు.

ఏలక్సన్లోంచి "యిత్‌డ్రా" అయిపోనాడంతే....

కొత్త సినిమా రిలీజంటే హాలోళ్లు ముందు మన కక్కబురు చెయ్యాల్సిందే బాబూ.జెనాన్ని కంట్రోల్సెయ్యమని. ఇక సినీమా షూటింగు లంటారా— పోలీసు బందోబస్తు కంటె ముందు మన బందోబస్తడిగేవోరు బాబు - ప్రొడ్యూసర్లు — ఇంతకీ మనల్నో ప్రొడ్యూసరు "ఇలన్" ఏసం ఎయ్యమని బతిమాలాడు బాబూ. "ఈరో" అయితేనే ఏస్తాను నేకపోతే యెయ్యననీసినా నండి. "నా కబ్బేంతరం నేదు....కాని మా "ఈరోయిన్" గుంట మంచంవెఁక్కేస్తాదే నిన్ను జూస్తే" అన్నాడండి." దాంతోసాటు నువ్వో ఎక్కి, మనం మాట తప్పం" అనేసినా నండి.అలాగ "క్లోజు" ఐపోనాదండి మన సినీమా లైషు. లేకపోతే ఇప్పటి సెతాక్కి "ఈరో"ల్ని యెప్పుడో రిటైరు జేయించేసీ వోడ్నండి.

అప్పుడు సినీమాల్లో జేరితే ఎలాగుం దేదో బతుకు !

పద్మవ్యూహంలో అభిమన్యు డన్నట్టు ... ఏటో కన్ఫ్యూశై పోత న్నాను బాబూ....

ఆఁ...పోలీసోడు మొదలు పుండాకో ర్నాయాల వారకూ ఎవుడికేం కావాలి సొచ్చినా మన కాళ్లట్టుకోవల్సిందేనండి మరి.

ఓ పాలి ఏఁవైందో ఎరికా !

ఆయేళ కొత్త "యస్పీ" బాబు దిగి నాడు బాబూ మనూరికి. పంజాబీవోట్ట- గాని పఠాన్లా గున్నాడండి.

ఇంతకో జబ్బ-అంత గర్దనా-నిలువు న్నర మడిసి- .... ఇద్దరు మడుసుల లావు-"సూటు"కో తాను కావాలన్నట్టు న్నాడండి.

ఆ బాబు ఆయేళే రెయిలు దిగేడంట ఇక జూసుకోండి ...బెల్లానికి సీఁవలు పట్టీసినట్టు .... ప్లాటుపారంనిండా పోలీ సోల్లే ... అళ్ల సేతుల్లో లాఠీల్ని పువ్వుల దండలూ, యాపిల్ పళ్లూ.... కప్పీసినాయండి....

"యస్పీ"బాబు రెయిలుపెట్టె దువ్వారం కాడకొచ్చి ఠంచన్‌గా నిల్చుని రంగు కళ్ళద్దాలు తీసినాడండి.

ఇంక జూసుకోండి సంతలో పఁసువులు డెక్కలు సప్పుడులాగ... కిందున్న పోలీ సోళ్లు ఒకటే జోళ్లకొట్టేడవండి, ఒకటే సలావుఁలు జేసేడవండి.

ఆ బాబు సిన్నప్పుడు నాటకాలేసే వోడో యేటోగాని.. హీరోనాగ ఒకసిన్న నవ్వు.... నవ్వి దిగినాడండి.... ఇలా పెట్టి ఆ బాబు దిగడవేఁటి అలా గజ దొంగను జుట్టేసినట్టు జుట్టేసినారండి పోలీసోళ్లు.

పోలీసోళ్లు గులాప్పువ్వుల వాఁసన యెయ్యడం తొలిసుట్టు- నాను అప్పుడే జూసినానండి- ఎంకట రవఁణమూర్తికి యేసినట్టు.... ఆ బాబుని దంఁడల్తో ముంచేసి నారండి.

ఇంతమందిరి పోలీసోళ్లున్నప్పుడు.... మనం "అపరేసన్" జేస్తే బాగుండదని మనం ఒల్లకుండిపోయినానండి. ఈ లోపల "యస్పీ" బాబు సామాను దించ డాని కెక్కి-నారండి ఇద్దరు పోలీసోళ్లు.

కాని ఒక్క-డే సరిపోనాడండి సామాను దించడానికి. ఆ బాబు రెండు పెట్టెల్లో ఒక పెట్టె నేదండి. కెమెరా కూడా నేదటండి.

అయినా ఆ బాబు "హీరో" నవ్వు మా న్లేదండి బంగళా జేరీవారకూ- జేరేక కూడా ఆ బాబు మారనేదండి నవ్వే మారిపోనాదండి.... విలన్ నవ్వుకి....

రెండ్రోజుల్లో తన సామాను తనకి జేర్చకపోతే సబిన్సపెట్టర్లని వొండుకు తినేస్తానన్నాట్టండి. హెడ్డుల్ని వొండుకో కుండానే తినేస్తానన్నాట్టండి. ఇనస్పెట్రు బాబుల్ని మన్యాలు పట్టిచేస్తా నన్నాట్టండి. ఇదంతా నాకెలా తెలిసిందంటారా ?....

యెంకటేశం బాబని ఒకడు టౌను యిన స్పెక్టరు వుండేవోడండి. ఆ బాబే సెప్పే డండి. సెప్పేక "ఒరే కెప్టేనూ, నువ్వే కెప్టెనువిగావురా, మా పాలిటి కిష్ణమూర్తి వేరా.... మా ఉజ్జోగాలు నిలబెట్రా. కాళ్లట్టుకోమంటావేట్రా?" అని బతిమి లాడినాడండి.

"సి! స్సీ!! కాళ్లా పట్టుకోవద్దు. కంటవూ పట్టుకోవొద్దు. గాని రెండు నెల్లు 'లైసెన్స్'కట్టనంతే" అనీసినానండి. లైసెన్సంటే యేటంటారా? రైలు సేషన్లోనూ, బస్టాండుల్లోనూ మనపని మనం జేసుకోడానికి పోలీసోళ్లకి.... వోరానికోసారి కడతాంలెండి— అదండి లైసెన్సంటే. "రెన్నెల్లుకాకపోతే ఆర్నెల్లు కట్టకురా. కాని సుందర మా బతుకులు నిలబెట్రా" అని బతిమాల్నాడండి ఆ బాబు.

ఎంత పోలీసోడైనా అప్పుడు మాత్తరం ఆ బాబుని జూస్తే జాలేసి నాదండి.

మరంతే....

మాపిటేలకెల్లి "పలానా రూము సెక్ జేసుకొండి,మీసామాన్లు మీకు దొరుకుద్ది" అని సెప్పినానండి. దొరికినాదా అంటారా?... మంచోరే. నేనసలు పోలీ సుల్లో పుట్టాల్సినోణ్నండి; అదు రుష్టం బాగుండి పుట్టనేదంతే. ఇంతకీ ఆ సామాను ఎవురు తీసినారనా? ఆ రూము ఓ మెడికల్ స్టూడెంటు కుర్రాడిదండి. ఆ బాబు తర్డియర్ కొచ్చినాక నాను రెండు సుట్లు జెయిలు కెళ్లొచ్చినానండి.

ఆ బాబుని మొదట డైమాన్రాణీ డిపోలో జూసినానండి. మలిసుట్టు "సెవెన్ హిల్స్" బార్లో అగుపడినాడండి. యీ మద్దెల రెండు సోట్లా అగపడ్డం నేదండి. ఏట్రా యీ దాబేటైనాడ్రా అని యిచారిస్తే— ఏటది— 'పెతెడిన్నో' ఏటో అంటారు— అ మందు ఆ బాబుకి అలవాటైపోనాదటండి. అ కర్సు తట్టుకోనేక పస్సుకొను పెట్టెల్లోనే పని మొదలెట్టినాడండి. ఆ బాబుకి ఎవురూ నేరా అంటారా? ఎందుకు నేరండి? ఆళ్ల బాబు పెద్ద అఫీసరండి.

కేసేటైందని అడక్కండి.

పెద్దోళ్ల పిల్లలు కూనీజేసినా కేసు లుండవండి. అది రూలేనండి. ఆకోర్టుట్లూ, కేసులూ, జైళ్లూ అన్నీ లేనోళ్లకేనండి. ఏటోబాబు— ఏవో సెప్పబోయి, మరేటో సెప్పేస్తున్నాను. యింతకీ నాను సెప్ప బోయీ కత మెడికల్ స్టూడెంటుదీ కాదు యస్సై బాబుదీ కాదండి.

యెకంట రవణ బాబుదండి.

## 2

ఏటి బాబూ ఏటంటారూ? ఇమానం మీదకొచ్చినా యినిపించకుండా సెవులకి యీ కట్లోటండి. యెంకటరవణ బాబు కత సెప్పాలంటే ముంగల అచారి బాబు సంగతి చెప్పాలండి.

అచారి బాబెవరంటారా?

ఆ బాబు వొకీలూ, నేను పారి టీసీనండి.




అయితే మాత్తరం మాది సాన్థి, సరసుడిదీ సవందం కాదండి. మాది రావ్లోరూ, ఉడతా సవందం అనుకోండి. నేపోతే మారీచుడూ, సుబాహూ సవందం అనుకోండి.

ఏటీ! ఆ బాబుని మీ రెరగరా?

ఇటు మూడు జిల్లాలూ, అటు మూడు జిల్లాలూ తిరిగినా నాపాటి నంజ నీ కగపడదండట యెనకటి కెవర్తో!

అలాగ్గ మన స్టేట్ హోల్మొత్తం మ్మీద ఆపాటి వాకీలు నేడనుకోండి....

ఆ బాబెలాగుంటా డంటారా?

ముం దు కి సెంబులాంటి గుండు, యెనక్కి ఏ అడదైనాసరే మోజుపడేటంత బారెడు జుత్తండి. నుదుటిమీద మూరెడు నా మా లం డి. సెవులకి రూపాయకాసంత తమ్మిట్లండి. సిన్నసైజు పొడుండవప్పిలు దూరిపోతాయా అన్నంత ముక్కుకన్నాలండి....కొత్త రాగిబిందెలాటి రంగండి. ఆరడుగుల యిగ్రహం అండి.

సందేశ సిలుకుపంచా, సిలుకుసొక్కా ఏసుకొని, మంచిగందం సేతికర్ర ఊపుకుంటూ సికారెల్తావుంటే- ఇలాగెలాగుండీవోడంటే- సరదాకి దిరీసు యిప్పేసుకున్న మైసూరు మారాజులా గుండేవోడండి.

ఇక- తెల్ల సిలుకు పంచె- అత్తాకోడలంచుది- పీకవారకూ బొత్తాయి లెట్టుకున్న లాంకోటూ, నెత్తిన బంగారం కిరీటంలా జెరీపాగా ఎట్టుకొని- కార్లో కోరటు కెల్తావుంటే, యీ బాబెవడూ! ఇలా దశరద మారాజు మినిష్టులాగున్నాడూ అనిపించీదండి.

ఆ బాబుకాడ ఇద్దరు ఆడోళ్లతో సహా పదిమందిరి జూనియర్లండి. అబ్బో! ఆ బాబుకి మూడు కార్లు, అరు మేళ్ళ, వొందెకరాల బూవి....

ఇక ఆ బాబు ఆపీసు అంటారా?.... అయిక్లాసు హోపేల్లాగుంటాదండి ఎయిరు కండిషనో ఏదో అంటారే అది– లోపల కెళ్తే పొద్దుపేళో, రేతిరో తెల్దు– అబ్బో! కూకుంటే కందిపోయీ కుర్చీలు– ఓ వార్న ఓ యకరా బల్ల– ఆ బల్లమీద తాఁవఁరపువ్వులాటి దీపం–ఆ దీపం ఎనక ఆ బాబు గదంతా సిన్న సీకటి–అరబెత్తెడు మందాన తివాసీ– ఆ తివాసీమీద సప్పుళ్లేకండా నడిసీ ఆ బాబు జూనియర్లని సూత్తే హిట్లరులాటోడి కూకుడా హార్టెటాక్ ఒచ్చేస్తాదండి.

కూనీసేసిన గాడిదకొడు కెవడన్నా ఆ గదిలోకొచ్చినాడంటే "ఉరి ఇక్కుడేస్తారా? కోరట్లో ఏస్తారా" అనిపించి వొలసిందేనండి.

ఇంకా బాబు కోడికేసులూ, కుక్కకేసులూ పడ్తాడనుకుంటారేటి? సె! స్సే!!

ఆ బాబు ముండకేసు పట్టేడంటే అది మారాజు ముండే అయ్యుండాలండి.

దొంగతనం కేసు పట్టేడంటే– అది స్టేటుబేంకు దోపిడీయే అయ్యుండాలండి.

ఆ బాబు పరపతంటారా? అబ్బో.... ఆ బాబు క్లబ్బుకెళ్తే కలకపేర్లుకూడా లెగిసి నిలబడిపోయీవోరండి. ఓపాలి ఆ బాబు కోరట్లోకి ఎళ్తే, పరాకుమీదున్న జడిజీలే లెగిసి నిలబడిపోనారటండి.

ఓపాలి పాపారావునాయుడు బాబూ అదే...నిరుటివోరకూ "పీ.పీ." జేసినాడే ఆ బాబు–ఆ బాబేటన్నాడంటే–"ఆవాలీ, నీ వోదన యింటే– కూనీ అయిపోయి నోడుగూడా "నాను మామూలుసావే సచ్చి నాను గాబోసు అనుకుంటాడురా" అన్నాడటండి.

ఇంతకీ ఆ బాబుకాడకొచ్చీ పారిటీలు ఎవురనుకున్నారు?

వొడ్డీల మీద వొడ్డీలు ఏసీసి డబ్బు కోసరం పెళ్లాన్నీ, పేణాన్నీ అమ్మింతేస్తారే....అలాటి సావుకోర్లు–ముదనష్ట పాస్తులు, ముండలాస్తులు కలిపీసుకొని ఈ పారిటీ గాదని ఆ పారిటీ ఆ పారిటీ గాదని ఈ పారిటీ మారిచేసి ఎమ్మెల్లేలూ, ఎంపీలూ అయిపోతారే ఆలాటోళ్లు,

నస్పెండైపోయిన సూపరెంట్లు,

ఒకడికి తియ్యవొలసిన కాలు, మరొడికి తీసీసే డాకటర్లు, పిట్టల్ని కాల్చేసినట్టు పదిపందిర్ని కాల్చేసీ రాచ్చన ముండాకొడుకులు, సేరు ఇసక్కి సిటికెడు సిమెంటేసి, యీయేల కడితే, యీ యేలే పడిపోయీ బ్రిడిజీలూ కడతారే అలాంటి కంట్రాక్టర్లు, అరబస్తా ఎరువుకి బస్తాడు ఉప్పు కలిపీసే యాపారస్తులు సంసారికీ, సానికీ తేడా తెలవకుండా మందుకొట్టేసి అమాయకపు గుంటల్ని చెరిచేసే డబ్బునోళ్ళ కుర్రాళ్ళూ.

అయితేనేంగాక, ఆ బాబుకి నానంటే ఎంత యిదో సెప్పలేం. మువ్వై వేలు పుచ్చుకున్న మర్డరు కేసైనా సరే ఒగ్గీసి, మనది సిన్న సోరీ కేసైనా సరే వొచ్చి వొలసిందే. (సశేషం)



# క్రాస్‌వర్డ్ పజిల్

అలపర్తి రామకృష్ణ

"శ్మశానం ఎక్కడుందో తెలుసా?"

లంచ్ అవర్లో వెంకట్రావు నడిగాడు చక్రవర్తి. వెంకట్రావు కూడ తనుంటున్న విజయనగర్ కాలనీలోనే వుంటున్నాడు.

వెంకట్రావు తెల్లబోయేడు. గోల్కొండ ఎక్కడుంది? పురానాపూల్ ఎక్కడ? సరూర్‌నగర్ ఎక్కడుందని అడుగుతారు గాని శ్మశానం గూర్చి అతన్నెప్పుడూ ఎవ్వరూ అడగలేదు. అతను హైద్రాబాదులో పదేళ్ళనుంచి వుంటున్నా తమ కాలనీకి దగ్గర్లో శ్మశానం ఎక్కడుందో తెలియదు.

"నాకూ సరిగ్గా తెలియదు చక్రవర్తీ! ....కైలాష్‌నగర్ శ్మశానమేదో వుందనుకుంటాను.... మా నాన్న నడిగి చెబుతాను.... అయినా శ్మశానం గూర్చి ఎందు కడిగేవ్?"

కొన్ని క్షణాలు చెప్పడానికి సంకోచించాడు.

"మా అమ్మకు వొంట్లో బాగుండటం లేదు.... యివాళో రేపో అన్నట్లుగా వుంది.... ఆ పరిస్థితే వస్తే ఎలా ఫేస్ చెయ్యాలో అర్థంకావడం లేదు.... నాకు తెల్సిన వాళ్ళెవరూ లేరు నువ్వు తప్పితే."

చక్రవర్తి కళ్ళనీళ్ళ పర్యంత

మయ్యాడు. అన్ని విషయాలు చెప్పేడు వెంకట్రావుకి.

"బాధపడకు.... మేమున్నాం గదా! అవసరమొస్తే నాకు కబురుచెయ్యి... మా నాన్నని, కవుళ్ళని తీసుకువస్తాను."

చక్రవర్తికి ధైర్యం చెప్పి తన సెక్షన్‌వైపు వెళ్ళేడు వెంకట్రావ్.

క్యాంటిన్‌వైపు వెళ్ళబుద్ధి కాలేదు. చేతిలోకి పేపరు తీసుకున్నాడు.

.... జీవితంలో ఏ నిముషాన ఏం జరుగుతుందో ఎవ్వరూ వూహించలేరు... బంగ్లాబంధు ముజిబుర్‌రహమాన్ దారుణంగా కుటుంబ సభ్యులతోసహా హత్య చేయబడతాడని, భుట్టోని ఉరితీస్తారని, నిక్సన్‌ని పత్రికలవాళ్ళు గద్దెనించి దింపుతారని, ఇందిరాగాంధీ ఎన్నికల్లో ఓడిపోతుందని ఎవ్వరనుకున్నారు.

మొగలాయి సామ్రాజ్యాన్ని నాశనం చేసి, చిట్టచివరి మొగలాయి చక్రవర్తి బహదూర్‌షాని రంగూన్‌లో జైల్లో పెడతారని తెలిస్తే జహంగీరు బ్రిటిష్ వాళ్ళకి వ్యాపారంచేసుకోవడానికి అనుమతిచ్చేవాడేనా?....

చదువుతున్న పేపర్ని టేబిల్‌పైకి విసిరేసేడు చక్రవర్తి.

....యాభై ఏళ్ళ వయస్సులో మనిషి రాయిలా వుండి ఇంట్లో పనంతా చేసుకునే అమ్మ హఠాత్తుగా మంచంలో పడుతుందని తానెప్పుడూ అనుకోలేదు....

అమ్మకి కాన్సరట-

అమ్మని కాన్సరు పూర్తిగా కొరుక్కు తిందని మొన్నటివరకూ తెలియదు. ఉస్మానియా హాస్పిటల్లో మూడ్నెల్లు వుంది. లాభంలేదని డిశ్చార్జి చేసేరు... అమ్మ కదలలేదు.... అన్నీ మంచంలోనే.... బెడ్‌పాన్ తను శుభ్రం చేస్తుంటే అమ్మకళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి.... తనతో ఏదో చెప్పాలనుకుంటుంది.... చెప్పలేదు.... కళ్ళు కన్నీటి వరదతో పొంగే నదుల్లా వుంటాయి....

ఏం చెయ్యగలడు తను?

ఆఫీసులో మ్యారేజ్ ఎడ్వాన్సని, మోటారుసైకిల్ ఎడ్వాన్సు అని డబ్బు తెచ్చి అమ్మ జబ్బుకే ఖర్చుచేసేడు.... నయంకాలేదు....

అమ్మ కడుపులో తనుండగానే నాన్న చనిపోయేడు. నాలుగేళ్ళ సంసార జీవితంలో అమ్మని నాల్గురోజులయినా సుఖపెట్టలేదట నాన్న.... నాయనమ్మ, నాన్న కలిసి అమ్మని ఏడిపించేవాళ్ళు. నాన్న ప్రతి విషయానికి నాయనమ్మ సలహాయే తీసుకునేవాడట.... అమ్మతో పెద్దగా మాట్లాడేవాడు కాదట....అమ్మ పరిస్థితి పనిమనిషికన్నా హీనంగా వుండేదట.

నాన్న సినిమాకు వెళ్ళాలంటే నాయనమ్మతో కలిసి వెళ్ళేవాడట. తలనొప్పి వస్తే అమ్మ అమృతాంజనం రాయబోతే

కసిరికొట్టి, నాయనమ్మను తల రుద్దటా నికి పిలిచేవాడట.

తల్లీ కొడుకుల మధ్య అనురాగం, ఆత్మీయత వుండటం సహజమేగాని మోతాదు మించితే చాలా ప్రమాద మని పించింది చక్రవర్తికి. తల్లి నుంచి అన్ని విషయాలు తెలుసుకున్నాడు.

నాయనమ్మ నాన్నని ప్రసవించలేక వెంటనే నాన్న బొడ్డు కోసేసివుండరని అమ్మ అనుమానం. తనని ప్రసవించ గానే వెంటనే బొడ్డు కోసెయ్యమని నర్సుకు చెప్పిందట ఆ మగతలోనే.

ఆ అనుభవాల మూలంగానే అమ్మ తనని దూరంగా వుంచేది. చుట్టుపక్కల పిల్లలు తన నెవ్వరన్నా కొట్టితే తననే మందలించేది. ఏ విషయంలోను తనకి సలహాల నిచ్చేది కాదు.

అమ్మ జీవితమంతా కష్టాలమయం... సవితి తల్లి ఆరళ్ళతో పుట్టినింట్లో అష్ట కష్టాలు పడింది....నాయనమ్మగారింట్లో కూడ అమ్మకి కష్టాలు తప్పలేదు.... జీవితం ఆఖరిపుటల్లో కూడ అక్షరాలన్నీ గజిబిజిగానే వున్నాయి...ఆఖరి శ్వాసలు లెక్కపెట్టుకుంటూ, ఒకాతురిచే చేయించు కోవాల్సిన పనులు తనచే చేయించు కుంటూ సిగ్గుతో, బాధతో క్షణ క్షణం చచ్చిపోతూనే వుంది....

"చక్రవర్తిగారూ! క్యాంటిన్ కు రావడంలేదా ?" – సైపిస్టు లక్ష్మణరావు అడిగేడు.

"ఆకలిగా లేదు....మీ రెళ్ళిరండి," అన్నాడు చక్రవర్తి.

అత నెళ్ళిపోయేడు.

తన కాకలి లేదా ?.... ఉదయం కూడ భోజనం చెయ్యలేదు... ఉదయం అన్నం వొండితే అంతా బియ్యపు గింజలే! అమ్మకి బత్తాయిరస మిచ్చి తను బయటపడ్డాడు.

....నెలాఖరు....డబ్బుల్లేవు...దాదాపు స్నేహితు లందరిదగ్గర అప్పు తీసుకు న్నాడు తను అమ్మ మందులకోసం.... ఎప్పుడు తీర్చాలో ఆ అప్పులు ?

అమ్మ చనిపోతే ?....

దహన సంస్కారానికి డబ్బు లెవర్ని అడగాలి ?

మళ్ళి చేతిలోకి పేపరు తీసుకున్నాడు.

మంచంలో మగతగా పడుకున్న అమ్మే కనిపించింది ..

"సార్! మీకు ఫోన్ వొచ్చింది," – అటెండరు వొచ్చి చెప్పేడు.

పక్కనున్న ఒ. పి. సెక్షన్‌వైపు నడిచేడు చక్రవర్తి.

నడుస్తుంటే అతని గుండెలు దడదడ కొట్టుకున్నాయి.

అమ్మకి ఎలా వుందో ?

ఇంటి ఓనరు రాఘవయ్య చెయ్యడం లేదుకదా ?

"మీ అమ్మ చనిపోయిందని" చెప్పడు గదా! ఆయన మాట ఏలా భరించడం ?

... జాతస్య మరణం ధ్రువమ్....

"...పుట్టినవాడు గిట్టక తప్పదు... ప్చ్
కానీ.... అమ్మ .... అమ్మ ....

తన కళ్ళముందు నుండి మాయమయి పోతుందా ?

అమ్మ యింకా ఎక్కువ రోజులు బతకదని చెప్పినా తన మనస్థితి ఆ పరిస్థితికి తట్టుకోవడానికి సిద్ధంగా లేదు.

ఇప్పుడెలా ?

అసహనంతో రిసీవర్ పైకెత్తాడు.

"హలో!"

వసుమతి గొంతు విన్పించడంతో చక్రవర్తి మనస్సు కుదుటబడింది.

"చక్రవర్తిగారేనా ?"

"వసూ.... ఏమిటి సంగతులు ?"

"నామీద కోపం వొచ్చిందా ?"

"ఎందుకు ?"

"మా నాన్న ఉదయం నీ మీద విరుచుకుపడ్డాడట కదా !"

"... ... ... ...."

"నాన్నకు కోపం ఎక్కువ.... నువ్వేమనుకోకు."

"నా కెవ్వరిమీద కోపంలేదు వసూ! కోపం వొచ్చినా నాకే నష్టం-" అన్నాడు చక్రవర్తి దిగులుగా.

"అదిగో నీ మాటలే చెబుతున్నాయి నీకు మా మీద కోపం పోలేదని....మా నాన్న తరపున నేను క్షమాపణలు చెబుతున్నాను."

"వసూ! మీ నాన్న పోట్లాట నాకేమన్నా కొత్తా ? మామూలేగా....మన స్ఫూర్తిగా చెబుతున్నాను .... నాకేం కోపం రాలేదు... అదిసరేగాని మా అమ్మ దగ్గర కెళ్ళావా ఈ పూట ...ఎలా ఉంది అమ్మకు ?" - ఆతృతతో అడిగేడు.

"మామ్మకి తేలిగ్గానే వుంది...కొంచెం సేపు మాట్లాడింది కూడ" తేలిగ్గా ఊపిరి పీల్చేడు చక్రవర్తి.

"చల్లటి వార్త చెప్పావు వసూ!"

"ఉదయం యింటినుంచే వెళ్ళావు కదా! ఏమిటి అలా అడుగుతున్నావు ?"

"ఏం లేదులే! నాకు ఫోన్‌చేశావు.... నాన్న లేడా ఏమిటి యింట్లో ?"

"నాన్న విషయం నీకు తెలుసుగా... డబ్బుమనిషి....వడ్డీ డబ్బులు ఎగ్గొట్టేడట ఎవడో! వసూలు చేస్తానని అన్నం కూడ సరిగ్గా తినకుండా వెళ్ళేడు. సాయింత్రం నాన్న తిరిగిరాకుంటే బిర్లా భవన్ వెళ్ళదాం... త్వరగా ఆఫీసుపని తెమల్చుకుని వచ్చెయ్యి."

వసుమతి ఫోను పెట్టేసిన శబ్దం విని పించింది చక్రవర్తికి. వసుమతితో తేలిగ్గా మాట్లాడేసేడుగాని మనస్సు పీకుతూనే వుంది.

సాయింత్రం యింటికి వెళ్ళగానే ఆమె తండ్రితో మళ్ళీ పోట్లాట తప్పదు.

ఉదయం గాలివానలా రాఘవయ్య తనమీద దాడి చెయ్యడం గుర్తుకు వచ్చింది.

"రెండురోజుల్లో ఇల్లు ఖాళీచెయ్యాలి"- అన్నాడు. ఉదయాన్నే వేపపుల్ల నములుతూ తాముంటున్న షెడ్డువైపు వొచ్చి.



రాఘవయ్యగారి మేడ వెనుక భాగంలో వున్న రేకుల షెడ్డులోనే తాముంటున్నది. రెండేళ్ళయ్యింది ఆ యింట్లోకి వొచ్చి. రెండేళ్ళల్లో ఆరుసార్లు అద్దె పెంచాడు. ఆమాత్రం సౌకర్యం వున్న యిల్లు దొరుకుతుందో లేదోనని కిక్కురుమనకుండా అద్దె కట్టేసేవాడు తను. కలుపుగోలుగా మాట్లాడుతూ ఆసరాగా వుండే రాఘవయ్య కూతురు వసుమతిని వొదిలి దూరంగా ఉండటం అమ్మకీ యిష్టంలేదు.

"వున్నఫళాన యిల్లు ఖాళీచెయ్యమంటే కష్టం గదండీ! అద్దె మీరడిగినట్లే యిస్తున్నాగా!" రాఘవయ్య యిల్లెందుకు ఖాళీ చెయ్యమంటున్నాడో అర్థంకాలేదు తనకి.

"మీ అమ్మ ఎక్కువ రోజులు బతకదట కదోయ్! మా ఇంటిముందు 'శవం' లేవడం యిష్టంలేదు మా యింటికి అరిష్టం కూడ....మా యింటిముందు శవం చూడడం నాకు చాలా భయం. వెంటనే ఖాళీ చెయ్యి" మొహం నిండా

అసహ్యం పులుముకుని అన్నాడు రాఘవయ్య.

తోటిమనిషి చావు బతుకుల్లో వుంటే సానుభూతి, జాలి చూపించడానికి బదులు రాఘవయ్య కర్కశంగా మాట్లాడటం చక్రవర్తికి గుండె తరుక్కుపోయింది.

"హైద్రాబాద్‌లో మరో ఇల్లు దొరకాలంటే కనీసం రెండు నెలలన్నా గట్టి ప్రయత్నం చేస్తేగాని దొరకదండీ! ఖాళీ చెయ్యమని యిప్పుడు చెప్పారుగా! ఆ ప్రయత్నంలోనే వుంటాను."

"అదేం కుదరదయ్యా! రెండు నెలలంటే ఈలోపు మీ అమ్మ గుటుక్కుమంటుంది. నా కొంప మునుగుతుంది. కొత్తగా కట్టిన యింటిముందు శవం లేవడం అరిష్టమయ్యా అని మొత్తుకుంటుంటే వినవేమియ్యా!" అన్నాడు విసుక్కుంటూ.

వసుమతి మధ్యలో కల్పించుకోబోతే కసిరికొట్టాడు రాఘవయ్య.

ఆయనతో ఎక్కువసేపు మాట్లాడటం మనస్కరించక ఆఫీసు కాచ్చేసేడు తను.

రాఘవయ్యకు వసుమతి ఒక్కతే సంతానం. వసుమతి తల్లి చనిపోయి పదేళ్ళయింది. యింట్లో వంటావార్పు అంతా వసుమతే చూడటంతో ఆమె చదువు కుంటుపడింది. పదో తరగతి వరకు చదివి మానేసింది. 'రాఘవయ్య మానిపించేసాడు' అంటే బాగుంటుంది. పుస్తకాలు చదువుతూనో, అల్లికలతోనో, స్నేహితులతో మాట్లాడుతూనో కాలక్షేపం చేస్తుంది వసుమతి.

వసుమతికి ఇరవై యేళ్ళుంటాయి. గుండ్రటి మొహం, సోగకళ్ళు, గులాబీ రేకుల్లాంటి పెదవులు, పొడవాటి జడ, దబ్బపండులాంటి శరీరచ్ఛాయ - కళకళలాడుతూ వుంటుంది.

ఆ అమ్మాయికి తనంటే ఎంతో యిష్టం—

ఆరోజు తనకింకా గుర్తుంది - జీవితంలో మర్చిపోలేని మధురమైన రోజు-

ఇంటి అద్దె యివ్వడానికి రాఘవయ్యగారి మేడపైకు నడిచేడు తను.

ఇంట్లో రాఘవయ్య లేడు.

వసుమతి తలుపులు తీసింది.

రోజూ చూపులతోనే తన మనసు దోచుకునే ఆ అమ్మాయి ఎదురుగా నిలబడగానే తడబడ్డాడు తను.

తన ఎడారిలాంటి జీవితంలో ఆ అమ్మాయి 'ఒయాసిస్సు'లా తారసిల్లింది.

మనస్సును, శరీరాన్ని స్వాధీనంలోకి తెచ్చుకునేసరికి ఐదు నిమిషాలు పట్టింది తనకి.

"రాఘవయ్యగారు లేరాండీ యింట్లో"

ఆయన లేడని తెలుస్తున్నా అడిగేడు తను.

కళ్ళార్పకుండా తననే చూస్తున్న వసుమతి కనురెప్పలు తన మాటలకు ఉలిక్కిపడ్డాయి.




"రండి.... లోపలికి రండి"-సోఫా చూపించి లోపలికి పరుగెత్తింది.

రావిశాస్త్రి 'అల్ప జీవి' కన్పించేడు సోఫాపై.

ప్రకృతి దృశ్యాలున్న కలర్ పెయింటింగ్స్ గోడలకు వేలాడదీసి వున్నాయి.

ఆమెకు మంచి టేస్టు లున్నాయను కున్నాడు చక్రవర్తి.

చిక్కని పాలల్లో బోర్నవీటా కలుపు కొచ్చింది.

"నేను వస్తాదును కావాలనుకుంటు న్నారేమిటి ?" -అన్నాడు పాల కప్పును చూస్తూ.

ఆమెతో ఎన్నో సంవత్సరాల పరి చయ మున్నవాడిలా మాట్లాడటం తనకే ఆశ్చర్యమేసింది.

"బలహీనంగా కన్పిస్తున్నారు మీరు. కొంచెం లావయితే యింకా బావుంటారు" -అంది తనవంకే చూస్తూ.

ఆమె తనకు ఆత్మీయురాల్లా తోచింది.

ఎన్నో జన్మల పరిచయమున్నట్లని పించింది తమ మధ్య. ప్రేమాంకురాలు గుండెల్లో బలంగా నాటుకున్నప్పుడలాగే అన్పిస్తుంది గాబోలు !

"ఇంటి అద్దె యివ్వడానికి వచ్చేనండీ."

"ఆ విషయాలు నాన్నతో మాట్లా డండి... నాన్న లేరు.... సికింద్రాబాద్ వెళ్ళేరు."

సోఫాలోంచి లేవబోయేడు తను.

"నాతో మాట్లాడటానికి యింకే విష యాలు లేవా" -అంది నవ్వుతూ.

ఎంత చొరవ....

.... ఎన్నో విషయా లున్నాయి.... వెన్నెల రాత్రుల్లో నీ వొడిలో తలపెట్టు కుని యుగాంతం వరకూ సరిపడే విష యాలు చెప్పాలి .... గుండెలో 'కొల స్ట్రాల్' లా పేరుకుపోయిన కష్టాల్ని

తుడిచేసేసి, నీ ప్రేమనే వెచ్చని వూపిరిని వింపుకోవాలి....

మనస్సే ఆమెతో కొన్ని నిముషాలు మాట్లాడింది.

పెదవుల కదలికలు లేవు.

చీకట్లో వెన్నెల కిరణంలా కన్పించింది వసుమతి ఆ క్షణంలో.

"నే నంటే మీ కిష్టమేనా" -అంది మెల్లగా, ధైర్యంగా-

"........"

" మీతో జీవితం పంచుకోవాలనివుంది" అంది తలొంచుకుని.

విచ్చీ విచ్చని సన్నజాజిలా కన్పించిందామె. ఆమె తల్లోని సన్నజాజులు తన పిరికితనాన్ని చూసి నవ్వేయి.

"సన్నజాజు లంటే నాకెంతో యిష్టం" -అన్నాడు తను లేచి నిలబడి.

ఆమె నవ్వింది, సన్నజాజి విచ్చుకుని నవ్వినట్లు.

"చక్రవర్తి గారు! ఇదిగోండి 'టపాల్ బుక్'.... మీ పేపర్స్ తీసుకుని పి. ఆర్. లో రిజిస్ట్రేషన్ చేసుకోండి"

సెక్షన్ ఆఫీసరు మాటలతో చక్రవర్తి మనస్సు వసుమతి దగ్గరనుంచి ఆఫీసులో కొచ్చి పడింది.

ఐదింటివరకు 'కరెంట్స్'తో కుస్తీ పట్టి సెక్రటేరియట్ నుంచి బయట పడ్డాడు చక్రవర్తి.

సిటీబస్సు దొరకలేదు.

ఇంటివైపు నడవసాగేడు.

జీవితమే వొక 'క్రాస్‌వర్డ్ పజిల్లా' తోచింది చక్రవర్తికి.

గుమ్మడిపాదులా మెదడు చుట్టూ పాకిన సమస్యలు-

చావుబతుకుల్లో అమ్మ....

దహన సంస్కారాలకు డబ్బులు....

అద్దెకు మరో యిల్లు....

వసుమతి తనకి కనపడకుండా రాఘవయ్య కట్టడి....

ఆఫీసులో కనబడని 'జీ. వో' ల కోసం వేట....

.... క్రాస్‌వర్డ్ పజిల్లో కొన్ని సమస్యలకు వెంటనే పరిష్కారం దొరుకుతుంది. మరి కొన్ని చిక్కు ప్రశ్నల్లా మిగిలిపోతాయి....

ఇంటి దగ్గర కొచ్చేసేడు చక్రవర్తి.

రాఘవయ్య మేడముందు గుంపులు గుంపులుగా జనం కన్పించేరు.

చక్రవర్తికి చెమటలు పట్టాయి.

కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి.

.... అమ్మ.... అంతా అయిపోయింది...

....అమ్మ.... ప్చ్....

జనాన్ని తోసుకుని ముందుకెళ్ళాడు.

ఏడుస్తూ వసుమతి కన్పించింది.

శవంవైపు చూసేడు చక్రవర్తి.

కరెంటు షాక్ తిన్న వ్యక్తిలా నిర్విణ్ణుడయ్యాడు.

రాఘవయ్య శవం!!

గుండెపోటుతో కొత్త మేడముందే చనిపోయేడు రాఘవయ్య.

———




అభ్యర్థుల నిట్టూర్పులతో ఇంటర్వ్యూ హాలు క్రమేపీ వేడెక్కుతోంది. తుమ్ములు, దగ్గులు అనవసరమైన ఆవలింతలు ఎక్కువ అవుతున్నాయి. షెడ్యూల్ టైముకి ఓ గంట ముందే అభ్యర్థులు సెంట్ పర్సెంట్ హాజరు అయ్యారు.

హాలునిండా బిలబిలా కదలికలు, గలగలా కబుర్లు. జస్ట్ ఫన్‌కోసం వచ్చినవాళ్ళు, చచ్చి చెడి వచ్చినవాళ్లు, ఉంగరాలు తాకట్టుపెట్టుకున్నవాళ్లు, ఉద్యోగం రాకపోతే ఆత్మహత్యకు పూనుకోవాలనుకునేవాళ్లు ఎందరో వచ్చారు.

కొందరు కాలు నిలవక అటుయిటు అడుగులేస్తుంటే కొందరు దిండుసైజు 'ఐ అండ్ క్యూ'లు తిరగేస్తున్నారు. 'ఇంటర్వ్యూ ఎలా ఎదుర్కోవాలి' అనే అంశంమీద కొందరు ఏకపాత్రాభినయం చేస్తున్నారు. కష్టసుఖాలు చెప్పుకునేవాళ్లు, కన్నీళ్లు పెట్టుకునేవాళ్లు, శతాధిక ఇంటర్వ్యూలు చూసి స్మశాన వైరాగ్యం ప్రదర్శించేవాళ్లు — ఇంటర్వ్యూ పేరుతో ఒకచోట కలిసారు. వోణీలు చీరలు పంచెలు,పాంట్లు, నెక్‌టైలు, నెక్‌లేసులు మల్లెలు మరువాలు ... హడావుడి పడ్తున్నాయి.

సూదంటురాయిలాంటి ఓ యువకుడు "లేడీస్ అండ్ జెంటిల్మెన్" అని తమాషాగా అడ్రస్ చేసి అందర్నీ ఆకర్షించాడు. ఎర్రగా బుర్రగా ఉన్నాడు. అందరికీ కనిపించాలని ఓ స్టూలు ఎక్కి అధికారానికి రాబోయే పార్టీ నాయకుడిలా ప్రామిసింగ్‌గా నిలబడ్డాడు. మిగతావాళ్లకున్న ఆశ, ఆత్రుత, బాధ, భయం, బెంగ, అనుమానం ఆరాటం అతని మొహంలో లేవు. ఉల్లాసంగా నవ్వుతూ ప్రపుల్లంగా వున్నాడు. "కమ్ క్లోజ్ టు మీ"అంటూ ఆహ్వానించాడు.అమ్మాయిలు అబ్బాయిలు రంగుల రాట్నం చుట్టూ జనంలా మూగారు.

ఇంటర్వ్యూ ముందు మహత్తర సందేశం అందించేవాడిలా గొంతు సవరించుకుని ప్రారంభించాడు.

"డియర్ ఫ్రెండ్స్, మనం ఎంత

అజ్ఞానంలో ఉన్నామో మన సంఖ్య చూసుకుంటే తెలుస్తుంది సుమారు మూ డు వ ం ద ల మంది ఉంటాము. ఇక్కడ ఉన్నది ముచ్చటగా ఒకే ఒక ఖాళీ. ఆ ఖాళీ నింపే రహస్యం 'మహా కాళీ'కి తప్ప ఎవరికీ తెలీదు," అని ఆగాడు.

"ఆ 'ఖాళీ' నీకు వ ది లి పె ట్టి మమ్మల్ని యిళ్లకి వెళ్లిపొమ్మంటావా?" అని ప్రశ్నించాడో గడుసుపిండం.

"క్షమించాలి ఫ్రెండ్స్. ఉపన్యాసం మధ్యలో అడ్డుతగలకండి. యివాళ నాకు ఆవేశం వచ్చింది. హృదయం విప్పి మీతో మాట్లాడాలనుకున్నాను, మాట్లాడేస్తున్నాను. అంతే. పస్తులుండి, అప్పులుచేసి నానా యిబ్బందులు పడి ఇంటర్వ్యూకు రావడమే ఒక గండంలా వచ్చినవాళ్లన్నారు మనలో. కానీ వాళ్లకి మిగిలేది ఖాళీ జేబులు. అవునంటారా? కాదంటారా?" అన్నాడు.

"కరెక్ట్."

"అవును."

"నిజం."

"చాలు ఫ్రెండ్స్. నా ఉపన్యాసానికి గొప్ప రె స్పా న్స్ వచ్చింది. ఈ సంతృప్తి చాలు. నాకు ఉద్యోగం వచ్చినా రాకపోయినా ఫ ర్వా లే దు. మరయితే 'గొయ్యి' అని తెలిసి కూడా మనం యిందులోనే దిగబడుతున్నాం. అవునా?"

వాళ్ల జవాబు చెప్పేలోగా అతనే అన్నాడు.

"పొరబాటు నాదే. మనం పట్టువదలని విక్రమార్కులం. ఎన్ని ఇంటర్వ్యూలు పోయినా వెళ్తాం. మళ్లీ మళ్లీ వెళ్తాం. ఒక ఖాళీ అయినా అరకాళీ అయినా అసలు ఖాళీలేకపోయినా—బొట్టుపెట్టి అక్షింతలు కాదు, పళ్లు ఇస్తారని తెలిస్తే అది యింటర్వ్యూ అయితే పరుగెత్తుకు వెళ్తాం. ఇంటర్వ్యూకి వెళ్లడం మన జన్మహక్కు. ఉద్యోగం రాకపోతే 'దేవుడే' దిక్కు.

"అయ్యో నా ఉపన్యాసం పక్కదారి పడుతోంది. యిందాక ఏం చెప్పాను? ఒక్క ఖాళీ అయినా సరే—'ఆ అదృష్ట వంతులం మనమేమో'నని భ్రమపడి కదూ మ న ం తరతరాలుగా ఇంటర్వ్యూలు చూస్తున్నాం.

"మై లెర్నెడ్ ఫ్రె ం డ్స్! ఆ 'ఒక్కరూ' మనం ఎప్పటికీ కాలేము. క్షమించాలి ఈ ఉపన్యాసానికి ఒకర్ని మినహాయించాలి. విజయలక్ష్మి వరించబోతున్న ఆ మహానుభావుడు మనలో ఒకరు. నంగనాచి తుంగబుర్ర! చాప కింద నీ రు లా చల్లగా చేరాడు. అడ్వాన్సుగా కంగ్రాట్స్ అందుకోవోయ్!

"ధైర్యంగా ఆయనెవరో ముందుకు వస్తే సభకి పరిచయం చేస్తాను," అన్నాడు.

ఒక్కసారి— సో కాల్డ్ సభ నిశ్శబ్ద




మయిపోయింది. వాళ్లందరూ మొహ మొహాలు చూసుకున్నారు.

'నువ్వా ?'

'నువ్వా '

'కొంపతీసి నువ్వా ?'

— చూపుల బాకులతో ఒకర్నొకరు అనుమానంగా పొడుచుక చచ్చారు.

"నాకు తెలుసు. ఆయన రాడు. వస్తే యింకేముంది ? బుర్ర రామకీర్తన పాడించి మన దారికి అడ్డు తొలగించుకుంటాం. ముందే మెన్షన్ చేసా. అతను లేక ఆమె చాపకింద నీరో తేలో.... అలాంటి మనిషి. ఉపన్యాస సావకాశం కోసం విజేతని 'అతను' అని వ్యవహరించుకుందాం. అతను ఎవరో కాదు....

"అధికార పక్షంలో సుముఖవర్గంలో ఏలుబడిలో వుంటూ అత్యధిక పలుకుబడి గల మంత్రిగారి బావమర్ది. లేకపోతే ఏదో లింక్ కనెక్టెడ్ జంటిల్మన్.

"లేక

"పదివేలో పన్నెండువేలో పాటరేటుకి ఒప్పందం కుదుర్చుకుని హార్డ్ కాష్ షెల్ డౌన్‌చేసి ఉద్యోగం అడ్వాన్సుగా కొనుగోలు చేసిన ధీశాలి. ఆయనగారి 'మాంగారు'గానీ 'బావగారు'గానీ కువాయిట్ వెళ్లి కూలిపని చేసుకుని పెట్రోలు ధనం పంపించివుంటాడు. ఉద్యోగాలు కొనుక్కోవచ్చు. ఊళ్ళే కొనుక్కోవచ్చు.

"సో— సజావుగా ఉద్యోగాలు దొరికే

అవకాశాలు చాలా తక్కువ. అయితే ఇన్‌ఫ్లుయన్స్! లేకపోతే మనీ. ఈ రెండూ తప్పవిడిచి—ఒకటీ అరా దొరికే నిజాయితీ ఉద్యోగాలు ప్రత్యక్ష సాక్షులై మనల్ని కడకంటా ఇంటర్వ్యూలకి నిల బెట్టి ప్రాణాలు తోడుతున్నాయి. లేకపోతే ఎపుడో ఈ రంగానికి గుడ్‌బై చెప్పి ఉండేవాళ్ళం.

"కాబట్టి ఫ్రెండ్స్-అంటే ఈ ఒక్క ఉద్యోగం ఉన్న ఇంటర్వ్యూ ప్లాటు ప్రీ ప్లాన్‌డ్ మర్డర్ కేస్. ఒకడి జీవితం కోసం రెండువందల తొంభై తొమ్మిది మందిని పథకం ప్రకారం పకడ్బందీగా హత్యచెయ్యడమన్న మాట.

"మన మైకు వేస్తు...డబ్బు వేస్తు.... కలలు వేస్తు....కన్నీళ్ళు వేస్తు .. చివరికి నా ఉపన్యాసం వేస్తు. ఇలా అనుకుంటే జరగబోయే ఘోరం ఆగుతుందా? ఊహూ. ఖాళీ ఒకటి గాబట్టి ఉద్యోగం పాపం ఒకడికే యివ్వాలి. ఉద్యోగం ఒకడికే ఇవ్వాలి గాబట్టి....అది ఎక్కువ డబ్బుకి పాడుకున్నవాడికే యివ్వాలి. ఆ డబ్బుతో 'అయ్యగాడు' జన్మజన్మల దారిద్ర్యం నించి గట్టెక్కాలి! ఏ పిల్ల పెళ్లి చెయ్యాలో....ఏ కొడుక్కి ఇంజ నీరింగ్ సీటు బ్లాకులో కొనుక్కోవాలో ....ఏం బ్రాందీషాపు బాకీ తీర్చాలో.... సవాలక్ష దరిద్రగొట్టు సమస్యలు....ఆ సమస్యల నుంచి ఒకడు బైటపడాలంటే ....అమాయకుల మెళ్లో సమస్యల ఉచ్చు బిగించాలి.

"సదరు అమాయకుడు ఉచ్చు నుంచి బైటపడ్డానికి తెలివి మరిగి, మీరి, అవి నీతికి ఆలవాలమై — ఉద్యోగానికి పోసిన వేలు రాబట్టుకోవాలి. యింకో రికరింగ్ ఎఫెక్ట్. ఒకరిమీద ఒకరు ఉచ్చులు పన్నుకోడమే యిందులో టెక్నిక్.

ఎవడి పరిధిలో వాడు దగా చేస్తేగానీ బతకలేని ప్రపంచం యిది.

క్షమించాలి. మళ్లీ సైడైపోయాను. కాబట్టి యిది గొప్ప ప్రతిష్టంభన. దీన్ని మనం తొలగించలేం. ఈ సమస్యను పరిష్కరించాలంటే మనమే ఈ ఫీల్డు నుంచి పైదొలగాలి.

మనం ప్రభుత్వోద్యోగాలకి ఎగ బడడం అనవసరం. నిజానికి మనకి చాలినన్ని ఉద్యోగాలు ప్రభుత్వంలో లేవు. మన ఉద్యోగం మనమే కల్పించు కోవాలి. వెస్టర్న్ కంట్రీస్‌లో 'ప్రభుత్వో ద్యోగాలు మా కెందుకు పనికిరానివాళ్ళ గ్గానీ' అంటారట .... స్వతంత్రంగా బ్రతకాలని ఉబలాటపడేవాళ్లు. మనకి ఆ ధైర్యం లేదు. అధైర్యం ఎక్కువ."

ఓ క్షణం ఆగాడు. జేబులోంచి రెడ్ విల్స్ పాకెట్ తీసాడు. ఒక సిగరెట్ ఉంది. తీసి నోట్లో పెట్టుకుని ఖాళీపాకెట్ భద్రంగా జేబులో పెట్టుకున్నాడు. మళ్లీ ఒక సిగరెట్ కొనుక్కుని పాకెట్లో ఉంచుకుని 'పాకెట్ మెయింటైన్ చేస్తా

ద'న్నమాట — అనుకున్నాడు ఓుందు వరుసలో ఒక యువకుడు. అతను ముందుకు వెళ్లి లైటర్ వెలిగించాడు. "థాంక్స్" అంటూ ఒక దమ్ములాగి — సాధికారంగా దట్టమైన పొగ వదిలి— మధ్య వ్యవధిలో ఉపన్యాసానికి కావల్సినంత మేటర్ ఆలోచించుకున్నాడు. "మనలో మొబైల్ టీకొట్టు ఎవరైనా పెట్టగలరా? బజ్జీబండి నడపడానికి సిద్ధపడేవాళ్లు ఎందరు? సెంటరు చూసి బండి పెడితే రోజుకు ఖర్చులుపోను వందరూయలు సంపాయించేవాళ్లున్నారు ....మీకు తెలుసా? ఏజ్‌బార్ అయ్యేంత వరకూ ఈ ఉద్యోగాలకోసం వెయిట్ చెయ్యడంలోనే జీవితం అంతా వృధా చేస్తున్నాం ఈలోపు ఏదో వృత్తి, వ్యాపకం, టెక్నిక్ నేర్చుకుని నేర్పరితనం పెంచుకుంటే — ఆ దారి వేరు!

"ఎంతో కొంత పెట్టుబడి పెడితే యింతింతై అంతింతై మనల్ని ఆకాశానికి ఎత్తుతూంది. డబ్బు డబ్బుని కనే ఏర్పాటుంది. మీరు తిట్టుకుంటున్న వ్యవస్థ కొందరికి సుందర స్వప్నం. రంగుల హరివిల్లు. విల్లు వంచుకుని అందుకునేవాళ్ళకి రంగులు దొరుకుతాయి

"కొంచెం 'దగా' నేర్చుకోగలిగితే — బైట ప్రపంచంలో విస్తృతమైన దోపిడీ అవకాశాలున్నై. ప్రజలు కాళ్లు బారగా చాచుకొని కూర్చొన్నారు. బుర్రలో గుంజున్నవాడికి అంతా దద్దే.

"మీకో జోక్ చెప్పాలనిపిస్తుంది. 'గల్ఫ్ దేశాల్లో ఉద్యోగాలు' అంటూ నా ఫ్రెండొకడు బోర్డుపెట్టి లక్షలు గడిస్తున్నాడు. వాడు గల్ఫ్‌దేశాల గురించి ఏమీ ఎరగడు. వాడు మొదట అక్కడకు వెళ్లడానికి ట్రైచేసి దారుణంగా ఫెయిల్ అయ్యాడు.

"ఉద్యోగాల మీద అభిప్రాయం మార్చుకుని స్వతంత్రంగా బ్రతకండి. ఇదే నా ఆఖరి ఇంటర్వ్యూ. దీంతో నా ఏజ్ బార్‌అయిపోతుంది. యిక ఏ ఇంటర్వ్యూకి వెళ్ళే అవసరం రాదు, శెలవ్."

* * *

మర్నాడు —

ఇంటర్వ్యూ ఫలితాలు తెలిసాయి. విజయలక్ష్మి వరించింది ఎవర్నో కాదు. 'స్టూల్' ఎక్కి గొంతు చించుకొని ఉపన్యాసం దంచిన యంగ్‌మాన్ని!

అతగాడు చెప్పింది అక్షరాలా నిజం. అంటే అతను మినిష్టర్ బావమర్ది కాదు.

కానీ —

ఆ రాత్రి జనరల్ మానేజర్‌ని కలుసుకుని పదివేలకు సెటిల్‌చేసుకున్న కాండిడేట్‌కు పోటీకి వెళ్లి పన్నెండు వేలకి కుదుర్చుకున్నాడు కొత్తగా.

———

# తప్పెవరిది?



'నీలిమ'

దూరాన ఫాక్టరీ సైరన్ మోగింది, 6 గంటలయింది అని సూచిస్తూ. పడమట ఆకాశాన్ని రక్తసిక్తం చేసిన సూర్యుడు, చేసినపనికి సిగ్గుపడి కొండల చాటుకు తప్పుకున్నాడు. సంధ్య చీకట్లు అలుముకుంటున్నవేళ మాకుమాత్రం ఏం పని అని పక్షులు ఆ రోజు అనుభవాలను ఒకదానికి ఒకటి కిలకిలారావాలతో చెప్పుకుంటూ ప్రొద్దున వదిలిన గూడు చేరుకోను పయనం సాగించాయి. రోజూలాగానే, ఆ రోడ్డు, అప్పటివరకు నిర్మానుష్యంగా పడివున్నది, మనుష్యుల గాలిసోకి తృప్తిగా నిట్టూర్చింది. అవును మరి, నగరానికి సుదూరాన కట్టబడిన ఆ యింటికి ఎవరు వస్తారా? వచ్చినా, ఆ మూసిన తలుపులను చూసి ముఖం చిట్లించుకొని వెళ్ళిపోతారేమో గాని యింట్లోకి వెడతారా?

వచ్చిన యిద్దరు వ్యక్తులు ఆ యింటిలోకి నడిచారు. గేటు దాటిన తరువాత పది అడుగులు వెడల్పుఉన్న బాట. బాటకిరువైపులా తోట. గేటుకి సుమారుగా వంద అడుగుల దూరంలో కొత్త పద్ధతులతో అధునాతనంగా కట్టబడిన ముచ్చటయిన యిల్లది. ఒక వ్యక్తి వాకిలి తలుపు చేరుకోడానికి ఉన్న ఐదు మెట్లను ఎక్కి బజర్‌పై వేలు వేస్తూండగానే తలుపు తెరుచుకుంది.

"నమస్తే ప్రొఫెసర్. రండి లోపలికి. ఇప్పుడే తోటపని పూర్తికానిచ్చి లోపలికొచ్చా" ముఖంపై చిరునవ్వుతో, ఆకర్షణీయంగా ఉన్న ప్రొఫెసర్ సంఘమిత్ర వారిద్దరిని ఆహ్వానించాడు.

"నమస్కారం ప్రొఫెసర్‌గారూ," చిరునవ్వుతో బదులిస్తూ లోపలికి నడిచారు ప్రశాంత్, కుమార్‌లు.

వరండా దాటిన తరువాత డ్రాయింగ్ రూమ్. రూమ్ మొత్తం నేలపై ఒత్తుగా ఉన్న ఖరీదైన కార్పెట్. మధ్యలో నల్లటి సోఫాసెట్. రూంకి కుడివైపున మూలగా రెఫ్రిజిరేటర్, ఎడంవైపున మూలగా రేడియోగ్రామ్, వీటి రెంటికీ

మధ్య తోపలికి వెళ్ళేందుకు రెండు తలుపులు. తలుపులకి, కిటికీలకు రోజ్ కలర్ కర్టెన్స్ ఒక పక్కకి లాగబడి ఉన్నాయి. టేబిల్ పై కొన్ని మాగజైన్స్, ఓ ఫ్లవర్ వేజ్, దానిలో విరిసీవిరియని గులాబులు అందంగా అమర్చిఉన్నాయి.

"కూర్చోండి ఫ్రెండ్స్. ఆఁ. ఏవిటి విశేషాలు? మళ్ళీ మొహాలు కొద్దిగా వడలి వున్నాయే? కాలేజీలో ఏమన్నా....." సంఘమిత్ర కళ్ళలో చిలిపినవ్వు.

"ఆఁ ఏం కాలేజీ సార్. అసలు మాకు ఒక్కొక్కసారి అనుమానం వస్తూ ఉంటుంది ఎవరు ఎవరికి బోధిస్తున్నారు అని. ఆ రోజులు పోయినాయి, గాన్ ఫరెవర్. ఇక్కడ స్టూడెంట్స్‌కి కొద్దిగా మన తరహా రుచింపకపోయినా బయటకెళ్ళిపోతారు. అదేం అంటే, గొడవ, ప్రిన్సిపాల్‌నుండి మెమో! ఏదో బ్రతకాలి కాబట్టి గాని, ఈ వుద్యోగానికి ఎప్పుడో రాజీనామా యిచ్చేవాడివి" ప్రశాంత్ ఆ రోజు చీకాకంతా మాటల్లో ధ్వనింపజేశాడు.

"ఆగండి ఆగండి! ఇటువంటివి తట్టుకోవాలండీ. అయినా, మీకు బాగా చెప్పడం వస్తే వాళ్ళననవలసిన పరిస్థితి రాదు. స్టూడెంట్స్‌ని ఎలా ఆకట్టుకోవాలో తెలుసుకోవాలి మీరు. ఆ జ్ఞానం సంపాదించిననాడే మీరు నిజమైన లెక్చరర్స్" ప్రశాంత్‌ని ఉడికించాడు సంఘమిత్ర.

"మహా బాగా చెప్పారు సార్. అయినా ఓ రోజు క్లాస్ తీసుకొని ఆ తరువాత యిలా వాదించండి. అప్పుడు మీరు నిజంగా గొప్పవారు. వాదన అంటే గుర్తొచ్చింది, ఏమైంది నిన్నటి ఆర్గుమెంట్? ఏమన్నా మార్చుకున్నారా మీ అభిప్రాయాలను" కుమార్ సంఘమిత్రని అడిగాడు.

తృటిలో గంభీరత ప్రత్యక్షమయింది సంఘమిత్ర మొహంలో "నో. నా అభిప్రాయం మార్చుకోను. అయినా, నే చెప్పిన పాయింట్‌లో. ఉన్న సటల్‌టీ మీకు అర్థంగావడం లేదనుకుంటాను."

కుమార్ తల ఆవేశంగా ఊపాడు. "అదే మా అభిప్రాయం కూడా. మా వాదనని మీరు అసలు వినడంలేదు. ఒక రచయిత ఒక రచనచేశాడూ అంటే, వెనకాల అతనికి తెలిసో తెలియకో అతనివి ప్రేరేపించిన సంఘటన ఉండి ఉంటుంది. సబ్‌కాన్షస్‌నుండి వెలువడినప్పుడు, అది అతనిచే మలచబడి బ్రహ్మాండమైన రచన అవుతుంది. అవి చిన్నప్పటి జ్ఞాపకాలు కావచ్చు మరేమైనా కావచ్చు. కాని అవి బయటికొచ్చినపుడు అతను మనకు సమాజాన్ని కళ్ళకి కట్టినట్లు చూపెడుతున్నాడు. అందరం ఎన్నో చూస్తాం కానీ, అందులో ఏవన్నా సిగ్నిఫికెన్స్ వుందా అని ఆలోచించం. అటువంటి ఇన్‌సైట్ మనకు ప్రసాదించే రచయితకి సమాజం ఎన్ని స్వాతంత్ర్యాలయినా

ఇవ్వవచ్చు. అతను మనుష్యుల పై ప్రయోగాలు కూడా చెయ్యవచ్చు."

సంఘమిత్ర చెక్కు చెదరలేదు. "మీకు నేనన్న పాయింట్ అర్థం కావడంలేదు. నిజమే, రచయిత మనకి ప్రసాదించేది అమూల్యం. దానికై అతని జీవితం ఆనందంగా గడిచి పోడానికి కావలసిన పారితోషికం యిద్దాం. అంతేగాని అతను మనుష్యుల మనస్తత్వాలతో ఆటలాడే సాహసం చెయ్య కూడదు."

ప్రశాంత్ గొంతు సవరించుకున్నాడు. "నా ఉద్దేశ్యం, మీరు అక్కడ సమస్యని ఒక కోణంనుండి చూసి ఇదే సమస్య అని సమాధానం వెతుకుతున్నారు. నిన్నటి కథ తీసుకోండి. ఓ అమాయకురాలు భర్త చేతుల్లో కష్టాలు పడుతోంది. గమనించిన రచయిత చెయ్యి ఊరుకోదు. ఆ అమాయకురాలి కథని మనసులకు పట్టినట్లు వ్రాస్తే కొందరిలో అన్నా పరివర్తన వచ్చే ఆశ ఉన్నది కదా! ఒకమ్మాయి కథ వ్రాసినంత మాత్రాన ఆ అమ్మాయి ప్రైవసీకి దెబ్బకాదు. ఆ అమ్మాయి వచ్చి రచయితను "నా కథెందుకు వ్రాశారూ" అని నిలదీస్తే, ఆ అమ్మాయి వెర్రితనం కాని, రచయిత తప్పుదారి పట్టాడని కాదు. పోనీ, మీరు చెప్పినట్టు ఆ అమ్మాయి భర్త ఆ కథ చదివి ఆ అమ్మాయి జీవితాన్ని మరింత నరకం చేశాడనుకొందాం. అమ్మాయి అది భరించలేక ఆత్మహత్య చేసుకుంది. కాని, ఒక్క ప్రాణంపోయినా సమాజం అంతా కళ్ళుతెరిచి చూసింది, చెవులతో ఆ ఘోష వింది. అది చాలు. సమాజం మొత్తం ఒకవేళ చెడుత్రోవ పట్టిఉంటే, మారే అవకాశం ఉంది."

సంఘమిత్ర నవ్వాడు గెలిచినట్లు. "ఇహ మీరు ఒకప్పుడు వర్షాలు రావాలని ఇచ్చిన నరబలికి, దీనికి తేడా ఏమిటి" గొంతులో కొద్దిగా హేళన జతకూర్చిన ఛాయ.

ప్రశాంత్ చికాకు అధికమయింది. "వాటికి మూఢనమ్మకాలు బేసిస్. ఫలితం ఎక్కడా గ్యారంటీ లేదు. వాటితో దీన్ని పోల్చడం అన్యాయం." సంఘమిత్ర ప్రతిఘటించాడు, "ఇక్కడ మాత్రం గ్యారంటీ ఏమిటీ. చదివినవారు, ఇది ఒట్టి కథేనని మర్చిపోతే, ఒక ప్రాణి నాశనంగావడం తప్ప..." ప్రశాంత్ మొహంలోకి చూస్తూ చాలా మెల్లిగా అన్నాడు.

"అంతెందుకు" కుమార్ అందుకున్నాడు. "ఈ ఆర్గుమెంట్‌కి సంబంధించిన కథ ఒకటి ఈ మాగజైన్‌లో పడింది. ప్రశాంత్ నువ్వు ఒకసారి చదివి, ప్రొఫెసర్ గారికి ఇవ్వు. తరువాత తీరికగా వాదనలోకి మళ్ళీ దిగవచ్చు." మ్లానమైన సంఘమిత్ర మొహం చూడకుండానే చెప్పుకుపోతున్నాడు కుమార్.




"ఎక్స్క్యూస్ మీ. ఇవాళ మీరు ఏమి తీసుకుంటారు?" సంఘమిత్ర లేచి నిల్చొని అడిగాడు.

"కూల్ డ్రింక్స్ చాలు సార్. అవి కూడ సాఫ్ట్ డ్రింక్స్. నిన్న యింట్లో గొడవపెట్టేశారు వాసన అన్యాయంగా వస్తోందని," కుమార్ పెద్దగా నవ్వి సిగ్గుపడ్డాడు రెస్పాన్స్ లేకపోవడం గమనించి. ప్రొఫెసర్ కిటికీలోనుండి బయటికి చూస్తున్నాడు. ప్రశాంత్ కథ మొదలు పెట్టేశాడు. అతని కళ్ళు ఆసక్తిగా పరుగెడుతున్నాయి ప్రింటెడ్ మేటర్‌పై.

* * *

ఊటీ,

13-4-1973

మై డియర్ ప్రొఫెసర్ మొగుడుగారూ,

ఇక్కడ మేము బ్రహ్మాండంగా వున్నాం. పోతే రాత్రంతా మీరు కల్లో వచ్చి గొడవపెడుతున్నారు అంతే. వెధవ రోగం, నాకే రావాలా అన్పిస్తూంటుంది ఒక్కోసారి. హాయిగా మీరు నా ఒళ్ళో పడుకొని, వెన్నెల రాత్రి, మన రూఫ్ గార్డెన్‌లో కూర్చొని కబుర్లు చెప్పుకుంటూ, యుగాలు గడిపెయ్యాలని ఉంది. వస్తుందిలే ఆ సమయం, అప్పటి వరకూ "ఎంత ఎంత ఎడమైతే అంత తీపి కలయిక" అని పాడుకుంటూ కూర్చోంది. ఈవేళ నన్ను పరీక్షించి డాక్టర్ ఆశ్చర్యపోయాడు. ఏవన్నాడో తెలుసా? "మీకు సైకలాజికల్ రిలీఫ్ అమ్మా! చాలా బాగా సహకరిస్తున్నారు మీరు మాతో. రోగి వైద్యునితో చెయ్యి కలిపినపుడు రోగం చెదిరి పారిపోతుంది. ఇంకో ఆరు వారాల్లో మీరు యింటికి వెళ్ళిపోవచ్చునేమో." చూశారా

శ్రీవారూ, డాక్టర్ ఎంత పిచ్చివాడో. తన మందులు పనిచేస్తున్నాయి అనుకుం టున్నాడు. కానీ నాకు బ్రతకాలని వుంది సార్. నాకోసం కాదు. మనకోసం. నే నొకదాన్ని ఏం బతుకుతాను సార్, అది అనర్థం, రుచిలేని జీవితం. మీతో వుంటే ఓహ్, భువిపై దివిని దర్శించగలను. బొత్తిగా సిగ్గులేదేంటి మా అవిడకి, అని ముక్కున వేలువేసుకుంటున్నారా? సిల్లీ మాన్! మీతో నాకు సిగ్గేంటి సార్, మన ఇద్దరం ఒకటి. సిగ్గుపడితే, నాతో నేను సిగ్గుపడ్డట్టే.

ఇక్కడ ఊటీలో వాతావరణం చాలా బావుంటుంది సార్. మనం, మీకు తీరి కయినపుడు ఇక్కడ ఓ బ్రహ్మాండమైన లొకేషన్ చూసుకొని సెటిల్ అవుదాం. ఇంకో విషయం తెలుసా, ఇక్కడ, ఈ టైమ్‌లో కూడా, కొద్దిగా చలిగా ఉంటుంది. ఆ చలిలో ఓ చిన్న యిల్లు. ఆ యింట్లో ఓ ప్రొఫెసర్, ఓ మిసెస్ ప్రొఫెసర్. అంతే! ఇంకేం కావాలి సార్ అంతకన్నా?

మై గుడ్‌నెస్, మర్చేపోయా! మీరు ఎలా వున్నారు? వంటా అదీ బాగానే చేసుకుంటున్నారా? లేకపోతే నేను చెక్ చేసేందుకు లేనుకదా అని హోటల్ కూడు లాగించేస్తున్నారా? ఇదిగో, నే వచ్చేప్పటికి వంటింట్లో పెట్టి వెళ్ళిన సామగ్రి అంతా అయిపోకపోతే, మీరు బయట తిన్నట్లు లెక్క. అప్పుడు మిమ్మల్ని కొన్ని రోజులు భోజనం పెట్టకుండా మాడ్చెయ్యగలను జాగ్రత్త. ఖబడ్దార్!

నర్స్ లైట్లు తీసెయ్యమని ఒకటే ఏడుపు. అంతా రెగ్యులర్ ఇక్కడ. మీకు నేర్పిస్తా లెండి కొన్ని గుడ్ హేబిట్స్ అక్కడి కొచ్చిన తరువాత. ఖంగారు పడకండి, అంతా సరదాగానే ఉంటుంది. హా౹౹౹. (ఇది అవలింత) ప్చ (ఇది ము....) గుడ్‌నైట్.

మీ కౌసల్య.

* * *

హైదరాబాదు,
17-4-73

కౌసల్యా డార్లింగ్,

నీ లెటర్ అంది 22 సెకన్లు అయింది. ఎంత గుడ్ న్యూస్ చెప్పావు నీ ఆరోగ్యం గురించి; ఇప్పుడెలాగుంది డియర్? అబ్బా! విన్నాదిలి ఇంకా 6 వారాలు!

ఇక్కడ ఆఫీసు పని ఎక్కువైంది. మే రెండో వారంలో నేను ఊపిరి పీల్చు కోడానికి కొద్ది వ్యవధి దొరుకుతుంది. అప్పుడు దేవిగారి ముందు వాలడానికి ప్రయత్నం చేస్తా. అన్నట్లు ఎదురింట్లో కొత్తవాళ్ళు ఎవరో దిగారు. ఓ అమ్మా యుంది, 24 ఏళ్ళు ఉండచ్చు. చాలా అందంగా ఉంది. స్మైల్ కొడితే, మాట్లాడకుండా లోపలికి పరుగెత్తింది.

ఏవిటో, అమ్మాయిలు మరీ వెనకబడి పోతున్నారు; వుంటా డియర్.

నిర్మల్.

* * *

ఊటీ.
21_4_73

ప్రొఫెసర్ మొగుడుగారూ,

మీ వంద పేజీల లెటర్ అందింది. బుద్ధి లేకపోతే సరి. అయినా, ఒకర్తి ఇక్కడ లెటర్ కోసం కళ్ళుచించుకు ఎదురుచూస్తూ ఉంటుంది అనే జ్ఞానం అక్కరలేదూ? ఏం వ్రాయాలో తెలీదు అంటారా, పైగా! మీ యిష్టం సార్, ఇవాళ వంట నుండి మీరు చూసిన సినిమా కథ వరకు, ఏదైనా ఓ రెండు మూడు పేజీలకు తక్కువ కాకుండా వ్రాయండి. మీకు తెలీదండి, మీ writing చూస్తే నా కొచ్చే రిలీఫ్. మీ లెటర్ని అలా గుండెలమీద పెట్టుకుని పడుకుంటే, మీరే నా వద్ద ఉన్నారూ అనిపిస్తుంది. అది చాలు, నేను త్వరగా కోలుకోడానికి. అసలు టి. బి. వ్యాధికి, రోగి సహకారం చాలా ముఖ్యం. మీరు గనుక ఈసారి లెటర్ సరిగ్గా వ్రాయక పోతే, నేను కోఆపరేట్ చెయ్యను డాక్టర్తో. ఆఁ!

అన్నట్టు ఓ భార్యని సానిటోరియంలో పడేసి ఎవరో అమ్మాయి దగ్గర బ్రహ్మ చారి పోజులు కొడతారా? జాగ్రత్త, ముందే ఆ అమ్మాయికి చెప్పండి, కౌసల్యా అనే లంఖిణి ఉందని, తన సొత్తుమీద కన్ను వేస్తే గుడ్లు పీకేస్తుం దనీ! మీ అరోగ్యం ఎలా ఉంది సార్? రాత్రిపూట పాలు త్రాగుతున్నారా? పెద్ద లెటర్ వ్రాయండి, నాకు ముద్దులు కురి పిస్తూ-

కౌసల్య.

* * *

హైదరాబాదు,
25_4_73.

డియర్ కౌసల్యా,

సారీ గాల్, చిన్న లెటర్ వ్రాసి నందుకు! కానీ టైమ్ బొత్తిగా లేదు. నీ ఆరోగ్యం బావుందనుకుంటాను.

అన్నట్టు మనింటిముందు దిగిన అమ్మాయి పేరు అన్నపూర్ణ. బావుంది కదూ. పేరు కన్నా అమ్మాయి ఇంకా బావుంటుంది. అసలు వర్ణిద్దామని ఉంది కానీ, నా భాష సరిపోదు. ఇప్పుడిప్పుడు కొద్దిగా నవ్వుతోంది, పలకరింపుగా. మొన్న వాళ్ళింటికెళ్ళి పలకరించివచ్చాం. నాకు పెళ్ళయిన మాట చెప్పలేదనుకో (హఁ హఁ హఁ). పాపం, ఆ అమ్మాయి మూగదట. "మూగవయితే నేమి" అన్నట్టు, కుందనపు బొమ్మ. ఎవరు కట్టుకుంటారో అదృష్టవంతులు. ఆ అణుకువ, ఆ భీతహరిణి చూపులు.... ఓహ్! చాలా చాలా బావుంటుంది. నిన్న వాళ్ళింటికి భోజనానికి వెళ్ళా. ఆ అమ్మాయే వడ్డించింది. నీకు మల్లే నే,

తెల్ల చీర కట్టుకొని, మల్లెపూలు పెట్టుకుంది. పోతే, పెరుగుగిన్నె నా కంచంలోకి వదిలేసింది, నాకు పెరుగు ఇష్టమని తెలిసినట్లు. సిగ్గులేకుండా మొత్తం తినేశా. రైట్, ఇక వుంటా.

నిర్మల్.

* * *

ఊటీ,
29-4-73

డియర్ ప్రొఫెసర్,

మీ ఉత్తరం అందింది. అసలు అర్జంటుగా అక్కడి కొచ్చేసి ఆ అమ్మాయికి చెప్పేదా మనుకుంటున్నా, నేనున్నానని. అయినా మీరేవిటి, అయ్!

నేను బ్రహ్మాండంగా ఉన్నాను. కానీ క్రిందటి వారం మీద, ఇప్పటికి ఏవీ ప్రోగెస్ కాలేదు అని డాక్టర్ తిట్టాడు. నే నేమన్నానో తెలుసా? "సరే డాక్టర్! సరిగ్గా నెల రోజుల్లో మీరే నన్ను డిస్ చార్జ్ చేస్తారు చూసుకోండి," నవ్వుతూ చాలెంజ్ చేస్తే, "నీ ధైర్యం అందరికీ ఉంటే మా తలనొప్పి చాలా మటుకు తగ్గేదమ్మా" అనేసి వెళ్ళిపోయాడు.

మీరు ఎలా ఉన్నారు ప్రొఫెసర్? బరువు ఏమన్నా తగ్గారా? అయినా ఈ మధ్య కొద్దిగా కొవ్వు చేరిందిలెండి. ఓ మూడునాలుగు కిలోలు తగ్గితే మా రాజావారు ఇంకా అందంగా ఉంటారు. నేవచ్చేటప్పటికి waist line ఒకఇంచీ తగ్గించు కోండి. ఇహ మన్మథుడి ఉద్యోగం మీకు పడెయ్యొచ్చు.

అబ్బ! ఇంకో నెలరోజుల్లో ఈ హాస్పిటల్‌కి స్వస్తి చెప్పవచ్చు. మీ ఒళ్ళో తలపెట్టుకు పడుకుంటా సార్ అక్కడికొచ్చిన మొదటిరోజు. మరి ఉంటా, నర్స్ గొడవ భరించలేం.

కౌసల్య.

* * *

హైదరాబాదు,
3-5-73.

కౌసల్యా,

ఇక్కడ నేను బాగానే ఉన్నాను. గత రెండు రోజులుగా పని తగ్గింది. హాయిగా ఇంట్లోపడి ఉంటున్నా. అన్నట్టు నిన్న సాయంకాలం అన్నపూర్ణని మనింటికి రమ్మన్నా. వచ్చి నాకు వంటచేసి పెట్టింది. అంతా నీ వంటే, నువ్వు వడ్డించినట్లే వడ్డించింది. చాలా రోజుల తరువాత కడుపునిండా భోజనం చేశా. అదేవిటోగానీ కౌసల్యా, అందరు ఆడవాళ్ళు ఒక ఎత్తు, అన్నపూర్ణ ఒక ఎత్తు.

నిన్న రాత్రి ఇద్దరం సినిమాకి వెళ్ళాం. సినిమా బోర్. హీరో భార్యని మరచి ఇంకో అమ్మాయితో తిరగడం, హీరో భార్య ఆత్మహత్య చేసుకోవడం, హీరో మారిపోయి రెండు సీరియస్ పాటలు పాడి సన్యాసుల్లో కలిసిపోవడం, ఇదీ థీమ్. అసలు మన సినిమాల




స్టాండర్డ్ పడిపోయింది. ఏదో టైమ్ గడిచిపోతుంది కదా అని వెళ్ళిన నాకు అన్నపూర్ణ సాంగత్యం చాలా ఆనందం ఇచ్చింది సినిమా చూడడం మానేసి, ఆమెతో కబుర్లు చెబుతూ కూర్చున్నా. మధ్యమధ్యలో మరీ బావుండదని సినిమా చూశాననుకో. ఏవిటి, మూగదానితో ఏం మాట్లాడావనా? నిజమే, బదులు రాదు మనకి, మాటల రూపంలో. ఏవిటో ఆ అమాయక మోములో ఓ రకమయిన బాధ, భయం కనబడుతాయి. అవేనేమో నన్ను ఆమెకి దగ్గరచేసింది. ఆ బాధని దూరం చెయ్యా 'నిపిస్తుంది. అందుకే ఎన్నో జోక్స్ చెప్పా. విచిత్రవేవిటంటే ఆమెకి మన మాటలన్నీ వినబడతాయి. పకపక నవ్వుతుంటే, చూస్తూ కూర్చో-వాలనిపిస్తుంది. నిన్న రాత్రి సినిమా బాగాలేకపోయినా, ఆనందంగా గడిపాం. ఈ వేళ ఆఫీస్‌కి సెలవుపెట్టి ఇద్దరం గండిపేటకి వెళ్ళాం. ఆమెకి తెలియకుండానే చాలా దగ్గరయాను.

నిర్మల్.

• • •

ఊటీ
12-5-73.

మైడియర్ ప్రొఫెసర్,

మీ పెద్ద ఉత్తరం (అన్నపూర్ణతో చేసిన అడ్వెంచర్స్ వర్ణన) అందింది. ఇక్కడ నా హెల్త్ ఫరవాలేదు కానీ, ప్రోగ్రెస్ లేదు. ఒక్కసారి మిమ్మల్ని చూడాలని ఉంది, రాగలరా,

కౌసల్య.

* * *

హైదరాబాదు,
21-5-78

కౌసల్యా,

ఎలా మొదలుపెట్టాలో తెలియని ఉత్తరం ఇది. కానీ, నిజం దాచను. అన్నపూర్ణ నాకు చాలా దగ్గరయింది అని భయపడ్డా. నిన్న నిన్ను చూడ్దామని బయలుదేరా. 18, 19 తారీకులలో ఆమెకి కనబడలేదు నేను. కావాలని దూరంగా వచ్చా. నేను బయలుదేరే ముందు ఉపేగాలిలా దూసుకు వచ్చింది. ఆమె కళ్ళలో నీరు, అభ్యర్థన. చలించాను. చేతిలో ఏవో కాయితం చూసి, తీసుకున్నాను. కళ్ళు తిరిగాయి. అందులో ఏముందో తెలుసా కౌసల్యా! "ఐ లవ్ యూ! మీరు కాదంటే ఆత్మహత్య చేసుకుంటా" క్షణంసేపు ఏమీ పాలుపోలేదు. అన్నపూర్ణ వంకచూస్తే నా నిర్ణయంకోసం ఆశగా చూస్తోంది. నేను అవునంటే ఆ అమాయక మొహం వెలిగిపోతుంది, కాదంటే ఆ అందం మట్టికలిసిపోతుంది. నాలుగు రోజులు టైమ్ అడిగా. ఏంచెయ్యాలో తెలీడం లేదు. కానీ, నిజం ఏమిటంటే, నాకు తెలీకుండానే, అన్నపూర్ణ అంటే యిష్టం ఏర్పడింది. నువ్వే ఈ సమస్య నాకోసం పరిష్కరించు కౌసల్యా. నా మనస్సు చచ్చుబడిపోయింది. ఒక మూగపిల్ల జీవితం నందనవనం చెయ్యాలనుకుంటే ఓ పూజారి జీవితంలో నిప్పులు పోయాలి. కాదంటే, నేను చేసిన తప్పువల్ల (నేను చెప్పలేదు కదా, నాకు పెళ్ళయినట్లు) ఓ అమాయక మూగజీవి ప్రేమాప్యాయతలకు నోచక మరణిస్తుంది. ఇహ నీ నిర్ణయం కౌసల్యా!

నిర్మల్.

* * *

ఊటీ,
25-5-1978

నిర్మల్ బాబూ!

నా జీవితంలో ఎప్పటికీ సంతృప్తికరమైన జవాబు ఇయ్యలేని ప్రశ్న వేశారు. నేను మీకు దూరం అవడం, నాకు ప్రాణం పోవడంతో సమానం. కానీ నేను కాదు అంటే, మీరన్నట్టు "ఒక అమాయక మరణిస్తుంది," ఆ మాట చాలండీ నా నిర్ణయం తీసుకునేందుకు. కానీ, నిర్ణయం చెప్పేముందు కొన్ని విషయాలు చెప్పాలండీ.

ఓరోజు మీరు నేను పార్కులో కూర్చొని ఉండగా మీ మరదలు పిల్లపై జోక్ వేశారు గుర్తుందా? అప్పుడు ఎలా ఉంటుంది మీ మరదలు అని నే నడిగితే "నీకన్నా బెటర్" అన్నారు నవ్వుతూ. నన్ను ఉడికించి ఆనందంతో చప్పట్లు కొట్టారు. అది అవడానికి చిన్న సంఘటన అవ్వచ్చు. కానీ కొద్దిగా జాగ్రత్తగా ఆలోచించండి. ఒక నిజం విదితమౌతుంది మన మిద్దరం భార్యా భర్తలం కావచ్చు. అయినా, జీవితంలో

అన్నీ కలిసి పంచుకుందాం అని పెళ్ళిలో ప్రామిస్ చేసుకొని కూడా, పంచుకుంటూ ఉన్నా, కొన్ని సెన్సిటివ్ స్పాట్స్ ఉంటాయి. భార్యకి భర్తపై నమ్మకం, భర్తకి భార్యపై నమ్మకం, ఇవన్నీ వట్టి మాటలేనండీ. నన్ను మీరు నమ్మారు అని ఈ క్షణంలో మీరు అనవచ్చు. కానీ, మీరు యింట్లో లేనప్పుడు మా బావ నాలుగుసార్లు మన యింటికొస్తే మీ నమ్మకం ఉంటుందా? మీ కిష్టమేనా? ఆ నిస్పృహయతలో నాపై కోపం చూపించవచ్చు.లేదా మీలో మీరు కుమిలి పోవచ్చు.

అది నమ్మకం లేకపోవడం కాదు సార్. మనిషిమీద ప్రేమ ఎక్కువైన నాడు, ఇది నా సొత్తు అనే ఫీలింగ్ వస్తుంది. అసలు ఆ ఆలోచన హృద యాన్ని ఎనలేని హాయితో నింపివేస్తుంది. అప్పుడే, ఆ మనిషి మనకి కాకుండా పోతారేమో అనే ఆందోళన మొదలయి దాని నుండి ఈర్ష్య ఉద్భవిస్తుంది. అది సహజ మానవ ప్రవృత్తి. దీనికి అవ రోధం కల్పిస్తే వచ్చేది మరింత నిస్పృహ యత, ద్వేషాగ్ని.

మిమ్మల్ని ఎంతగా ప్రేమించానంటే, మీ కంపెనీ ఇంకొకరికి, అందునా నా జాతివారికి ఒక్క క్షణం ఇవ్వాలంటే కష్టం అనిపించేది. కానీ చదువుకున్న దాన్ని కాబట్టి ప్రవర్తన మలుచుకున్నా. ఈవేళ మీ కంపెనీ ఇంకొకరికి శాశ్వ తంగా ఇవ్వాలా వద్దా అనే నిర్ణయం తీసుకోమన్నారు. మీ సుఖమే నా సుఖ మనుకొని మీ ఆనందానికి అడ్డుపడకుండా దూరం జరిగిపోయి మీరు అన్నపూర్ణ గారితో ఆనందంగా వుంటే అందులో నుండి నేను ఆనందం పొందడం నిజ మైన ప్రేమ కాదు. అది చేతగానితనం. నేను సుమతిని కాను, సీతనూ కాను. మిమ్మల్ని వదులుకోలేను. ఈ సంఘటన తరువాత ప్రేమించనూ లేను. అలా అని మీకు అడ్డుపడి నా చేతుల్లోనుండి మీరు జారిపోకుండా చూసుకుంటే మీకు నేనేదో అన్యాయం చేశాననే ఆలోచన మీలో ఉండిపోతుందేమో। ఆ తరువాత మీతో నేను చేసే కాపురం నేను ఊహించదల్చుకోలేదు. మీరు సాధారణ మనుష్యులు. నేను అంతకన్నా సాధారణ మయిన స్త్రీని. నాకు కాకుండా పోయే మిమ్మల్ని ఆపదల్చుకోలేదు. అయితే, అన్నపూర్ణగారికోసం మీరేదో త్యాగం చేస్తున్నట్టు బిహేవ్ చేసి ఆమెని కించ పరచకండి. అన్నపూర్ణగారు అనాకారి అయితే, మీరు నిర్ణయం తీసుకోవ డంలో నా సహాయం అవసరం ఉండేది కాదు. పిచ్చి ప్రొఫెసర్। మనిషి త్యాగం చెయ్యడం చాలా తక్కువ. అందునా ఓ అమ్మాయిని వివాహం చేసుకోవడంలో త్యాగం అసంభవం. స్వార్థానికే త్యాగం తొడుగు తొడుగుతారు అందులో.

29న నేను డిస్చార్జ్ అవ్వాలి అను

కున్నాను. అనుకున్నట్టే అవుతున్నాను. అయితే కేవలం హాస్పిటల్‌నుండి కాదు, ఈ లోకం నుండే. ఇహ నావల్ల మీ కేం సమస్య ఉండవు. తలచుకుంటే నవ్వు వస్తుంది, మనిషి మరు నిమిషంలో ఏం జరుగుతుందో తెలియక, కొన్ని ఏళ్ళవరకు ప్లానువేసి నిరాశ చెందుతుంటాడు. వచ్చి మీ వళ్ళో పడుకుందాం అనుకున్నా. ఇప్పుడు అది సాధ్యంకాదు అనిపిస్తుంది. బ్రతికుండగా కాకపోయినా (ఈ ఉత్తరం మీకు 29న అందుతుంది. ఆరోజు కౌసల్య వెళ్ళిపోతుంది) కనీసం పోయినతరువాత ఒక్కసారి నా తలని మీ వళ్ళో పెట్టుకోరూ, Please! ఏయ్ Professor! నా కోరిక తీర్చకపోతే దయ్యం అవుతా జాగ్రత్త. ఐ విష్ యు ఆల్ ది బెస్ట్.

కౌసల్య.

పి. ఎస్. మీ మీద నాకేం కోపంలేదు ప్రొఫెసర్‌గారూ! మీ వెయిస్ట్‌లైన్ జాగ్రత్త, ఒక్క ఇంచీ తగ్గితే, ఎన్క్ధుడికి

* * *

ఉత్తరం, దాని తరువాత టెల్రిగాం (కౌసల్యా ఎక్స్‌పైర్డ్. స్టార్ట్ ఇమ్మీడియట్లీ. డాక్టర్ చంద్ర) చదివిన నిర్మల్ కొయ్యబారిపోయాడు. అనాలోచితంగా, అచేతనంగా తన డైరీతీసి 17-4-1973 పేజీకి తిప్పాడు.

1-4-1973 ఈ వేళ ఒక గమ్మత్తయిన ఆలోచన వచ్చింది. కౌసల్య నేను తనకి కాకుండాపోతానని తెలిస్తే ఎలా రియాక్ట్ అవుతుందో చూడాలని వుంది. నా వ్రాయబోయే కథకి ఇది మంచి ప్లాట్. మెల్లిగా, కౌసల్యకి వ్రాసే లెటర్స్‌లో తనకు దూరం అవుతున్నట్టు వ్రాస్తా! నాకు వచ్చిన ఫలితాన్నిబట్టి ఆడవాళ్ళంతా ఇంతే అనవచ్చా, లేక నా డియర్ కౌసల్య ఒక్కతీ వేరా?

కౌసల్యా మై డార్లింగ్! ఇది నీకో పెద్ద పరీక్ష. రచయితని పెళ్ళిచేసుకున్నందుకు కష్టపెడుతున్నాను. కానీ ఏం చెయ్యను? నీ రియాక్షన్ నా కథకి మూలం, ప్రాణం. ఇది రచనా జగత్తులోనే మొదటిసారి, చివరిసారి అవ్వాలి. ఒక రచయిత తన భార్యకి పరీక్ష పెట్టి మెటీరియల్ తీసుకోవడం. నా రచన మానవతత్వ శాస్త్రానికే ఒక కొత్త రూపం ఇస్తుందిరా కౌసల్యా డియర్! కొద్ది రోజులు బాధ నీకు తప్పదు మరి. ఆ తరువాత ఈ రచనలకి, ఉద్యోగానికి స్వస్తిచెప్పి, నువ్వు నేను ఊటీలో ఓహ్! ఆ రోజుకోసం పిచ్చివాడిలా ఎదురుచూస్తున్నా కౌసల్యా! ఈ విషయం నీకు చెప్పినప్పుడు నీ మొహం ఫొటో తీసుకుంటా!

* * *

తల ఎత్తిన ప్రశాంత్ కళ్ళకి కుమార్ సంఘమిత్రలు మసగ్గా కనిపించారు. కనుకొనల్లో నిలిచిన నీటిబిందువులు




ఇహ ఆగలేమంటూ రాలిపడ్డాయి. సంఘమిత్ర చేతిలో రెడ్‌వైన్ గ్లాసు వణుకుతోంది. కుమార్ చేతిలో ఖాళీ డ్రింక్ సీసా!

"ఎంరా ప్రశాంత్, మనం గెల్చినట్లే కదా!" కుమార్ నవ్వుతూ అడిగాడు.

ప్రశాంత్ కళ్ళు ప్రశ్నార్థకంగా చూశాయి. సంఘమిత్ర గొంతు సవరించుకొని, "ఒక్క క్షణం! మీరు ఆ కథని నిన్న చదివారు కానీ, నేను నాలుగేళ్ళ కిందట చదివా! కాబట్టి నేను కూడా వాదనలో ఉన్నట్టే" అన్నాడు.

"వండ్రఫుల్" కుమార్ ఉత్సాహంగా అన్నాడు. "రచయిత ఈ కథలో ఓ ప్రయోగం చేశాడు. ఒక లేని సమస్యలో భార్యని ఇరికించి, ఆమె దాన్ని ఎలా ఛేదించుకొస్తుందీ చూద్దాం అనుకున్నాడు. అతనికి అనుకోని ఫలితం వచ్చినా, మన కొచ్చిన సమాచారం గురించిగూడా ఆలోచించాలి"

సంఘమిత్ర తన సోఫాలో సర్దుకు కూర్చున్నాడు. "మీరు బయటివారు, మీ కొచ్చిన లాభం చూసుకుంటున్నారు గానీ, రచయితకి జీవితంలో వచ్చిన విపత్తు గమనించడం లేదు. ఆ రచయిత భార్య రచయితని ఎంత ప్రేమించిందో ఆమె వ్రాసిన తొలి, తుది జాబుల్లో తెలుస్తోంది. అటువంటి భార్యని, పోనీ ఆడమనిషినీ, అదీ కాదనుకుంటే ఓ మనిషిని, నేరం ఏం లేకపోయినా, తన రచనకోసం స్వార్థపూరితమైన రచయిత అంత హృదయక్షోభ అనుభవించేటట్లు చేశాడు. ఆ అమ్మాయికి 25 ఏళ్ళు అనుకున్నా, ఇంకో 40 ఏళ్ళ జీవితాన్ని మింగి

వేశాడు ఆ రచయిత. అయినా మీరు రచయితనే సపోర్ట్ చేస్తున్నారు" సంఘమిత్ర రుమాలుతో మొహం తుడుచుకున్నాడు.

"ప్రొఫెసర్, రచయిత ఆ అమ్మాయిని టెస్ట్ చేశాడు. అనుకున్న రియాక్షన్ కాక మరేదో వచ్చింది. అది అతని తప్పు కాదు. అది ఆ అమ్మాయి బుద్ధిలేనితనం. ఆత్మహత్యతో ఏం సాధిద్దాం అనుకుంది? అయినా చదువుకున్న వాళ్ళు అలా అజ్ఞానంగా "

"ప్రశాంత్ గారూ!" సంఘమిత్ర దాదాపు అరిచాడు "ఆ అమ్మాయిని వది లెయ్యండి. అసలే వంట్లో బాగాలేక భర్తకి దూరంగా వుంది. ఆమె ఆలోచనలు అటువంటి పరిస్థితుల్లో అలా ఉండక ఎలా ఉంటాయి మరి?"

"కరెక్ట్! అలా అనండి ఒప్పుకుంటా. రచయిత ఎక్స్‌పెరిమెంట్ చెయ్యడం తప్పు అంటే నాకు వళ్ళు మండుతుంది. ఎక్స్‌పరిమెంట్ కరెక్టే! కానీ సందర్భం తప్పు. టిబితో బాధపడే భార్యకి ఊరట కలిగించే మాటలు చెప్పడంగాక వెర్రి వాడిలాగా అప్పుడు తన ప్రయోగం మొదలుపెట్టాడు. దాంతో తిప్పికొట్టింది. దీన్ని ఆధారంగా తీసుకొని మీరు అసలు రచయిత ప్రయోగాలే చెయ్యకూడదూ అనడం హాస్యాస్పదం. ఈ కేస్ వేరు. నేనూ మీతో ఇక్కడ ఒప్పుకుంటా. రచయిత ఓ విధంగా భార్యని హత్య చేసినట్లే. ఎందుకంటే అనారోగ్యంతో బాధపడుతున్న..."కుమార్ ఆగిపోయాడు.

సంఘమిత్ర సోఫాలోనుండి లేచి నుంచున్నాడు. అతని గుప్పెట్లు గట్టిగా మూసుకున్నాయి. "కుమార్ కరెక్ట్‌గా చెప్పాడు. ఐ ఏమ్ ఎ మర్డర్! భార్యని చేజేతులా చంపుకున్నాను. కౌసల్యా! నన్నుకూడా నీతో ఎందుకు తీసుకువెళ్ళ లేదు? ఎందుకు తీసుకెళ్ళలేదు." పిచ్చిగా అరుస్తూ, ఏడుస్తూ లోపలికి పరుగెత్తిన సంఘమిత్రని చూసిన కుమార్ గబగబా మాగజైన్‌లో ఆ కథని మళ్ళీ తిరగేశాడు. "ది ఎక్స్‌పెరిమెంట్, బై ప్రొఫెసర్ నిర్మల్ సంఘమిత్ర" చదివిన కుమార్ కళ్ళలో రెండు నీటిబిందువులు నిలిచాయి. ప్రశాంత్‌కి చూపిస్తూ తల పంకించిన కుమార్ కళ్ళు ఆ నీటి బిందువులనుండి పీకొక్కలు తీసుకున్నాయి.





# నాకు నచ్చిన నా కథ

నా ఇరవైయవ ఏట మొదటి కథ రాసేను. అది "భారతి" మాస పత్రికలో అచ్చయింది. 1952 నించి 1981 వరకూ నేను రాసిన కథలు కేవలం అరవై. వాటిలో నాకు నచ్చిన కథలు "నిద్ర పోయిన దేవుడు", [illegible]

ఇంక కథలు రాయటం గురించి, రచనా ప్రక్రియ గురించి కొద్దిగా ప్రస్తావిస్తాను. రాయాలన్న తహతహ ఉన్నవ్యక్తికి రాస్తూ ఉంటే ఆ తహతహ ఎక్కువౌతుందే తప్ప తగ్గదు. [illegible] ప్రచురితం అవుతున్న కొద్దీ ఆ తృష్ణ ఎక్కువౌతూ వెళ్తుంది. రచయిత ఒక ధ్యేయం పెట్టుకోకండా ఏ ప్లాటు తడితే దాని మీద రాసుకుంటూ పోతే కథల్లోని నాణ్యత తరుగుతుంది. ఒక ప్లాటు తడితే వెంటనే డైరీలో రాసుకొని, [illegible] రెండు నెలలు పోయాక, వాటిల్లోంచి మంచిది ఎన్నుకొని కథ రాస్తే బాగుంటుంది. రాసిన కథని [illegible], రెండు నెలలో పడేసి ఉంచి, తరవాత చదువుకొని, బాగుందనిపిస్తే మిత్రులకి చదివి వినిపించి, వారి సలహాలు నచ్చితే పాటించి కథ అప్పుడు ఫెయిర్ చేసి పంపడం మంచిది. కథ 'బాగుంది అన్న వారికన్న కథలో లోపాలని ఎత్తి చూపగలిగే వారే ఆప్తులని భావించాలి!'

ఏ కథన్నా, నవలన్నా మానవుణ్ణే ముందుకు తీసుకు వెళ్లాలి కాని వెనక్కి కాదు. మూఢనమ్మకాలూ, కులతత్వాలు, మతమౌఢ్యాలు, దెయ్యాలు, భూతాలు, చేతబడులు, అంధయుగపు ఆచారాలు, సాంప్రదాయాలు, ధన మదాంధత, అధికార మదాంధత, భూకామందుల అరాచకం వీటికి ప్రాణంపోసే రచనలు చేసే రచయితలు తమకు తాము ఆత్మవంచన చేసుకోడమేకాక, ప్రజల్ని కూడా తప్పుదారిన పట్టిస్తున్నారని నా అభిప్రాయం. ఇటువంటి రచనలు చేసే కన్న ప్రేమకథలు ప్రేమనవలలూ రాయడం వెయ్యిరెట్లు నయం! బరువు రచనలు వద్దు, తేలిక రచనలే కావాలని, అటువంటి రచనలనే ప్రోత్సహించే ప్రచురణా పరిశ్రమకి పాఠకుల తరఫున నా మనవి. "కొత్తదనానికి తావివ్వండి.

ప్రగతి ప్రథాన్న పాఠకులని ఆలోచింపచేసే బాధ్యత మీకు కూడా ఉంది- రచయిత చూపదలుచుకున్న ప్రపంచాన్ని, పాఠకుడికి కన్పడేటట్టు చేసే కిటికీ మీరు! స్వేచ్ఛా ప్రబంధం వేపు ఉండే కిటికీని మూసేయకండి!

*— మంథా వెంకట రమణారావు*

# నిద్రపోయిన దేవుడు

మొదటి ఆట సినిమా ఆరంభం అయినట్టుంది. ఆ సెంటరులో ఉన్న నాలుగు హాల్సులో నుంచి విడిరికార్డుల సంగీతం వినిపించడంలేదు.

ఆ ప్రదేశం రద్దీగా వుంది- ఏలూరు బందరురోడ్డు కలుస్తున్న సెంటరది. కృష్ణ కాలవమీంచి మరొక దారి, నేనూ ఉన్నానని మొహమాటపడుతూ వాటిని కలుస్తోంది.

ఆ ప్రదేశమంతా, అందంగా అలంకరించుకొని పోతున్న స్త్రీ పురుషులతో మ త్తెక్కి ఉంది. ఒకరి మీద ఒకరు ఒరిగి, నవ్వుకుంటూ కార్లలో పోతున్నారు, ఒకర్నొకరు అంటిపెట్టుకొని స్కూటర్లమీద పోతున్నారు. ఏవో కబుర్లు గబ గబా చెప్పేసుకుంటూ నవ్వేసుకుంటూ రిక్షాలలో పోతున్నారు. అన్యోన్యత, ప్రేమ అంటే ఇదే సుమా అని రోడ్డుమీదపోయే ఏకాకిగాళ్ళకి భ్రమ కలిగిస్తున్నారు.

జారిపోయే పైటలు పీలికల్లా క త్తరించబడ్డ రవికలు, అవి బయటపెట్టే స్త్రీల సోయగాలు పలుచటి రవికలగుండా వెనుకనించి కనుపించే బ్రాసరీల బెల్టులు, మెడమీదికి జాలువారే మల్లెపూల దండలు, అతివేగంగా కనుపించి మాయ మౌతున్నాయి— ఆ ప్రదేశాన్నంతా ఒక విధమైన మైకపు వాతావరణంలో ముంచుతూ.

అక్కడున్న పూల అంగళ్ళలో రాసులుగా పోసిన మల్లెలు, మరువం, దవనం, గులాబీపూలు సువాసనలు వెదజల్లుతూ చాటుతున్నాయి అందాన్ని కొనుక్కోమంటూ.

ఆ జనసందోహం చల్లటిగాలి, పూలపరిమళం, మెరుపుల్లా మెరిసిపోయే స్త్రీపురుషుల జంటలు ఇవన్నీ ఆ వాతావరణంలో లిప్తకాలమైనాసరే ఇరుక్కున్న ప్రతి ఒంటరి వ్యక్తిలోనూ తియ్యటిబాధ ఏదో భావోద్రేకం ఒంటరితనం అంటే విరక్తిని కలిగిస్తున్నాయి.

ఈ "చిన్న" రహదారి మాత్రం రద్దీగా లేదు. ఇది కృష్ణకాలవని అనుకొని ఉంది. వీధి పొడుగైనదే కాని, ఉన్నవి రెండే కాంతిలేని విద్యుద్దీపాలు- ఆరోడ్డు నిశ్శబ్దమే కాని, నిర్జనం కాదు. కాలినడకని వచ్చిపోయే జనం మాత్రం ఎక్కువగానే ఉన్నారు.

రోడ్డు కిరువైపులా ఉన్న ఇళ్ళు మట్టిగోడలు తాటికమ్మలవి వాటికి కొత్త ముందుగా పూర్తిగా తాటికమ్మలతో కట్టిన చిన్న పాకలు గడ్డికుప్పల్లా ఉన్నాయి.

ఆ వీధిలో, మున్సిపల్ దీపానికి వీలైనంత దగ్గరగా, తాటికమ్మల పాక ముందు నిల్చుంది కాళింది.

పడీపడనట్టుండే ఆ దీపాల వెలుగులో ఒక స్త్రీమూర్తి అక్కడ నిల్చుంది అని పోల్చుకుందుకి మాత్రం అవకాశం ఉంది- పొడుగైన మనిషే సన్నంగా ఉంది; ముఖం కోలగా ఉంది. అందమైనదే అయిఉండొచ్చు నల్లగా ఉందో చామనఛాయో కళ్ళు అందమైనవో కావో ఇవన్నీ కాస్తదూరాన రోడ్డుమీద పోతూ ఆమెను చూసి ఆమె గురించి ఆలోచించిన వ్యక్తి ఊహించుకోవల్సిందే.

సైకిల్ హేండిల్‌బారుకి ఒక వెదురుపూల సెజ్జ తగిలించి వచ్చిన యువకుడు, సైకిలు వేగం తగ్గించి, సజ్జలోంచి ఒక మల్లెపూలదండ తీసి కాళిందిమీదికి విసిరాడు—అందుకు తయారుగా ఉన్న కాళింది దండ అందుకొని, కొప్పులో ముడుచుకుంది.

"డబ్బులిస్తావా? పద్దు యాభై పైసలవరకూ పెరిగిపోనాది, ఈ దండతో " అన్నాడు కుర్రాడు, కాలు నేలకి దన్నుపెట్టి, సైకిలుమీదనే కూర్చొని.

ఒక రాగం వాయించేముందు, వీణాతంత్రులు మీటుతాడు వాద్యగాడు - ఆ స్వరశబ్దాలు, అసలు రాగంకన్నా హాయిగా వినిపిస్తాయి. కాళింది మాట్లాడి నప్పుడు ఆ కంఠస్వరం, ఆ స్వరశబ్దాలంత హాయిగా వినిపించింది. గొంతు హాయిని కలిగించినా, ఆ పలుకుల అర్థం అపశ్రుతి పలికింది- "లేదు రాజూ, మరో రోజు ఓపికపట్టు " వినీవినిపించనట్టు అంది కాళింది.

"ఇవాళకూడా బోణీ పడనేదా ?" రాజు అన్నాడు. ఇంక ఈ మనిషికి పువ్వులు అరువివ్వడం ఉత్త దండుగే అని ధ్వనించే గొంతుతో.

కాళింది జవాబివ్వలేదు. అడ్డంగా తల ఊపింది. కుర్రాడి గొంతులో ఆశా భంగం కాస్త విచారం ధ్వనించేయి. "పెదయ్యని టీ తాగడానికి డబ్బులడిగితే నీ దగ్గర బాకీ వసూలుచేసి కర్చుపెట్టుకోమన్నాడు."

కాళిందికి రాజు మీద జాలేసింది. ఎంతో కలుపుగోలు మనిషి. ఏ పని

చెప్పిన కాదనకుండా చేస్తాడు. సాయపడదామని, మంచివా డనిపించుకుందామని ప్రయత్నిస్తాడు. కాళింది సాదరంగా అంది. "రాజా నాయరు హోటల్లో నా పద్దులో రాసి టీ త్రాగు_ నీ బాకీలో చెల్లుకొట్టన్లే !"

రాజు పకాల్న నవ్వేడు. "ఆ పనీ అయింది_ అక్కడ కూడా ఐదుపైచిల్లర వరకూ పెరిగిపోయిందిగా నీ పద్దు. టీ కాదు, గలాసుడు మంచినీళ్ళన్నా ఇవ్వ నన్నాడు నాయరు నీ పద్దుమీద. సరే. ఉన్నప్పుడే తీర్చు" ఆ మాటలని, పూల దండలు చీకటిలోకి ఇటూ అటూ విసురుతూ పోయేడు. చీకటి ముసుగులో దాగున్న కాళిందిలాటి ఆకారాలు వాటని అందుకున్నాయి.

కాళింది కళ్ళలో నీళ్ళు తిరిగేయి. అవి రాలి చెక్కిలిమీద పడలేదు. కను కొలకులలోనే ఇంకిపోయేయి_ నీరసంవల్ల కాళ్ళు వణుకుతున్నాయి.

నిల్చొని గంటకిపైగా గడిచింది. కాళ్ళు బాగా పీకుతున్నాయి. వెనుకనున్న పాకలోకి పోయి, మంచంమీద వాలి కొంతసేపు విశ్రాంతి తీసుకోవాలని మనసు తహతహ లాడింది. కాని రావల్సిన డబ్బు చెయిజారిపోవచ్చు. అలా అనుకొనే విశ్రాంతి తీసుకుందుకి భయపడుతూనే, నిన్నా మొన్నా రెండో ఆట వదిలి మనుషులంతా ఎవరిళ్ళకు వాళ్లుపోయి ఆఖరికి రోడ్లమీద కొట్లాడుకునే ఊరు కుక్కలు మిగిలేవరకూ నిల్చుంది. ఫలితం లేకపోయింది.

నిన్న రాత్రి నిద్రపట్టలేదు. బాబు ఒంటిమీద చెయ్యివేసి మంచంపక్కనే కూర్చుంది. బాబు రాత్రల్లా కలవరిస్తూనే ఉన్నాడు. జ్వరం ఏమీ తగ్గలేదు_ పొద్దున్న కళ్లువిప్పి తనకేసి చూసేడు జాలిగా_ ఏడుపొచ్చింది. "ఆకలేస్తోందా బాబూ ! జావ తాగుతావా !" _ద్రాక్షపళ్ళు కావాలన్నాడు. ఎక్కడా రూపాయి అప్పుపుట్టలేదు. తన పెళ్ళినాడు, మగపెళ్ళివారికి పానకం బిందెలంటూ నాన్న పెట్టిన చిన్న ఇత్తడిగిన్నె అరిగిపోయి, చిల్లులు పడి, మూలన ఉన్నదాన్ని మూడు రూపాయల కమ్మి, బాబుకి పళ్లు, డాక్టరు రాసిచ్చిన మందు మాత్రలు కొని తెచ్చింది. కాని సాయంత్రానికి జ్వరం మళ్ళీ తిరగబెట్టింది.

చేతిలో రెండు రూపాయలు పెట్టనిదే ఆ పేటలో ప్రాక్టీసుపెట్టిన L M P డాక్టరు రానన్నాడు. కాళ్ళు పట్టుకోగా, వచ్చిచూసి ఇంజక్షన్లు కొనుక్కురమ్మని చీటి రాసిఇచ్చేడు. తన దగ్గర అవి లేవన్నాడు. రేపింక డబ్బు చూపనిదే కుర్చీ లోంచి లేవడు.

నిల్చొని ఒక గంటన్నా గడవందే మొహం తిరుగుతోంది. పగలు ఎండ బాగా కాసింది. చీకటిపడినా వేడి తగ్గలేదు. రోడ్డుమీద వచ్చిపోయే జనం రద్దీ

తగ్గింది. సినిమా ఆరంభం కాకముందు, అవగానే ఒక అరగంట వరకూ చాలా మంది ఇటూఅటూ తిరిగేరు. ఒకరిద్దరు దగ్గరగా వచ్చేరు. ఆశగా ముందుకి వెళ్ళగానే పలాయనం. నోరెత్తి పిలవడం అంటే ప్రాణం పోయినట్టయింది. ఆ మాటలు తనకి చేతకావు. మహా ఐతే చిన్న పొడిదగ్గు దగ్గుతుంది ముందుకెళ్ళిం. అంతకన్న దిగజారిపోలేదు.

నవ్వుకుంది జాలిగా-ఇంకా ఏం దిగజారిపోవాలి- ఆ నవ్వు పైకి వినిపించక పోయినా, భయంకరంగా మారి మనసుని దొలిచింది- ఆ దొలిచిన మనసులో తనని, కొడుకుని వదిలి, నాటకాలదానితో మద్రాసు పారిపోయి మరి కనుపించని తనకు పుస్తెకట్టి అగ్నిసాక్షిగా పెళ్ళాడిన మనిషి కనుపించేడు. "నేను దాంతో పోతున్నాను. ఇంక నీకూ నాకూ ఏమీ సంబంధం లేదు-నువ్వేలాపోయినా పో!" అని నిర్మోహమాటంగా చెప్పి జాలే కనికరం లేకుండా నట్టేట తన్ను ముంచిన మనిషి ఆ క్షణం ఒక్కసారి మెదిలేడు. ఆ మనిషి మరిలేడు. ఆ ఆడది, ఎక్స్ట్రా వేషాలు సంపాదించుకొనే తాహతుకి వచ్చేక ఇతన్ని తరిమేసేక స్టూడియోల చుట్టూను మద్రాస్ రోడ్లమీదా పిచ్చివాడిలా ఏళ్ళతరబడి తిరిగి క్షయవచ్చి దిక్కుమాలిన చావు చచ్చేడు- తన వావలేకుండా ఇలా దిక్కుమాలిన బతుకు బతుకుతున్నది.

ఎదురుగా పాకముందర నిల్చున్న స్త్రీ కాళిందిలా ఊరుకొని దిక్కులు చూడటంలేదు. రోడ్డుమీదపోతున్న అందర్నీ మెల్లిగా పలకరిస్తోంది. "ఇదుగో అబ్బాయ్ నిన్నే! ఇలారా! ఒక్క మాటేను." కొన్ని పదాలు నేర్చిన చిలకలా అవే మాటలు పదేపదే వచ్చిపోయేవాళ్ళని చూసి అంటోంది. పల్లెటూరి నించొచ్చిన రైతులా ఉంది. నోట్లో చుట్ట, చేతిలో సంచీ, సగం చేతుల బనియన్ వేసుకొని పంచ కట్టాడు. కొత్త తటపటాయిస్తూ నిల్చున్నాడు. వెంటనే ఆమె అతన్ని రెక్కపట్టుకొని చీకటిలోకి లాగుకొని పోయింది. రైతు అడుగుతున్నాడు "ఎంతేవిటి! నా దగ్గర మూడ్రూపాయలే మిగిలినాయి. రెండు రూపాయలు పొద్దుట కారు కివ్వాలి. నీకు రూపాయికన్న ఎక్కువివ్వను!" కొత్తవాడిలా ఉన్నాడు. భయపడుతున్నాడు. "ముందు రావయ్యా" అని పోతుని పులి ఎగరేసుక పోయింది ఆ పాకలోకి.

పక్కనే కొద్దిదూరంలో ఉన్న పంకజం కాళింది దగ్గరికి వచ్చింది. నవ్వుతూ అంది "సాయిత్రికి తగిలింది మంచి బేరం. సచ్చుమొహం వాడునూ బొడ్డుకాడ దాచుంటాడు నోట్లకట్టలు. మూడురూపాయలే ఒట్టుకుని ముండమొకం సూడ్డానికన్నా దయర్యముంటాదా ఆ చచ్చినోడికి?"

కాళింది నవ్వడానికి ప్రయత్నిస్తూ అంది. "నువ్వేం తక్కువదానివా" ఆ మాటకి పంకజం పొంగిపోయింది గర్వంతో. కాళింది భుజంమీద చెయ్యివేసి కళ్ళలోకి చూసి అంది "ఏటింత నీరసంగా వున్నావ్ ఏది సూడనీ? ఏటయింది ఒంట్లో బాగులేదా?"

ఈ మాటలకి కాళింది కళ్ళవెంబడి నీళ్లు బొటబొట రాలాయి.

"ఈయేళ కూడు తిన్నేదా!" పంకజం అడిగింది ఆత్రంగా.

"బాబుకి మూడురోజులై జ్వరం. ఒకటే కలవరింతలు. ఎలాగుందో? మందు కొనాలి, డాక్టర్‌కి ఫీజివ్వాలి. ఏమిటో పంకజం దేవుడు నన్ను తీసుకుపోతే బాగుణ్ణు- ప్రాణం తీసుకుందుకి నాకు ధైర్యంలేదే- బాబు మొహమే కళ్ళకు కడుతోంది- వాడ్ని పెంచి పెద్దచేసి, ఏదో చెయ్యాలని ఉంటుంది- అదంతా అయే పనా?" గాద్గదిక స్వరంతో అంది కాళింది.

పంకజం కోపంగా అంది, "అయితే నిన్నటికాడ్నించి ఏటీ తిన్నేదన్న మాట- మడిసివి బాగుంటే కదా డబ్బులు సేతికొస్తాయి- ఊదితే ఎగిరిపోయి నట్టుంటే అయినట్టే- ఉండు టిఫిన్ తెస్తాను." అంటూ పంకజం ఆ వీధి మొగలో వున్న నాయరు హోటలుకేసి నడిచింది- చేతిలో ఒక పొట్లంతో తిరిగి వచ్చింది- కాళింది చేతిలో ఉంచుతూ అంది. "మాసం సేపలు కాదులే- మీ బాపనోళ్ళు తినేవే- పూరీలు, మసాలా కూరా తెచ్చాను తిను "

ఆ ఆత్మీయతకి కాళింది వెక్కి వెక్కి ఏడ్చింది- పంకజం బలవంతంచేసి తినిపించింది- తిన్నాక కాస్త ప్రాణం కుదుటపడింది- రెండు రోజులై మంచి నీళ్ళే ఆహారమయ్యేయి. నిన్నరాత్రి దయతలిచి నాయరు ఒక కప్పు టీ ఇచ్చేడు.

పంకజం తన జాగాకి పోయింది. టైటు ప్యాంటు, ఎర్రటి బుష్‌షర్టు, మెడ చుట్టూ రుమాలు చుట్టుకొని అక్కడ ఆగిన ఒక యువకుడ్ని ఆకర్షించడానికి ప్రయత్నిస్తూ "ఇదిగో అబ్బాయ్ ఇలా రా ఇటు అట్టా యిస్పిత్రంగ సూత్తావేం ? యేవూరు మంది" అని లాలించింది. ఆ యువకుడు ఒక చిరునవ్వు నవ్వి, ఆమె వేసిన వలనించి తప్పించుకొని ముందుకుపోయేడు. ఆ వల ఆ ఎర్రలాల్చీ అబ్బాయికైతే తగల్లేదు కాని, ఆ వెనకనున్న ఆసామీకి తగిలింది. మధ్యపాపిడి తీసుకున్న మధ్యవయస్కుడు, జుత్తు అక్కడక్కడ పండిపోయింది. "యెంతిచ్చుకుంటావేటి?" అన్నాడు. పంకజం పెంకిగా అడిగింది "ఎంతిస్తావేటి?" అతడేం తక్కువ తినలేదు. "ఎంతడుగుతే అంత!" అని, ఛలోక్తికి నవ్వుకున్నాడు. "గట్టోడివే! నాలుగున్నయ్యా!"




అంది. "ముష్టోడి ననుకున్నావా బంగారు పిసికా!" అంటూ ఆమెను సమీపించి. నడుంచుట్టూ చెయ్యివేసేడు. పంకజం గలగలా నవ్వింది.

కాళింది కాస్త ముందుకు జరిగింది, దీపం కాంతి బాగా పడేటట్టు తనమీద. ఆ నాలుగు రూపాయలూ తనకే దొరికిఉంటే, ఈ అవద గట్టెక్కి ఉండును. కాని తనకి ఆకర్షించే శక్తి పూర్తిగా పోయింది. తన్నుతాను మోసంచేసుకొని లాభంలేదు. బలంలోను, పుష్టిలోనూ, యవ్వనంలోనూ, ప్రచండమైన ఆకర్షణ శక్తి ఉంది. అందం కొద్దిగానే వున్నా, అవుంటే అది నూరు రెట్లు ఎక్కువ అవుతుంది. అందం ఎంతఉన్నా అవి లేకపోగానే నూరురెట్లు తగ్గిపోతుంది. "ఇపుడు నువ్వు రెండో కోవకి చెందుతావు కాళింది" అని అన్నాడు, తనని వదిలిపోయే ముందు తనకి ఒకనాడు పుస్తెకట్టిన ఆ మగాడు.

బాబుని పెంచి పెద్దచెయ్యాలి. పనికోసం సహాయం అర్థిస్తే వాళ్ల సహాయం చేసేముందు కోరేది, నోటితో అనకపోయినా, చూపులతో తనని_ పుట్టినింట ఎవ్వరూ లేరు. తండ్రి కళ్ళుమూసేడు. తల్లి చిన్ననాడే పోయింది. సవితితల్లి తన అన్నదమ్ముల దగ్గరికి పోయింది తన పిల్లలతో.

"నా మాటినుకో అమ్మా! ఆ రెడ్డిబాబున్నాడే, నిన్ను వాగా సూసుకుంటా నంటున్నాడు. నెలకి రెండొందల వరకూ ముట్టజెబుతాడు. అడికేం నేదాపోదా? సీమీ దాడికి బెమ కలిగింది. ఎవడో ఒక మొగాడ్ని నమ్ముకోడం నీకు సేమం."

ఇలా, తన ఇంట్లో ఒకనాడు పనిమనిషిగా ఉన్న రంగి సలహా ఇచ్చింది. ప్రాణం పోయినా ఒప్పుకోనంది. కాని కొడుకుకోసం బతకాలి. మమకారం ఆ పట్టుని సడలించింది. రెండేళ్ళు బాగానే గడిచేయి. రెడ్డి గుండెపోటొచ్చి చావడంతో మళ్ళా మొదటికే వచ్చింది పరిస్థితి. అపుడు మళ్లా రంగిమాటే వినవలసి వచ్చింది. రంగే మధ్యవర్తిగా మనుష్యులని ఇంటికి తెచ్చేది. రాను రాను ఆరోగ్యం బాగా దెబ్బతింది. బలం, పుష్టి హరించుకపోయేయి.

యౌవనం అనబడే కాలం తనకి నడుస్తున్నా, బలం, పుష్టి హరించుక పోయేయి! బాబుకి జ్ఞానం కలగడంతో అక్కడొక బస, ఇక్కడొక బస ఏర్పాటు చేసుకోవలసివచ్చింది. ఒకప్పుడు తనని వెతుక్కుంటూ వచ్చేవాళ్లు మగాళ్లు. ఇపుడు వాళ్ళకోసం తను వెతుక్కుంటూ వెళ్ళవలసి వచ్చింది.

మొదటి ఆట సినిమా వదిలే వేళయింది. కాళింది మనసులో భయం, ఆందోళన, ఆత్రుత ఎక్కువయేయి. కనీసం నాలుగు రూపాయలు దొరికినా, మందుకి, పళ్ళకి సరిపోతుంది. నాలుగు రూపాయలు! అంటే కనీసం ఇద్దరు మనుష్యులు, లేదా నలుగురు తొమ్మిది దాటుతోంది. ఒక్క మనిషి తనవేపు చూడ నన్నాలేదు.

చీకటిలో నిల్చున్న తన నిజరూపం వాళ్లు పసికట్టేస్తున్నారు. కాళిందికి దుఃఖం ఆగడంలేదు కాని ఏడుస్తూ నిల్చుంటే, దగ్గరికి రాకపోవడమే కాదు, ముష్టన్నా వెయ్యరు. ఏడ్చే మనుష్యులని అసహ్యించుకుంటుంది ప్రపంచం. వాళ్ళని వదిలి పరుగెత్తుకపోతుంది లోకం. నవ్వగలుగుతే నవ్వు. అదువల్ల లాభంఉండొచ్చు, లేకపోవచ్చు, కాని పరుగెత్తుకపోరు. తిట్టినా, కొట్టినా, లాభించినా, అసహ్యించుకున్నా, ఆఖరికి చంపబోయినా నవ్వుతూనే ఉండడం నీ గతి! కోపం చూపించే హక్కు నీ కసలే లేదు. కసి చూపే హక్కు, తిట్టే హక్కు అంతకన్నా లేదు. ఈ లోకంనుంచి, నీకోసం ఏం కావాల్సినా, ఏ రూపంలో కావాల్సినా, అందుకుతగ్గ ప్రతిఫలం ఇవ్వడానికి తయారుగా ఉన్నా, నవ్వుతూనే ఎప్పుడూ వుండడం, నవ్వుతూనే ప్రాధేయపడటం, నవ్వుతూనే నీ బ్రతుకీడ్చు కాళిందీ" అనుకుంటూనే ఉంది కొన్ని సంవత్సరాలై, ప్రతిరోజూ.

మొదటిఆడ సినిమా వదిలేసేరు. కార్ల చప్పుళ్లూ, స్కూటర్ల చప్పుళ్లూ, రిక్షాల గంటల గణగణలు వినిపిస్తున్నాయి. రద్దీఅంతా ఆ రోడ్లమీదే కాలి నడకని పోయేవాళ్ళంతా ఈదారంటే వెళ్తున్నారు. సినిమా యాక్టర్ల గురించి వాదులాడుకుంటున్నారు. "ఆ డేక్టింగ్ అడిదే. ఈడేక్టింగ్ ఈడిదే. ఆడి దీడికిరాదు ఈడి దాడికిరాదు" దాంతో సందేహాలన్నీ తీరిపోయినట్టు నోరెత్తలే దెవ్వరూ.

కాళింది ధైర్యంచేసి ముందుకొచ్చింది. ఈ నలుగురిలోనూ వెనుకనున్న వ్యక్తిని పలుకరించింది తెగించి. "ఏమండీ! చిన్నమాట!" ఆ వ్యక్తి కాళిందివేపు చూసి ముందరికి పరుగున వెళ్ళి తక్కినవాళ్ళతో అన్నాడు. "ఇదేంటి గురూ! మీదికొచ్చేస్తుందెవర్తో!" అంటూ. అందరూ నవ్వేరు. "ఓరి ఎర్రిమొహమా! మరేం పెళ్ళిజేసుకుంటావురా రేపు? అదెవర్తో తెలీదంటరా? అసలు సిసలు సరుకురా బుల్లోడా! ఇది పల్లెటూరనుకున్నావేటి? ఓ సూపు సూస్తావేటి?" అని చెణుకు విసిరేడు. "ఛీ! ఛూత్!" అని కాండ్రించి ఉమ్మేడు బుల్లోడు.

ఆ మనిషి తన చెంపమీద ఛెళ్ళున కొట్టినట్టు బాధపడింది కాళింది. దుఃఖం పొంగిరాగా గిరుక్కున తిరిగి, వెనుకనున్న పాకలోకి పోయి వెక్కి వెక్కి ఏడుస్తూ మంచంమీద కూలబడింది. అవమానం ఒక ప్రక్కనించి, కొడుకు గురించి బెంగ, మరొక ప్రక్కనించి ఆమె మనసుని తుఫాను ఊపినట్టు ఊపేయి. ఏడుస్తూనే నిద్రపోయింది.

కుక్కల అరుపులకి తెలివొచ్చింది కాళిందికి. ఉలిక్కిపడి లేచి బయట కొచ్చింది. వీధి నిర్మానుష్యంగా ఉంది. స్నేహితురాళ్ళంతా ఇళ్ళకి పోయి నట్టున్నారు. రెండో ఆటకూడా ఒదిలేసేరో ఏమిటో. ఒక రిక్షావాడ్ని అడగ్గా ఇంకా వదల్లే దన్నాడు.

రెండో ఆట అయ్యేవరకూ ఉందామనుకుంది. వెన్నెల బాగా కాస్తోంది. వీధి దీపాలకన్నా వెన్నెలే వెలుగునిస్తోంది

కాళింది చెవులు ఇంతలో బూట్ల చప్పుడు పసిగట్టేయి. పోలీసువాడు కాదు గదా? భయంవల్ల నీడలోకి పోయింది. దొరికిందా, ఇంటికి వెళ్ళటం జరగదు. వారం రోజులవరకు ఇంటికి వెళ్ళటం పడదు. ఇంకా ఎక్కువ కాలమే పట్టొచ్చు ఈ మధ్యని బాబు తనకోసం కలవరించి దిక్కుమొక్కూ లేక ప్రాణాలు వదుల్తాడు. ఛీ! అన్నీ పాడు ఆలోచనలే వస్తున్నాయి.

బూట్ల సడి దగ్గరయింది. ఒక పొడుగాటి మనిషి వచ్చి, పాకముందు వేగం తగ్గించేడు. బతికేం, పోలీసుకాదు! అనుకుంది. నీడలో ఉన్న తనని పసికట్టి నట్టుంది. నిలబడి, పొడిదగ్గు దగ్గేడు.

కాళింది ముందుకొచ్చింది. జంకుతూ అడిగింది "ఏం కావాలి?"

అతడామెను అనుమానంగా చూస్తూ అన్నాడు. "నువ్వు కావాలి!" ఆ గొంతు ఆగిపోయిన గ్రామఫోను రికార్డులా సప్తస్వరాలూ పలికింది.

ఒక పెద్ద బరువు తగ్గినట్టు నిట్టూర్చి కాళింది అంది "ఇలా రండి!"

అతడు ముందుకు వచ్చి కాళింది చెయ్యి పట్టుకొనిఅన్నాడు "ముందు ఆ హోటల్‌కి వెళ్ళి టీతాగివద్దాం పద- టీ తాగితే నేగాని వేడెక్కదు," అంటూ ఆమెను రోడ్డుమీదికి లాగేడు.

విటుడ్ని వెంటేసుకుని టీ దుకాణానికి వెళ్ళడం కాళింది కిష్టంలేదు. అంతా అదోలా చూస్తారు. తను ఒంటరిగానన్నా వెళ్తుంది లేదా పంకజం తోడువచ్చేది. కాని ఇవాళ తప్పేట్టులేదు. నాయరు బాకీ డబ్బు లడుగుతాడు. అవమానిస్తాడేమో!

భయపడుతూనే వీధిమొగలో నున్న టీకొట్టుకి వెళ్ళింది అతడితో.

"నీ పేరేంటి ?" అడిగేడు యజమాని బానిసని అడిగినట్టు.

"కాళింది." కాళింది మనసు ఇంటిమీదే ఉంది. ఈ మనిషిని ఎంత వేగం పంపిచేస్తే డబ్బుతీసుకుని అంతవేగం ఇంటికి వెళ్ళొచ్చు కాని డబ్బుగురించి ప్రస్తావన రాలేదు. ఎంతిస్తాడో అడగడానికి మొహమాటం, భయం. వెంటనే నువ్వు అక్కర్లేదు అని పోతే! మనిషి మంచివాడిలానే ఉన్నాడు.

"నీది ఈ ఊరేనా ?"

"ఈ ఊరే."

"నీ వయసెంత ?"

"పాతిక" నిజం చెప్పింది. అబద్ధం చెప్పాలంటే దొంగతనం చేసినట్టే ఉంటుంది

"మాంచి వయసులోని గుంటనాగ అగపడతున్నావ్" అన్నాడు. సారా వాసన!

కాళింది ఆ పొగడ్తకి పొంగిపోలేదు.

టీ దుకాణం కాళీగానే వుంది. నాయరు ఇద్దర్నీ చూసేడు- కానీ కాళిందిని ఏమీ అనలేదు. మాసిపోయి, మసిబట్టిన లుంగీతో, పండువెంట్రుకలు తోసు కొచ్చిన గియ్యని గడ్డంతో ఉన్న ముఖాన్ని తుడుచుకొని, లుంగీ ఎగగట్టి అడి గేడు. "ఏమిటిమ్మంటారు ?" కారా కిల్లీ నమలడంవల్ల పళ్ళ జీరలు కట్టేయి. రెండు పళ్ళ ముందుకు తోసుకవచ్చి మాట్లాడినప్పుడు తుంపర్లు పడుతున్నాయి.

"రెండు టీ!" జవాబిచ్చేడా మనిషి, ఖరీదైన 'డిష్'లు ఆర్డరు చేస్తున్నట్టు.

నాయరు టీ చేస్తూవుండగా, క్రీగంట చూసిందా మనిషిని. ఆ ఎత్తూ, బలమూ చూస్తే భయంవేసింది కాళిందికి. నీరసంవల్ల కాళ్ళు తేలిపోతున్నాయి. ఈ మనిషి బతికి బయటపడనిస్తాడూ ? ఆమెకు చెమట్లుపోసేయి.

నాయరిచ్చిన టీ తాగి ఇద్దరూ బయటపడ్డారు. అరిగిపోయిన పావలా బిళ్ళ

చెల్లదని.నాయరు పేచీపెట్టేడు కాని ఈ మనిషి దబాయించేడు. మరి నోరెత్త కుండా ఆ పావలా పెట్టెలో వేసుకున్నాడు నాయరు, గొణుక్కుంటూ కాళింది కేసి కోపంగా చూసి.

నడుస్తూనే నడుంచుట్టూ చేతులు వేసి దగ్గరగా తీసుకున్నాడు. ఆ బలానికి ఎముకలు విరిగిపోతాయేమోనని భయంవేసింది. చేతులు అకురాయిలా మోటుగా ఉన్నాయి. అతడి చెయ్యి నడుముని నొక్కేస్తోంది. ఊపిరి బిగబట్టి ఓర్చుకుంది.

"పాకలోకి పదండి," అంది భయపడుతూ.

* * *

మంచంమీంచి లేవడానికి ప్రయత్నించింది కాని లేవలేకపోయింది. ఒళ్ళల్లా ఒక ఇనపమరలో పెట్టి పిండేసినట్టు, పిప్పిపిప్పిగా అయిపోయింది. దాహంతో గొంతు కెండిపోతోంది. ఆ మనిషి లేచి, బట్టలు వేసుకొని, బయటికి వెళ్ళిపో తున్నాడు- శక్తినంతా కూడదీసుకొన లేచి, చీర చుట్టపెట్టుకొని అతన్ని వెంబ డించింది కాళింది.

ఇద్దరూ బయట కొచ్చేరు.

డబ్బు సంగతి మాట్లాడడం లేదామనిషి. బైటకొచ్చేక అన్నాడు. "థాంక్స్! వస్తాను!" అంటూ ప్రేయసికి ప్రియుడు వీడ్కోలు చెప్పినట్టు చెప్పి పోటోతు న్నాడు.

ఎండిపోతున్న గొంతుతో కాళింది అడిగింది. "డబ్బు మాట మర్చిపోయారు!"

అతను నిర్మోహమాటంగా అన్నాడు...."టీ ఇప్పించేను కదా?" అని పోటో తున్నాడు.

వెన్నులో ఎవరో పొడిచినట్టయి కాళింది అరిచింది ఉబికివస్తున్న దుఃఖాన్ని అణుచుకుంటూ. "రెండిప్పించండి చాలు! నా కొడుకు జ్వరంతో ఒళ్ళు తెలీకుండా పడున్నాడు. మీమీదే ఆశ పెట్టుకున్నాను....నా బాబుని రక్షించండి."

ఆ మనిషి ఆమెను తప్పించుకుని పోటోయేడు.

కాళిందిలో, ఇప్పటివరకూ అణిగిపోయిన, ఇన్నేళ్ళనించీ తలెత్తని ఆగ్రహం, కసి, అవమానం, రుద్రుడి మూడోకన్నునుంచి వచ్చిన మంటలా పెల్లుబికేయి. ఆమె అతడి ముందుకు వెళ్ళి, అతడి భుజాలు పట్టుకొని అరిచింది. "రాక్షసుడా! ఆటబొమ్మ ననుకున్నావురా? కొనఊపిరితో విడిచిపెట్టేవ్ నన్ను! నా కొడుకుని చంపుదామనుకుంటున్నావా? డబ్బు ఇచ్చి వెళ్ళు. రెండుకాదు! నీ దగ్గరున్న దంతా ఇచ్చినా నా దగ్గర తీసుకున్నదానికి సాటిరాతుందా?" ఆమె అరుస్తోంది

ఒళ్ళుతెలియని ఆవేశంతో. అతడు విడిపించుకపోదామని ప్రయత్నిస్తున్నాడు. ఆమెపట్టు వదలడం లేదు.

రెండోఆట అప్పుడే వదిలేరు. ఈ కేకలు విని రోడ్డంటపోయే జనం ఇటు రాసాగేరు, "ఏంటయింది....ఏంటయింది" అంటూ.

ఆ మనిషి నిశ్చలమైన గొంతుతో అన్నాడు. "నేనూ మీలానే సినిమానించి ఒస్తూఉంటే పట్టుకుంది ఇక్కడ. దీన్తో నేను ఉన్నానుట. నా దగ్గరున్న డబ్బంతా పెట్టమంటోంది దొంగముండ!"

"ఏమిటి !? ఎంత దారుణం!! ఏంటే నంజా ? యిది మర్యాదస్తులు తిరిగే జాగా అనుకున్నావా, దొమ్మరిగూడెం అనుకున్నావా ?" ఒకరిద్దరు కలుగజేసుకున్నారు.

కాళిందికి మాటలు బాధ కలిగించలేదు. ఆ స్థితి దాటిపోయింది. సిగ్గూ, లజ్జా, మానాభిమానాలు ఏనాడో మంటగలిసిపోయేయి. ఇప్పుడు నిలుపుకోవలిసింది కొడుకు ప్రాణం ఒక్కటే.

ఆమె అరిచింది. "అబద్ధం. మీరా మాటలు నమ్మకండి బాబూ! కావలిస్తే వాయప్పని అడగండి. హోటలుకు తీసుకెళ్లేడో లేదో తెలుస్తుంది. రాత్రి పన్నెండునించి ఇప్పటివరకూ పాకలో ఉన్నాడు నాతో....డబ్బులివ్వకుండా పోదామని చూస్తున్నాడు! నిన్ను కదల్నివ్వను....డబ్బివ్వందే పోనివ్వను!" కాళింది అతనిచొక్కా పట్టుకుంది.

ఇంక అలసిస్తే లాభంలేదని ఆమెచేతులు తన ఇనుపహస్తాల్లో బంధించి, పిండి, ఆమెని ఒక బొమ్మని ఎత్తినట్టు మీదకెత్తి పక్కకి విసిరేడు. కుప్పలా నేలమీద పడింది కాళింది. నుదుటికి మెట్లంచు తగిలి రక్తం కారుతోంది. తెలివి తప్పిపోతూన్నట్టుంది. కాని లేచింది. పోబోతున్న అతడ్ని పట్టుకొని, అతని ఛాతీమీద తన శక్తిలేని పిడికిలితో మోదింది.

ఆ మనిషి గట్టిగా అరిచేడు. "పోలీస్! పోలీస్!" అని. అందరూ రామనామం జపిస్తున్నట్టుగా అరిచేరు "పోలీస్! పోలీస్!" అని. "ఉండు దొమ్మరినంజా! నిన్ను పోలీసుల కప్పచెప్తే రోగం కుదిరిపోతుంది. ఆళ్ళు రెండునెల్లు కటకటాల వెనుక పెట్టేస్తే నీ బలుపు తీరిపోద్ది." ఆ మనిషి కేకలేస్తున్నాడు.

"ఏటీ అన్నాయం!! ఇయ్యాళ బాబుకయింది రేపు మనకవుద్ది! యీ దొమ్మరి ముండలీ ఊరి పరువు మంటకలుపుతున్నారు!"

ఇంతలో, ఎవడో వీధి మొగంలోకి వెళ్ళి ఇద్దరు పోలీసుల్ని కేకేసుకొని

వచ్చేడు. పోలీసులు పరిగెడుతూ రావడం చూసిన కాళింది అతడ్ని వదిలి పరుగు తీసింది, వాళ్ళబారినుండి తప్పించుకొందుకి.

ఏదో లీలగా ఆమె మెదడు పనిచేస్తోంది. స్పృహ పోతున్నట్టే ఉంది. కాని స్పృహపోకుండా ఉండేందుకు స్పృహపోయేలోపున, వీళ్ళ బారినుండి తప్పించుకుని కొడుకుదగ్గరికి ఎలాగయినా పోయి వాలాలని, ఆమె మిగిలిన కాస్త శక్తిని కూడదీసుకొని పరుగెత్తింది. పోలీసులకి దొరికితే రెండుమూడు నెలలవరకూ ఇంటి మొహమే చూడ్డం అవదు. బాబు మరి బతకడు. ఈ రాత్రి మరి గడవదు. మరి తెల్లవారదు. ఈ ఆలోచనలన్నీ లీలగా వస్తున్నాయి. నిజానికి ఆమెకి ఒంటిమీద స్పృహపోయింది. ఆమె తెగించి పరిగెడుతోంది.

పోలీసులు, మనుషులు ఆమెను వెంబడించేరు. "పట్టుకోండి! పట్టుకోండి," అంటూ కేకలేస్తూ.

ఆ కేకలు విని ఆమె పరుగెత్తేవేపునుంచి కొంత జనం ఎదురుగా వచ్చేరు. కాని ఆమె ఆగలేదు.

ఆ ఊపునే గిరుక్కున తిరిగి రోడ్డువదలి కాలువవేపు పరుగెత్తింది

ఆమె చీర పీడిపోయింది.ఆమె పూర్తిగా వివస్త్రి అయి అలానే పరుగెత్తింది పిచ్చిదాన్లా రాళ్లు రప్పలు, గాజుపెంకులు, ముళ్లు, గోతులు ఇవేవి ఆమెని బాధిస్తున్నా గ్రహించే స్థితిలో మెదడు లేదు. ఎన్నోసార్లు పడింది, లేచింది. రక్తం కారుతోంది.

ఆమెకు వినిపిస్తున్నదొక్కటే. కుందేలుని వెన్నంటే రేచుకక్కల్లా అరుస్తూ వెంటబడుతున్న జనం హోరు!

ఆ జనంలోంచి ఎవరో కేకవేసేరు. "అటు కాలవవుంది! ఎళ్ళకు! ఆగిపో! ఆపండయ్యా ఆ మనిషిని!" కాని ఆ గొంతు తక్కిన గోలలో కలిసిపోయింది.

కాళింది ఆగలేదు! నేలమీద పరుగెడుతున్నట్టు పరుగెడుతూపోయి దబీమని నీటిప్రవాహంలో పడింది. ఈదడానికి ప్రయత్నించింది. నేలని అనుకుందుకి ప్రయత్నించింది. గిలగిల కాళ్లూచేతులూ కొట్టుకుంది. ఆఖరికి అశక్తురాలై స్పృహకోల్పోయి ఆ ప్రవాహంలో మునిగిపోయింది

ఒక్కసారి తేలినప్పుడు ఆమె గొంతు ఆఖరిసారిగా దేవుడ్ని ఉద్దేశించినట్లు నీరసంగా వినిపించింది. "దేవుడా! నా బాబుని కాపాడు!"

ఆమె నివేదన ఆమె మనస్సుని చీల్చుకొని ఈ ప్రపంచపు హద్దులుదాటి స్వర్గంలోని దేవుడ్ని చేరుకుందుకి ప్రయత్నించింది కాని, దేవుడే ఉంటే నిద్ర పోతున్నాడు.

———




విశ్వం లోపలికి అడుగుపెట్టేసరికి, రావు గారు టెలిఫోన్ రిసీవర్ హుక్‌కి తగిలించి వెనక్కి తిరిగాడు. అనీజీ ఫీలింగ్‌తో ఉన్న ఆయన మొహం, విశ్వాన్ని చూడగానే క్వశ్చన్ మార్కుగా మారిపోయి, అంతలోనే ప్రసన్నంగా అయిపోయింది.

"మీరు చెప్పినట్టుగానే బిల్లులు తయారుచేశాను సార్" అంటూ ఫైలు రావుగారిచేతికి అందించాడు విశ్వం.

"రేపు నేను బెంగుళూరు వెళ్ళిపోతే నా 'ఇనిషియల్' లేక ఈ బిల్లులు 'డిస్పా చింగ్' ఆగిపోతుంది. ఇవి వెరీ అర్జంట్ కదా.... అందుకే నిన్ను ఆదివారం కూడా వర్క్ చెయ్యించాల్సి వచ్చింది_ ఏంవనుకోకు" అంటూ ఫైలు అందుకుని కుర్చీలో జారబడ్డారు రావుగారు. ఆయన కళ్ళు చకచకా అక్షరాలవెంట పరుగులు తీశాయి. అఖర్ను సంతృప్తిగా తలాడించి, సైన్‌చేసి తల పైకెత్తారు. విశ్వం నిలబడే ఉన్నాడు

"అరె.... నిలబడే ఉన్నావా....? కూర్చోవోయ్" అన్నారు ఆప్యాయంగా. రావుగారు ఆదివారంకోసం ప్రత్యేకంగా చేసుకున్న ఏర్పాట్లు, చిన్న బల్లమీద అందంగా కనబడుతున్నాయ్."

"అహఁ.... ఫర్వాలేదండి వెళ్ళిపోతాను," అన్నాడు విశ్వం బిడియంగా.

"రేపు ఆఫీసుకి వెళ్ళగానే ఈ కాయితాలు డిస్పాచ్ క్లర్క్‌చేత అర్జంట్‌గా డిస్పాచ్ చేయించు" అని, "నిరంజనరావు ఈ టైమ్‌కి తప్పకుండా వచ్చేస్తానన్నాడు. రెండుసార్లు ఫోన్‌చేసినా దొరక లేదోయ్," అన్నారు రావుగారు విసుగ్గా...!

"వెళ్ళి చూసిరమ్మంటారా....?" వినయంగా అడిగాడు.

"ఇంకోసారి ట్రైచేసి చూద్దాం ఉండు," అంటూ లేచి ఫోన్ అందుకున్నారు రావుగారు. ఈసారి అవతల ఎవరో ఫోన్ ఎత్తారు.

"హలో.... ఎవరు నిరంజనరావేనా....?"

"కాదండీ నేను వారి అబ్బాయిని, మీరెవరో తెలుసుకోవచ్చా?"

"మహేంద్రా ఎంటర్‌ప్రైజెస్ మేనేజర్ రంగారావుని. నిరంజనరావు ఫ్రెండ్‌ని. మీ ఫాదర్ ఇవాళ మా యింటికి వస్తానన్నారు, ఉన్నారా....?"

"లేరండీ హైదరాబాదునుంచి టెలిగ్రాంవస్తే అర్జంటుగా వెళ్ళిపోయారు. మీకు ఫోన్‌చేసి చెప్పమన్నారు. వెరీవెరీ సారీ నాకు ఖాళీలేక మీకు చెప్పలేక పోయాను. క్షమించండి.... ఎక్స్క్యూజ్ మీ....!"

"నెవర్‌మైండ్....!" అంటూ ఫోన్ పెట్టేశారు రావుగారు, నిరాశగా. విశ్వానికి ఆయన బాధేమిటో తెలుసు. రావుగారు 'కంపెనీ' లేకుండా 'మందు' తీసుకోరు. నిరంజనరావుగారు, రావుగారికి 'మందు ఫ్రెండ్. ఆయనివాళ రావుగార్ని డిజప్పాయింట్ చేశాడు. ఇక రావుగారి బాధ వర్ణనాతీతం!

"ఈ నిరంజనరావు గొప్పగా డిజప్పాయింట్ చేశాడోయ్. కంపెనీ లేకుండా 'టీ' కూడా తీసుకునే అలవాట్లేదు నాకు. బైదిబై నీ కేమయినా అలవాటుందా? ఫర్వాలేదులే ఆఫీసులోలా బిహేవ్ చెయ్యకు. ఆఫీసాఫీసే, ఇల్లు ఇల్లే_" అంటూ నవ్వేశారు రావుగారు.

"అబ్బే నాకసలు అలవాట్లేద్సార్" అంటూ ఖంగారుపడిపోయాడు విశ్వం.

"ఒకసారి పుచ్చుకుంటే రెండోసారి అదే అలవాటు. మరేం ఫర్వాలేదులే, ఫారిన్ సరుకే_" అంటూ తాపీగా సీసా లోని ద్రవాన్ని గ్లాసుల్లోకి వంపి తనే స్వయంగా సోడా, అయిసూ కలిపారు రావుగారు.

విశ్వానికి ముచ్చెమటలు పోశాయ్. అయన తనకంటె పైవాడు. తను పన్చేసే ఆఫీసుకి మేనేజరు. ఆయన తనని రిక్వెస్ట్ చెయ్యడమే ఒక వరంలాంటిది. అంతటి పెద్దమనిషి చేసిన రిక్వెస్ట్ని కాదనాలంటే తనలాంటి చిన్న గుమాస్తాగాడికి చాలా గుండెధైర్యం ఉండాలి. తనకి గుండే లేదు ! గొంతులో వెలక్కాయ పడ్డట్టు గిలగిలలాడుతోంది అతని మనసు.

నింపిన గ్లాసుని ముందుకు తోసి "కమాన్! కూర్చొని తీసుకో విశ్వం" అన్నారు రావుగారు.

"నేను కూర్చుంటాను మీరు తీసు కోండి !" అన్నాడు ఇబ్బందిగా.

"నా ముందు తీసుకోడానికి సిగ్గుపడు తున్నట్టున్నావ్. ఈ కాసేపూ ఆ తేడాలు వదిలెయ్ కమాన్" అంటూ గ్లాసును మరికొంచెం ముందుకు తోశారు రావు గారు. గ్లాసు బల్లచివరికి ఉంది, కదిలితే పడిపోయేలాగ తప్పనిసరిగా గ్లాసు నందుకున్నాడు విశ్వం. రావుగారు అతన్ని అభినందనపూర్వకంగా చూశారు. "ఛీర్స్ " అంటూ తన గ్లాసుని పెదవుల కదించుకున్నారు.

విశ్వం చేతులు సన్నగా వణుకు తున్నాయ్. ఒకచేత్తో ముక్కుమూసుకో బోయి 'సభ్యత' కోసం మానేశాడు. అతను కష్టపడి ఒక గ్లాసు ఖాళీచేసేసరికి రావుగారు మూడు గ్లాసులు ఖాళీచేశారు.

రావుగారు అన్నది నిజమే ఒకసారి తాగితే రెండోసారి అదే అలవాటు. ఈసారి విశ్వం తనే బాటిల్లోని సరుకు గ్లాసులోకి వంపుకున్నాడు.

"గుడ్ నువ్వు అభివృద్ధిలోకి వస్తావోయ్...!" అంటూ మెచ్చుకున్నారు రావుగారు. తొలిసారిగా కొత్త స్వర్గంలో విహరిస్తున్న విశ్వం ఆ మాటతో మరింత హుషారైపోయాడు. పురిటికోసం పెళ్ళాన్ని పుట్టింటికి పంపిన రావుగారి ఇల్లు ఆ రోజు మామూలుగానే కళకళలాడింది.

మందు చాలా మంచిది. దానికి దూరంగా ఉన్న మనిషి ప్రవర్తన ఎలా ఉన్నప్పటికీ దాని సాన్నిధ్యంలో దేవుడై పోతాడు. కులమతాల పట్టింపులుండవు. ధనిక — పేద తారతమ్యం ఉండదు. పైవాడు క్రిందివాడు అనే తేడాయే ఉండదు. ప్రాపంచిక విషయాలన్నిటికీ అతీతుడై పోతాడు.

ఒక సామాన్యమైన గుమస్తా, అతని పై అధికారితో కలిసి కూర్చొని మందు కొడుతూ కంపెనీ ఇవ్వగలుగుతున్నా



దంటే, ఆ మందు మహత్యమే కారణం....!

ఒక గంటకాలం గడిచిపోయింది. ఆ గంటసేపూ కేవలం విశ్వంలాంటి మధ్య తరగతివాళ్ళకే పరిమితమై పోయిన, కష్టాలనుంచీ, బాధలనుంచీ 'ఇన్ఫీరియారిటీ' కాంప్లెక్స్‌ల నుంచీ దూరంగా ఆకాశంలో.... స్వర్గంలో విహరించాడు విశ్వం. పుట్టి బుద్దెరిగాక, పెళ్ళయిన మర్నాడు, శోభనం రోజున ఎంత హుషారుగా, ఆనందంగా గాలిలో తేలిపోయాడో అలాంటి ఫీలింగ్‌లోనే ఉన్నాడు విశ్వం.

తనకంత స్తోమత లేదు కానీ ఉంటేనా....? ప్రతిరోజూ శోభనరాత్రి చేసుకోలేకపోయినా, ఇలాంటి పార్టీలు చేసుకోవచ్చు.

పార్టీ అయిపోయిన కాసేపటికి, ఇల్లు గుర్తొచ్చి, దిగిదిగని మత్తుతో "వెళ్ళొస్తా న్సార్" అంటూ లేచాడు విశ్వం.

"మెనీ మెనీ థాంక్స్ టు యువర్ కంపెనీ మిష్టర్ విశ్వం" అంటూ విశ్వం

చెయ్యి అందుకుని మృదువుగా నొక్కి విడిచారు రావుగారు.

నడుస్తున్న విశ్వం మనసులో లక్ష ఆశలు....!?

ఈ దెబ్బతో తను రావుగారికి కొంచం దగ్గరయినట్టే....! ఇంకొంచం కాకా పట్టగలిగితే ఎల్. డీ. సీ. నుంచి యూ. డీ. సీ. గా ప్రమోషన్ ఇప్పించినా ఇప్పించగలరు....! ఆ తర్వాత ఒకో మెట్టూ కష్టపడి ఎక్కగలిగితే, ఈ బ్రాంచికి తనే మేనేజర్ ఎందుకు కాలేదు....! ఈ చాలీచాలని జీతాల జీవితంనుంచి కాస్త బయటపడగలిగితే— ప్రశాంతంగా ఊపిరి పీల్చుకోవచ్చు....! ఆ ఆలోచనలతోనే అతని మనసు ఆకాశంలో విహరిస్తోంది.

కొంచం దూరంలో ఇల్లు కనబడేసరికి విశ్వం ఆలోచనలు మారిపోయాయ్.

తను చేసింది తప్పు కాదూ...? జీవితంలో మొట్టమొదటిసారిగా ఇవాళ తను తాగాడు తనకి తెలిసున్నంతవరకూ, తన తండ్రిగానీ, తాతగానీ, వాళ్ళ తాతగానీ ఎవరూ 'మందు' కొట్టలేదు...! ఇన్నాళ్ళకి తను తాగాడు....!? తన వంశానికంతటికీ తనొక్కడే తాగాడు. ఛ... ఛ.... ఎంత తప్పుచేశాడు తను....! ఇన్నాళ్ళ వంశగౌరవానికి తొలిసారిగా తన చేతుల్తో మలినం అంటించాడు.... రావుగారు తాగమంటే మాత్రం....!? మర్యాదగా వద్దని చెప్పి వచ్చేయాల్సింది. మరి అంత పెద్దమనిషి అంతగా చెపుతున్నపుడు కాదనిమాత్రం ఎలా అనగలడు... పరిస్థితుల కారణంగా ఈ ఒక్కసారీ తాగాల్సివచ్చింది కానీ, తను అస్తమానం తాగుతాడా ఏంవన్నానా? ఇకముందు తాగినా తాగకపోయినా ఇప్పుడు తాగిన సంగతిమాత్రం 'సీత'కి తెలిస్తే....?

సీత గుర్తుకురాగానే విశ్వానికి గుండె ఝల్లుమంది. సీతకి తెలిస్తే....! ఇంకేమన్నా ఉందా....? తెల్లవార్లూ ఏడుస్తూ కూర్చుంటుందేమో? సీత ఏడిస్తే పిల్లలూ ఏడుస్తారు. వాళ్ళందర్నీ అలా చూస్తూ తను ప్రశాంతంగా ఉండగలడా! వెనక్కి వెళ్ళిపోయి వాసన తగ్గిపోయే వరకు బజార్లో తిరిగి వద్దామనుకున్నాడు విశ్వం. కానీ అప్పటికే ఆలస్యం అయిపోయింది. తలుపు తీసుకుని బైటకు వచ్చి నిలబడ్డ "సీత" తనను చూడనే చూసింది. మరింక వెనక్కి తిరిగిపోయే వీలు కలగలేదు విశ్వానికి.

"అరగంటలో వచ్చేస్తానన్నారు, ఇంతవరకూ ఎక్కడున్నారండీ...?!" అమాయకంగా అడుగుతున్న సీతకేసి కన్నెత్తయినా చూడకుండా గబగబా లోపలికి వెళ్ళి మంచంమీద పడిపోయి, తన మొహం కనబడనీయకుండా దుప్పటి ముసుగు పెన్నేశాడు విశ్వం. వెనకే వచ్చిన సీత "భోజనం చేద్దురుగాని లేవండి."అంటూ దుప్పటిలాగబోయింది,

విశ్వం దుప్పటిని బిగించి పట్టుకుని, "ఆకలిగా లేదు" అన్నాడు పొడిగా.

"మీ కోసమే నేనూ తినకుండా కూర్చున్నాను."

"ఆకలి లేదన్నానుగా నువ్వు తినెయ్ సీతా...!"

మరోసారి అడగడానికి 'సీత'కి ధైర్యం చాలలేదు. మౌనంగా వెళ్ళి పిల్లల ప్రక్కన పడుకుంది. విశ్వం దుప్పట్లోంచి చూస్తూనే ఉన్నాడు. అతని ప్రాణం బాధగా మూల్గింది. సీత చాలా మంచిది, దేవత....! ఆమెని ఉసురు పెడుతున్నాడా తను....? తను త్రాగినట్టు తెలియలేదు కదా.... వాసన రాలేదు కదా....? ఛా.... ఇంకెప్పుడూ జన్మలో త్రాగకూడదు....! అని మనసులోనే ఒట్టు వేసుకున్నాడు విశ్వం. ఆలో చిస్తూనే నిద్దరలోకి జారుకున్నాడు. ఆ రాత్రి అతనికి ప్రమోషన్ వచ్చినట్టు కలవచ్చింది.

మర్నాడు లేచేసరికి బాగా ఆలస్యం అయిపోయింది. తనని తప్పించుకుని తిరుగుతూ పనులన్నీ కానిచ్చుకుని, హడా విడిగా ఆఫీసుకు పరుగెడుతున్న విశ్వం వైపు అయోమయంగా చూస్తూండి పోయింది సీత.

* * *

చండశాసనుడైన రావుగారితో సమా నంగా కూర్చుని మందు కొట్టిన ఘనత ఆ ఆఫీసంతటిలోకీ తనొక్కడే అన్నట్టు దర్జాగా కాలర్ పైకెత్తుకుని, ఆఫీసులోకి అడుగుపెట్టాడు విశ్వం. రావుగారు బెంగుళూరునుంచి రెండు రోజులవరకూ రారు. ఆ సంగతి అందరకూ తెలుసు. అందుకే ఆ ఆఫీసు పెళ్ళిఇల్లులా చాలా సందడిగా ఉంది...!

క్రితంరోజు రావుగారు సైన్ చేసిన కాగితాలు డిస్పాచ్ క్లర్కు చేతికిచ్చి, వెరీ అర్జంటుగా డిస్పాచ్ చేసెయ్యమని రావుగారి మాటగా చెప్పి 'స్టయిల్'గా సిగరెట్ వెలిగించాడు. విన్న జరిగిన సంగతి కొలీగ్స్‌తో చెబు దామా? వద్దా....? అని ఆలోచిస్తూనే పక్కసీటు రామారావుతో చెప్పేశాడు విశ్వం.

క్షణాల్లో ఆ వార్త ఆఫీసంతా వ్యాపిం చేసింది. స్టాఫ్ అంతా అతనిచుట్టూ గుమి గూడి అభినందనల్తో ముంచెత్తేశారు. మేనేజర్ ప్రక్కన కూర్చుని త్రాగడం అంటే మాటలుకాదన్నారు. విశ్వం అంటే ఏదో ప్రత్యేకమైన అభిమానం లేకపోతే, తనతోపాటు అలా సమా నంగా కూర్చోనిస్తాడా? అన్నారు. అంచేత విశ్వం ప్రమోషన్ ఖాయం అన్నారు. అవన్నీ వింటుంటే బాగానే ఉన్నాయ్ కానీ అలా జరగడం అసంభవం అని విశ్వానికి తెలుసు. అయినా ఆ మాట వింటుంటే సర్దాగా, గర్వంగా ఉంది. కలసి కాస్త మందు కొట్టినంతమాత్రాన

ప్రమోషనిచ్చేసే రకమైతే రావుగారు మేనేజరెలా అవుతారు.

రావుగారు బెంగుళూరునుంచి తిరిగి వచ్చేవరకూ అందరికీ ఆటవిడుపులా గడిచిపోయింది. ఆయన వస్తూనే విశ్వాన్ని రూంలోకి పిలిచి సన్నగా చివాట్లేశారు. నెలక్రితం విశ్వం, టోటల్స్ వెరిఫైచేసి ఓకే చేసిన ఫైలు ఒకటి, ఆ సీటు దగ్గరోవారం ఈ సీటు దగ్గరో వారం రెస్ట్ తీసుకుని, ఆఖర్న మేనేజర్ సంతకం తీసుకుని బెంగుళూరు హెడ్ ఆఫీసుకి వెళ్ళింది. అది ఆలస్యంగా చేరడమే కాకుండా, విశ్వం వెరిఫై చేసిన అమౌంట్స్‌లోనే వెయ్యి రూపాయల తేడా ఉంది. ఆ తేడా చూడకుండా సంతకంచేసిన మేనేజర్ రావుగార్ని హెడ్ఆఫీసులో ఆఫీసరుగారు చివాట్లేస్తే, వాటిని జాగ్రత్తగా తీసుకువచ్చి, విశ్వానికి వప్పగించేశారు రావుగారు.

మూడురోజుల క్రితం తను విశ్వానికి ఇచ్చిన (తన అవసరంకోసం) అనవసరపు చనువుని ఎలా కట్‌చేయాలా అని ఆలోచించిన రావుగారు, వచ్చిన అవకాశాన్ని జాగ్రత్తగా ఉపయోగించుకున్నారు. విశ్వం బుర్ర తిరిగిపోయింది. ఆ తర్వాత తన చొక్కాకాలరు మామూలుగానే మడతపెట్టేసుకున్నాడు.

ఒక ఫస్టుతారీఖు సాయంత్రం జీతం జేబులో పెట్టుకుంటూ బైటకు నడిచాడు విశ్వం.

"వన్ మినిట్, నేనూ వస్తున్నాను ఆగు," అంటూ హడావిడిగా వచ్చాడు సుదర్శనం— అతను ఆ ఆఫీసులోనే టైపిస్ట్.

"ఏమిటి విశేషం—?" అడిగాడు విశ్వం.

"అప్పుడే ఇంటికి వెళ్ళిపోవాలా...?"

"ఏం(వన్నా పనుందా....?"

నవ్వాడు సుదర్శనం. "జేబులో డబ్బులాడుతుంటే... పనులకేం తక్కువ...? అలా వస్తావేమోనని....!"

"ఎలా...?" అన్నాడు విశ్వం. అతనికి తెలుసు సుదర్శనం అనేదెక్కడికో.

"భలేవాడివే. తెలియనట్టు అడుగుతావేం బ్రదర్, నువ్వుమాత్రం అటు కాదా....?" అంటూ నవ్వాడు సుదర్శనం.

"ఇది మరీ బావుంది ఒకసారెప్పుడో తీసుకున్నానని నా కలవాటనుకుంటున్నావా ఏమిటి...." అంటూ విశ్వం తనూ నవ్వాడు.

ఒకసారి రుచిచూసిన వాడెవ్వడూ దాన్ని వదలలేడులేవోయ్, నీకొక రహస్యం చెప్పనా? ఇంతవరకూ మన స్టాఫ్ ఎవరికీ తెలియదు. ఇవాళ నా పుట్టిన రోజు. మామూలుగా నే నెప్పుడూ ఇంటి దగ్గరే తీసుకుంటాను. ఇవాళ నీకు పార్టీ చెయ్యాలనిపించింది అంతే....!"

"అదా సంగతి, అయితే హేపీ బర్త్‌డే టు యూ.... ఏదైనా ప్రజంట్ చేస్తాను కానీ నన్నుమాత్రం వదిలెయ్" అంటూ

ప్రక్కనున్న పాన్షాపు వైపు నడవ బోయాడు. అతని చేతిని పట్టుకుని గుంజి ఆపాడు సుదర్శనం.

"మన ఆఫీసులో నాకు తోడుగా మందుకొట్టేవాళ్ళెవరూ లేక ఇన్నాళ్ళూ ఒంటరిగా బాధపడ్డాను. ఇన్నాళ్ళకి నువ్వు తోడుదొరికావని నిన్ను తీసుకొస్తే.... ఏదో పిచ్చి ప్రజంటేషన్ నా మొహాన పారేసి పోదామనుకుంటున్నావా? పుట్టిన రోజునన్నా "కంపెనీ" లేకపోతే.... ఛా.... ఛా.... ఏం బాగోదు బ్రదర్. నీ డబ్బేమీ పైసాకూడా ఖర్చుచెయ్యొద్దు కమాన్" అంటూ దారినిపోయే రిక్షాని ఆపాడు.

విశ్వం డైలమాలో పడిపోయాడు, అలాంటి అలవాట్లజోలికి పోకూడదని వివేకం హెచ్చరిస్తోంది. ఒకసారి చూసిన రుచికోసం మనసు తహతహ లాడుతోంది, ఒకవంక తప్పేమో....? అనే సంకోచం, మరోవంక ఈ ఒక్క సారికే అయితే ఫర్వాలేదనే ఆపద్ధర్మం, అప్రయత్నంగానే రిక్షాలో అడుగు పెట్టాడు విశ్వం.

*  *  *

కేలండర్‌లో నాలుగు కాగితాలు చిరిగిపోయాయి. నాలుగు ఫస్ట్ తారీఖులు వెళ్ళిపోయాయి. అడపాతడపా విశ్వం స్వర్గంలోకి సంచారం చేసివస్తున్నాడు. అతనిలో క్రమక్రమంగా కలుగుతున్న మార్పును చూస్తుంటే సీత గుండెలు గుబగుబలాడుతున్నాయి. విశ్వం ఇదివర కటిలా జీతం తెచ్చి సీత కివ్వడం మానేశాడు. సగంజీతం అతని స్వంతా నికి బైటే ఖర్చయిపోతోంది. మిగతా సగం సీత అడగ్గా అడగ్గా, కొసరి కొసరి ఇదపడం మొదలుపెట్టాడు.

చూసి చూసి ఇక ఉండబట్టలేక భయ పడుతూనే విశ్వాన్ని అడిగేసింది.

"మీరు....ఈ మధ్య....చాలా మారి పోయారు...."

"నేనా.... మామూలుగానే ఉన్నాను గా—!" అని ఆశ్చర్యం నటిస్తూ తలవంచి తనని తను చూసుకున్నాడు విశ్వం.

"అదికాదండీ.... మీ జీతం పూర్తిగా ఇవ్వడం మానేశారు. పాలవాడికీ, షావు కారికీ కొంచం కొంచంగా బాకీలు పెరిగి పోతున్నాయి."

"ఓస్.... అదా....? బైట కొన్ని అనుకోని ఖర్చులొచ్చిపడ్డాయ్ సీతా, తప్పలేదు. ఇకనుంచీ ఫర్వాలేదులే.... అన్నీ తీర్చేద్దాం," అన్నాడు విశ్వం.

ఆ మాటలు నమ్మాలో నమ్మకూడదో తెలియలేదు సీతకి. కానీ ఈ మధ్య విశ్వం దగ్గర కొత్తగా వస్తున్న సెంటువాసనల గురించి అడగడానికి కూడా ధైర్యం చాలలేదు.

ఓ రోజు ప్రక్కింటి పిన్నిగారు అననే అన్నారు.

"మీ ఆయన ఈ మధ్య తాగుతున్నాడా ఏమిటి?" అని.

"ఛా.... ఛా.... అదేమీలేదండీ...." అంటూ ఖంగారుపడిపోయింది సీత.

"లేకపోవడమేమిటీ.... నిన్న రాత్రి నేను గుమ్మంలో నుంచుంటే సీతా అంటూ మా ఇంట్లోకి వచ్చెయ్యబోయి, పాపం ఎలా ఆగాడో ఆగాడు. ఒకటే వాసన పాడువాసన....! కొత్త జాగ్రత్తగా ఉంది అతనికి అలవాటేదో మొదట్లోనే మాన్పించమ్మా....అసలే రోజులు బాగోనూ లేవు. నీకూ పెద్ద దిక్కెవరూనూ లేరు."

సీతకి గుండె ఆగినంత పనయ్యింది. ఆ సంగతి తనకూ తెలుసు, కానీ ఆ తెలిసున్న దాన్ని తలచుకోవడానికే భయం_ అందుకే అదంతా అబద్ధం అనీ, 'కల' అనీ ఒక భ్రమని కల్పించుకుని ఆ భ్రమలోనే బ్రతికేస్తోంది. ఆ భ్రమనుంచి బైటకువస్తే సీతలాంటి పిరికివాళ్ళు బ్రతకలేరు.

సాధారణంగా పిరికివాళ్ళందరి మనస్తత్వాలూ అలానే ఉంటాయి. "ఇది త్రాడు" అని ఖచ్చితంగా చెప్పినా నమ్మలేరు. ఇది పాము కాదు అని పదిసార్లు నమ్మకంగా చెప్పి చేతికి పాముని ఇస్తే ఆనందంగా పట్టుకుంటారు.

ఆ రాత్రి సీత విశ్వాన్ని భయం భయంగానే అడిగింది.

"ఏమండీ....మీరు....నిన్న రాత్రి.... ఏదో వాస.... వ... ?!"

"ఛా.... పిచ్చిదానా.... అదేమిటను కున్నావ్.... నిన్న మా మేనేజర్‌గారి బల్లమీదున్న ఒళ్ళునొప్పుల మందు సీసా పేపర్‌వెయిట్ తగిలి పగిలిపోయి నా బట్టలమీద చిమ్మింది.... అంతే" అన్నాడు విశ్వం, తడుముకోకుండా.

"హమ్మయ్య" అనుకుంది సీత. అది తెచ్చిపెట్టుకున్న సంతృప్తి. సీతకి ఖచ్చితంగా తెలుసు విశ్వం అబద్ధం ఆడుతున్నాడని. అలా రూఢిగా నిశ్చయించుకుంటే ప్రమాదమే....! అందుకే ఆ భావన మనసులోకి రాకుండా తుడిచేసుకుని, మావారు చాలా మంచివారు. అబద్ధాలాడరు. నేను చాలా సుఖంగా ఉన్నాను. నా పిల్లలు హాయిగాఉన్నారు...! అని వ్రాసుకుంది.

ఈ మధ్య విశ్వం పిల్లల్ని ముద్దు చెయ్యడం కూడా మానేశాడు. విశ్వం రెండోకొడుకు రవి మహా గడుగ్గాయి. ఒకసారి వాడు అన్నాడు.

"నాన్నలూ మీ దగ్గల చాలా వాచనొత్తుంది.... చాలా తాగేలా ?" అని. గతుక్కుమన్నాడు విశ్వం. అతని మనసు సిగ్గుతో కుంచించుకుపోయింది. అప్పటినుంచీ పిల్లల్ని దగ్గరి తీసుకోవడమంటేనే భయం.

రవికికి సారా వాసన తెలియడానికి కారణముంది. ఒకసారి వాడు ఆడుకుంటూ ఆడుకుంటూ, నాలుగిళ్ళ అవతలున్న జగన్నాధరావుగారి మేడ దగ్గరకు వెళ్ళాడు. జగన్నాధరావుగారంటే....




సినిమాలో "దేవదాసు"గారి లాంటివారు. ఎలా దొరికాయో రెండు ఖాళీ 'విస్కీ' సీసాలు దొరికాయి వాడికి. వాటిని జాగ్రత్తగా తెచ్చి ఇంట్లో దాచాడు.

"ఛీ.... తప్పు. అవి సారా సీసాలు. బయట పారేయాలి" అని చెప్పి బయట పారేయించింది సీత. ఆ వాసన, ఆ మాటలు బాగా గుర్తున్నాయ్ వాడికి.

ఒకరోజు ఉదయం ఆఫీసుకి వెళ్ళిన విశ్వం మర్నాడు సాయంత్రానికి కూడా ఇంటికి రాలేదు. సీత చాలా ఖంగారుపడిపోయింది. ధైర్యం చెప్పడానికి దిక్కెవరూ లేరు. పుట్టింటి తరపు వాళ్ళెప్పుడో కాలగర్భంలో కలిసిపోయారు. అత్తింటి తరపువాళ్ళలో ఉన్న ఒక్కగానొక్క మామగారూ ఏ కారణంచేతనో చాలా కాలం క్రితమే విశాల భారతంలోని లక్షలమంది సన్యాసుల్లో ఒకడుగా కలిసిపోయాడు. దేవుడి మీద భారంవేసి జాగారం చేసింది సీత.

మర్నాడు సాయంత్రం, విశ్వాన్ని ఎవరో రిక్షాలో తీసుకువచ్చి జాగ్రత్తగా మంచంమీద పడుకోబెట్టి వెళ్ళిపోయారు. గదంతా వాసనతో గుప్పుమంది. పీక్కుపోయిన మొహంతో.... నలిగిపోయిన బట్టలతో పిలిచినా పలుకని స్థితిలో ఉన్న విశ్వాన్ని చూసి, సీత బేజారెత్తిపోయింది. క్రితంరోజు ఫస్టుతారీఖన్న సంగతి గుర్తొచ్చి ఖంగారుగా జేబులు వెతికింది. ఇరవై రూపాయలు, కొంత చిల్లర ఉంది. ఒక్కసారిగా గదంతా గిర్రున తిరిగినట్టయింది. ఆపుకోలేక

తెల్లవార్లూ ఏడుస్తూనే కూర్చొంది. తల్లినిచూసి పిల్లలూ ఏడుస్తూనే ఉన్నారు.

అర్ధరాత్రి మెలకువ వచ్చింది విశ్వానికి. సీత, పిల్లలు మంచంచుట్టూ ఉన్నారు. లైటు వెలుగుతూనే ఉంది. పిల్లల బుగ్గలమీద కన్నీటి చారికలు. ఏడ్చి ఏడ్చి నిద్రపోయినట్టున్నారు. సీత చెంపలమీద కన్నీటి ఏరులు ఇంకా ఏడుస్తూనే ఉంది. విశ్వానికి ఏడుపొచ్చింది ఏడవడానికి ఓపిక మాత్రం రాలేదు.

"సీతా....!" అన్నాడు నూతిలోంచి.

నాగస్వరం విన్న నాగులా తలెత్తింది సీత. చటుక్కున విశ్వం తలవైపు జరిగి,

"ఏమండీ— ఏమిటండీ ఇది" అంటూ భోరుమంది.

"ఛా....ఇంకెప్పుడూ ఇలా చెయ్యను, ఏడవకు," అంటూ ఆమె కన్నీళ్ళు తుడిచాడు. "పిల్లలు అన్నం తిన్నారా....?"

"ఉహూ....!" తల అడ్డంగా ఊపింది.

"నువ్వు తిన్నావా....?" అని నాలుక కరుచుకున్నాడు.

"కొంచం మంచినీళ్ళియ్యి సీతా...!"

మంచాన్ని ఆసరాచేసుకుని లేచి మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది. విశ్వానికి తనమీద తనకే చెప్పలేనంత అసహ్యం వేసింది.

"అన్నం వండావా.... సీతా...?"

"ఊఁ...."

"పద పిల్లల్ని లేపు, భోజనం చేద్దాం...." అంటూ మంచం దిగాడు. విశ్వం పిల్లలకీ, విశ్వానికీ వడ్డించి సీత వాళ్ళ కెదురుగా కూర్చుంది.

"నువ్వూ తిను సీతా...." అంటూ అన్నం గిన్నెవైపు చూసి ఆగిపోయాడు. దాన్లో.... లెఖ్ఖపెట్టగలిగితే వొందో.... రెండు వందలో అన్నం మెతుకు లుంటాయ్. అతని చూపును గ్రహించగానే చటుక్కున గిన్నె పక్కకు జరిపింది సీత.

"నీకేది.... అన్నం....?"

"తర్వాత తింటాను....ముందు మీరు తినండి."

"ఉహూఁ.... ముందు గిన్నె చూపించు."

"అన్నం ఉంది. మీరు కానివ్వండి."

"నాకీ అన్నం ఎక్కువై పోతుంది.... కొంచం తీసెయ్."

"మేం కూడా తినం" అంటూ పిల్లలు కూడా కంచాలు గెంటేశారు. వాళ్ళందరి కంచాల్లోంచీ కొద్దికొద్దిగా తీసి తన కంచంలో వేసుకుంది సీత అందరి వైపు జాలిగా చూశాడు విశ్వం. ఛా.... ఇంకెప్పుడూ ఇలా చెయ్యకూడదు అనుకుని ఒట్టుపెట్టుకున్నాడు— పదోసారి.

నాలుగు రోజులపాటు నిష్ఠగా నియమంగా గడిపాక, ఐదోరోజు విశ్వం శరీర అవయవాలన్నీ స్ట్రైక్ చేశాయ్. పిచ్చెక్కినట్టుగా ఉంది. తలకాయ ఊడిపోయేలా ఉంది.... ఇక ఆగలేక....

ఆఫీసు కట్టెయ్యగానే, మాధవరావు సీటు దగ్గరికి వెళ్ళాడు. బ్రదర్ ఓ ఫిఫ్టీ ఉన్నాయా? చాలా అవసరం," అని అడిగాడు.

మాధవరావు తలెత్తి విశ్వం మొహంలోకి చూశాడు. అతనికి తెలుసు ఫిఫ్టీ ఎందుకో...!

నువ్వింత ఘోరంగా తయారవుతావనుకోలేదు విశ్వం. మొన్నటి వరకూ మనవాళ్ళలో ఎవరికైనా అవసరం వస్తే నువ్వు సర్దుబాటు చెయ్యగలిగేవాడివి. ఇవాళ నువ్వే అప్పుకోసం బయలుదేరావ్. అదీ ఫస్ట్ తారీఖువెళ్ళిన పదిరోజుల్లోనే....! చూడు విశ్వం నువ్వు ఒంటరిగాడివైతే ఎలా ఖర్చుచేసుకున్నా ఇబ్బంది ఉండదు.... నీకు భార్య ఉంది, ముగ్గురు పిల్లలున్నారు. వాళ్ళకోసమైనా నువ్వీ పాడుఅలవాట్లు మానెయ్." అన్నాడు జాలిగా.

తెలిసో తెలియకో ఒక కాలు ఊబిలో పెట్టిన విశ్వం ఆ కాలు లాక్కోలేక, రెండో కాలు కూడా అందులోనే పెట్టి పూర్తిగా మునిగిపోయి తనవాళ్ళని ముంచెయ్యడం చాలా బాధగా ఉంది మాధవరావుకి.

"ఛా ...మందెప్పుడో మానేశాను.ఈ డబ్బు ఇంటికి కావాలి. మా ఆవిడకి ఒంట్లో బాగోలేదు," మందు మహాసముద్రంలో పీకలవరకూ మునిగిపోయిన విశ్వం అతి సులువుగా అబద్ధాలు కూడా ఆడడం నేర్చేసుకున్నాడు.

"సారీ విశ్వం. మొన్నే మా ఆవిడకి డెలివరీ అయ్యింది నీకు తెలుసు కదా? నాకూ చాలా అవసరం డబ్బు....ప్లీజ్ ఏమనుకోకు."

అంతే, విశ్వం అక్కణ్నించి విసురుగా వెళ్ళిపోయాడు. ఆపద్బాంధవుడిలా సుదర్శనం ఆదుకున్నాడు అతన్ని. అప్పట్నించీ అడపాతడపా విశ్వానికి ఐదో పదో అప్పులుచేసే అలవాటు అంటుకుంది ఫస్టు రాగానే ఆ జీతం మొత్తం అప్పుల వాళ్ళకి పంచిపెట్టేసే అలవాటూ అంటుకుంది.

* * *

ఛీ....రెండు నెలల్నించీ జీతాలు లేవు. పైగా ఈ నెల కూడా ఇంకా జీతాలు రాలేదట. వెధవ్వుద్యోగాలు, వెధవలోకం ఛీ....ఛీ...." తనలో తనే పాఠం వప్పగించేసుకుంటున్నాడు విశ్వం. అర్ధాంగి సీత, అతని మంచం ప్రక్క నుంచుని భర్తవైపు అమాయకంగా చూస్తోంది. తన మాటలు భార్యకి అర్థమవుతున్నాయో లేదో అని మధ్య మధ్య ఓరకంటితో గమనిస్తూ ఏకపాత్రాభినయం చేస్తున్నాడు విశ్వం.

మొగుడిదంతా అబద్ధమేమో ననే అనుమానం లేకపోలేదు సీతకి. ఆ ఆడే అబద్ధాలేవో, తనకి అనుమానం రాకుండా

గోడకట్టినట్టు అడితే బాగుండును అనిపి స్తోంది మనసులో,

"అయితే ఈ నెలకూడా జీతం రాదా...." భయంగానే అడిగింది.

"ప్చ్....రాదు సీతా, రాదు. చెయ్య వసిన అప్పులన్నీ చేసేశాను. ఇక అప్పులు కూడా పుట్టడంలేదు. ఈ నెల అంతా ఏం బ్రతా....ఏం తిని బ్రతకాలో అర్థంకావడంలేదు సీతా" అన్నాడు విశ్వం, బాధను అభినయిస్తూ.

అయోమయంగా తమకేసి చూస్తూన్న ముగ్గురు పిల్లలకేసీ జాలిగా చూసింది సీత. వాళ్ళకోసమైనా ఏదో ఒకటి చెయ్యాలి....

"పోనీలెండి నా దుద్దులు ఉన్నాయిగా అందాకా ఎక్కడయినా తాకట్టుపెట్టండి" అంటూ సగం నమ్మకంతోనే తన చెవుల దుద్దులు తీసి విశ్వం చేతిలో పెట్టింది. అవి తన పెళ్ళయిన ఏడాదికి నూట యాభై పెట్టి చేయించాడు విశ్వం.

"సీతా....ఆఖరికి నీ...." అని ఆగి పోయి బాధను అభినయించాడు. ఆమె బోసిచెవులు చూసి జాలిని అభినయిం చాడు. తన అశక్తతను అభినయించాడు. ఒకేసారి రెండు పద్మశ్రీలో....భరత్ అవార్డులో ఒచ్చేలా అన్ని రసాలూ అభి నయించాడు.

"పోనీలెండి. బాధపడకండి, జీతాలు రాగానే విడిపించేద్దాం" అని అనునయిం చింది సీత. జీతాలు రావడం. అయిపో వడం కూడా జరిగిపోయిందని ఆమెకు తెలుసు. అది తలచుకోవడానికి భయం. అందుకే తలచుకోలేదు.

"ఒఖ్ఖ అరగంటలో వచ్చేస్తాను.... తలుపేసుకో సీతా," అంటూ బైటకు నడిచాడు విశ్వం. అరగంటకు కాదు గంటయినా సరే క్షేమంగా ఇంటికొచ్చేస్తే చాలు' అని మనసులో అనుకుంది సీత.

గంటకాదు, రెండుగంటలు కాదు, రోజు కాదు, రెండు రోజుల వరకూ విశ్వం అయిపులేడు. ప్రాణాలు అర చేతిలో పెట్టుకుని బిక్కు-బిక్కుమంటూ ఎదురుచూసిన సీత, ఇక ఆగలేక రెండు వీధులవతల ఉన్న మాధవరావుగారింటికి వెళ్ళింది. విశ్వం పనిచేసే ఆఫీసులోనే మాధవరావూ పనిచేస్తున్నాడు. ఆ మధ్య ఎప్పుడో రెండుమూడుసార్లు సీతా, విశ్వం మాధవరావు ఇంటికి వెళ్ళారు. వాళ్లూ వచ్చేవారు. ఆ పరిచయంతో అతని కేమన్నా విశ్వం సంగతి తెలుసేమోనని వెళ్ళింది సీత.

"ఆయన రెండురోజులుగా ఇంటికి రావడంలే దన్నయ్యగారూ. ఆఫీసుకైనా వస్తున్నారో లేదో తెలియలేదు," అంది గుడ్లనీరు కక్కుకుంటూ.

మాధవరావు ఆమె మొహంలోకి చూడలేకపోయాడు. సీత గుండెబలం లేని మనిషని అతనికి తెలుసు. ఆఫీసు పనిలో అవకతవకలు ఎక్కువయి పోయాయని మేనేజర్‌గారు మూడు

రోజుల క్రితమే అతన్ని డిస్మిస్ చేసేశారు. అది చెప్పలేక,

"ఆఫీసు పనిమీద ఏదో ఊరు వెళ్ళినట్టున్నాడమ్మా. ఇవాళో రేపో వచ్చేస్తాడు...." అని ఘోరంగా అబద్ధం ఆడేశాడు. రెండురోజులుగా సీతకి పిల్లలకి సరిగ్గా తిండిలేదని తెలుస్తూనే ఉంది. జేబులోంచి పదిరూపాయల కాయితం తీసి సీత పెద్దకొడుకు చేతిలో పెట్టాడు.

"ఏమన్నా అవసర ముంటుంది. అందాకా ఇదుంచమ్మా...." అన్నాడు. సీత మొహమాటపడిపోయింది. తనకోసమైతే తీసుకోకపోను, పిల్లలకోసం తప్పలేదు. మాధవరావు భార్య ఇచ్చిన టీ త్రాగి ధైర్యంగా ఇంటికి వెళ్ళిపోయింది సీత.

విశ్వంకోసం తనకు తెలిసినవాళ్ళందర్నీ ఎంక్వయిరీ చేశాడు మాధవరావు. సుదర్శనం తనకి తెలియదని తప్పుకున్నాడు. అంతకుముందు వాళ్ళిద్దరూ కలసి తిరిగిన బార్లలోకి కూడా వెళ్ళి చూశాడు. ఉద్యోగం ఊడిపోయాక, అప్పు లెక్కువయిపోయాక బార్లలోకి వెళ్ళే స్తోమత తగ్గిపోయింది విశ్వానికి. అటువంటి కష్టకాలంలో ఒక మహనీయుడు, మందులో పుట్టి మందులో పెరిగినటువంటివాడు, విశ్వానికి మార్గం ఉపదేశించాడు.

"మన కల్మషాలన్నీ తొలగిపోవాలంటే కాశీ వెళ్ళి గంగలోనే మునగక్కర్లేదు. చాకిరేవులో మునిగినా అదే గంగ అవుతుంది.

అకుంఠిత గురుభక్తితో విశ్వం ఆయనకి నమస్కారం చేసి, మొట్టమొదటిగా ఆయన మార్గదర్శకత్వంలో మురికిపేటలోని గవర్నమెంటువారి సారాయి దుకాణములోకి దొడ్డిదోవకుండా స్వర్గప్రవేశం చేశాడు.

బార్లోకి వెళితే కనీసం పాతిక రూపాయలైనా ఉండాలి ఇక్కడ అంత డబ్బు అవసరం ఉండదు. ఆ సిస్టం విశ్వానికి చాలా నచ్చింది. దుద్దులు అమ్మితే నూటపది రూపాయలు వచ్చాయి. గురువుగారికి నాలుగు గ్లాసులు కొట్టించి, తనో నాలుగు గ్లాసులు లాగించాడు, అప్లోంచి డౌన్లోకి ఎడ్జస్టవడానికి కొంచం ట్రబుల్ పడవలసి వచ్చింది. అయినా వదల్లేదు విశ్వం.

ఆకలికీ, దాహానికీ ఒకే మందులా ఆ మందు వాడుతూ ఆ పాకలోనే పడి ఉన్న విశ్వాన్ని చూశాడు మాధవరావు. అతని స్థితి మహా దైన్యంగా ఉంది. గుర్తుపట్టలేనంత చింపరవందరగా ఉంది. ఒక చేత్తో ముక్కు మూసుకుని మరోచేత్తో విశ్వాన్ని పట్టుకుని రిక్షాలో ఇంటికి తీసుకువచ్చాడు.

అతన్ని చూసిన సీత గుండె ఆగిపోయింది. ఆ వాసనకి పగిలిపోయింది.

"ఏం ఖంగారు పడకమ్మా.... ఇతనికి ఇది ఈ మధ్యనే అలవాటయ్యింది.

సర్దాగా మొదలుపెట్టి చివరకు దానికి బానిస అయిపోయాడు. ఎన్నోసార్లు చెప్పాను కూడా " సీతవైపు, పిల్లల వైపు జాలిగా చూస్తూ చెప్పాడు మాధవరావు. పిల్లలు బిక్కుబిక్కుమంటూ చూస్తున్నారు తండ్రివైపు. అస్సలు స్పృహలో లేడు విశ్వం. చెంబులూ, గిన్నెలూ అమ్మి డాక్టర్ని తీసుకొచ్చింది, మంగళసూత్రాలు అమ్మి మందులు తెచ్చింది సీత. మర్నాడు చిన్నసైజు బ్రాందీసీసాడు రక్తం కక్కుకున్నాడు విశ్వం. అది చూసిన డాక్టర్ పెదవి విరిచేశాడు.

"తాగినదానికి, దానికి సరిపడా తిండి తిని ఉంటే కొన్నాళ్ళపాటు బ్రతికేవాడే కానీ పూర్తిగా కేవలం తాగుడే ఇతని ఆహారమైపోయినందువల్ల లోపల ప్రేగులు, ఊపిరితిత్తులు పాడైపోయి ఉంటాయ్. ఇహ ఇతన్ని బ్రతికించడం నావల్ల కాదు, తీసుకువెళ్ళగలిగితే రాయవెల్లూరు తీసుకువెళ్ళండిహ!" అని ఉచిత సలహాపారేశాడు

ఇంటికప్పువిరిగి సీతనెత్తిన పడింది. ఆ రాత్రి సీతకి కంటిమీద కునుకు లేదు. భవిష్యత్తు పెనుభూతంలా భయపెడుతోంది. ఆదుకోవడానికి నా అన్నవాళ్ళెవ్వరూ లేరు. చేతిలో చిల్లిగవ్వ లేదు. ఆకలితో అల్లాడిపోయే పిల్లలు ఒకవైపూ - భర్తను కబళించబోయే మృత్యువు మరోవైపూ ఆమెను ఉక్కిరి బిక్కిరి చెయ్యసాగాయ్. తనకీ తన పిల్లలకీ ఉన్న ఒకే ఒక దిక్కు తన భర్త. అతనే లేకపోతే తమ బ్రతుకు లేమవుతాయ్—ఊహించడానికే భయంకరంగా ఉంది భవిష్యత్తు.

ఆ అపస్మారక స్థితిలోనే మరో రోజు గడిచిపోయింది. మాధవరావు ఆఫీసులో కొలీగ్స్ దగ్గర రెండువందల రూపాయలు ప్రోగుచేసి ఇచ్చాడు. వీలువున్నంతవరకు వైద్యం చేయిస్తూనే ఉంది సీత. విశ్వానికి మళ్ళీ నాలుగు సార్లు రక్తం వాంతిగా పోయింది. ఒక అర్ధరాత్రి కొంచెం స్పృహలోకి వచ్చాడు విశ్వం.

"సీతా !" అన్నాడు కలవరించినట్టు.

మెల్కొని పసుపుతాడు ఆనందంగా కళ్ళకద్దుకుంది సీత.

"నేనిక బ్రతకను సీతా మిమ్మల్ని అన్యాయంచేసి, నా వ్యసనానికి నేను బలైపోతున్నాను. నేను పోతున్నానని కాదు సీతా నా బాధ. మీరేమయిపోతారోనని సీతా ఏమయిపోతారోనని " అంటూ వెక్కి వెక్కి ఆడదానిలా ఏడిచాడు విశ్వం.

సీత అవది. అమాయకురాలు. పసిపిల్లలాంటి మనస్తత్వం ఆమెది. మొగవాడు విశ్వం ఏడుపుచూసి విపరీతంగా చలించిపోతోంది. చెప్పలేనంత భయం, ఏదో ఆదుర్దా, ఖంగారు, ఉక్కిరిబిక్కి




రై పోతోంది. తెలియకుండానే తనూ ఏడ్చేస్తోంది.

మాట్లాడుతూనే విశ్వం మళ్ళీ వాంతి చేసుకున్నాడు. ముక్కులోంచీ నోట్లోంచి నల్లగా పడింది రక్తం! పొట్ట చేత్తో పట్టుకుని మెలికలు తిరిగిపోతున్నాడు విశ్వం. అతన్ని చూసేకొద్దీ సీతకి ఖంగారు, దడ ఎక్కువయినాయి.

అతనికి చావు తప్పదు. భర్తచావుని తను చూడకూడదు, ముందు నన్నే తీసుకుపో దేవుడా....! అంటూ ఆమె మనసు ఎలుగెత్తి ఆక్రోసిస్తోంది. కానీ.. ఆమెకు తెలుసు తన మొర దేవుడు ఆలకించడని! ఎలా? ఏం చెయ్యాలి. ఏదో తెలియని ఆదుర్దా ఆమెని నిలవ నియ్యడం లేదు.

విశ్వానికి మరో వాంతి అయ్యింది. సీతకు ఖంగారు ఎక్కువై పోతోంది కట్టలు త్రెంచుకున్న నదిలా దుఃఖం పొంగుకువచ్చేస్తోంది. విశ్వం భయంకరంగా దగ్గుతున్నాడు. చుట్టలు చుట్టుకుపోతున్నాడు.

"దేవుడా....అయన్ని కాపాడు లేదా నన్ను చంపేయ్...! కటిక చీకటి రాజ్యమేలుతున్న నిశీధి సమయంలో ఆదుకునే వారెవ్వరూ లేని ఒక అబల ఆవేదన అది. దేవుడికి దయలేదు తనని చంపేలా లేడు. అంచేత తనే చచ్చిపోవాలి. త్వరగా చచ్చిపోవాలి. తనూ చచ్చిపోయి విశ్వం చచ్చిపోతే....? పిల్లలు అనాధలై పోతారు. ఆదుకునేవాళ్ళు లేక అతి నికృష్టంగా బ్రతుకుతారు వద్దు, వద్దు తన పిల్లలు బ్రతికితే అలా బ్రతకకూడదు. అందుకే శివమెత్తినదానిలా

సీత చిన్నపిల్లల్నిద్దర్నీ లేపి చంకనెత్తు కుంది. హఠాత్తుగా నిద్దట్లోంచి లేచి నందుకు పిల్లలిద్దరూ ఏడుపులు మొదలు పెట్టారు. పెద్దవాడు పన్నెండేళ్ళ రాజు అయోమయంగా చూస్తున్నాడు తల్లినీ, తమ్ముడూ, చెల్లెల్నీ. విశ్వం దగ్గుతూ దగ్గుతూ మహా ఆయాసపడిపోతున్నాడు. మరోసారి కళ్ళు ఒకుకున్నాడు. నీళ్ళునిండిన కళ్ళతో చివరిసారిగా భర్తవంక చూసు కుని, మనసులోనే అతని పాదాల్ని కళ్ళ కద్దుకుని పెరటివైపు నడిచింది సీత.

దిక్కులేనివారికి దేముడే దిక్కు. ఆ దేముడూ దిక్కులేకపోతే తనే దిక్కు అంటోంది పెరట్లోని నుయ్యి.

తన కళ్ళు గట్టిగా మూసుకుని, చేతి లోని పిల్లల్నిద్దర్నీ ఆ నూతిలోకి జార విడిచింది సీత. తమ్ముణ్నీ, చెల్లెల్నీ, తీసుకుని తల్లి ఎక్కడికి వెళ్ళిపోతుందో అని వెనకాలే తడుముకుంటూ వచ్చిన రాజుని కూడా చటుక్కున ఎత్తుకుని, పిచ్చిదానిలా ముద్దులు కురిపించి నూతి లోకి విసిరేసి తనూ ఉరికేసింది సీత. మంచంమీద విశ్వం బాధతో మెలికలు తిరిగి తిరిగి స్పృహతప్పిపోయాడు. దొడ్డితలుపు తీసిన చప్పుడు కానీ, బావి లోంచి వచ్చిన నాలుగు బరువైన చప్పుళ్ళు కానీ అతనికి వినిపించలేదు.

* * *

తనొకడిని ఉన్నాననీ, మనుషుల్ని అతి తమాషాగా ఆడిస్తున్నాననీ ప్రపం చానికి ముఖ్యంగా ఆ ప్రాంతానికి మరో సారి తెలియజెప్పాడు దేవుడు.

చావు తప్పదనుకున్న విశ్వానికి చావు తప్పి సుఖంగా నిద్రపట్టింది. నూరేళ్ళు సుఖంగా బ్రతకవలసిన నాలుగు నిండు ప్రాణాలు గంగలో కలిసిపోయాయి. మర్నాడు స్పృహలోకి వచ్చిన విశ్వం తన ఇంట్లో గుమిగూడిఉన్న జనం చెప్పిన నిజం విని స్తంభించిపోయాడు. ఏడిచే ఓపికలేక వేదాంతిలా నవ్వాడు. నవ్వి నవ్వి మనసులోని దుఃఖాన్ని ఆపుకోలేక పిచ్చివాడిలా నవ్వాడు. ఇక నవ్వలేక నీరసంగా ఏడిచాడు.

ఎవరో కాఫీ తెచ్చిపెట్టారు. వద్దన కుండా తాగాడు. మాధవరావు వచ్చారు. అతని కళ్ళు నీళ్ళతో నిండి ఉన్నాయ్. కాసేపటికి పోలీసులు వచ్చారు. నూతి లోంచి శవాన్ని తీయించారు. సీతని, పిల్లల్ని ప్రేమగా చేతుల్తో తడుముకుని, వేగంగా గదిలోకి పరుగెత్తి తలగడలో మొహం దాచుకుని వెక్కి వెక్కి ఏడిచాడు విశ్వం.

ఎవరి బాధలతోటీ నిమిత్తం లేకుండా, విశ్వాన్ని అక్కడ చూడ్డానికి వచ్చిన ఇరుగుపొరుగువారినీ తమ ప్రశ్నలతో వేధించి వేధించి, పోస్టుమార్టం అంటూ శవాన్ని గవర్నమెంట్ హాస్పటల్‌కి పంపించి, సాయంత్రం మూడు గంటలకి వెళ్ళిపోయారు పోలీసులు.

రాత్రి విశ్వం పరిస్థితి మరీ సీరియస్‌గా

ఉందనీ, ప్రాణం పోవడం ఖాయమని ఒక డాక్టర్‌కూడా అన్నాడనీ, విశ్వం పోతే సీతకు మరో దిక్కులేదనీ, అసలే భయస్తురాలు కావడంవల్ల, రాత్రి విశ్వం పరిస్థితి మరీ విషమించేసరికి, అధైర్యంతో.... తామంతా దిక్కులేనివారై పోతామనే భయంతో పిల్లల్ని నూతిలో పారేసి తనూ ఉరికేసి ఉంటుందనీ.... అందరూ ఒక్కలా రిపోర్టిచ్చారు.

"ఒంటరిగా ఇక్కడేం ఉంటావ్ మా యింటికి వచ్చెయ్." అన్నాడు మాధవరావ్.

"ఉహూఁ.... నన్నిలా ఒంటరిగానే ఉండనివ్వు, తర్వాత వస్తాలే...." అన్నాడు. "మావాడిచేత భోజనం పంపుతాను తిను...." అన్నాడు మాధవరావు.

"వద్దురా.... ముందు నన్నిలా వదిలి నువ్వెళ్ళిపో...!" గొంతు చించుకున్నాడు. విశ్వంవైపు జాలిగా చూస్తూ వెళ్ళిపోయాడు మాధవరావ్. గడియకొకరు వచ్చి గదిలోకి తొంగిచూస్తున్నారు. విశ్వం కళ్ళు రోధిస్తున్నాయ్. కన్నీళ్ళతో ప్రక్కబట్టలు తడిచిపోతున్నాయ్.... కళ్ళు మూసుకున్నాడు. సీత కనిపిస్తోంది. పిల్లలు కనిపిస్తున్నారు. కళ్ళు తెరిచాడు. సీత నవ్వుతోంది, పిల్లలు నాన్నా.... నాన్నా అంటున్నారు.... తల విదిలించి చూశాడు.... నిజమే పిల్లలు, సీత. పిల్లలు గదిలో మూలమూలలా ఉన్నారు. చటుక్కున లేచి కూర్చున్నాడు విశ్వం.... ఏరీ ఎవరూ లేరే....!! మళ్ళీ పడుకున్నాడు.. సీత నవ్వుతోంది, అమాయకంగా. అంతలోనే ఏడుస్తోంది హృదయ విదారకంగా.... "ఏడవకు సీతా ఏడవకు" ఉంగారుగా లేచిపోయాడు విశ్వం. అంతలోనే ఎవరో అమ్మాయి లోపలికి రాబోయింది.... "సీతా...." అంటూ గట్టిగా అరిచాడు విశ్వం. అతని తల బద్దలైపోతోంది.

కెవ్వున కేక వేసి ఆ అమ్మాయి వెనక్కి పారిపోయింది. విశ్వం గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. సీత చచ్చిపోలేదు బతికే ఉంది. సీత బతికే ఉంది. గబగబా బైటకు వెళ్ళి చూశాడు. ఎవరూ కనబడలేదు. బయట చీకటిగా ఉంది. ప్రొద్దుపోయింది. సీత బతికే ఉంది. ఎక్కడో దాక్కుంది. నన్ను ఏడిపించాలని దాక్కుంది, వెతుకుతాను నా సీతను. "ఇంకెప్పుడూ తాగను సీతా.... ప్లీజ్ కనబడవా...." అనుకుంటూ వీధిలోకి పరుగుతీశాడు విశ్వం. ఎవరూ అతన్ని చూడలేదు, ఆపలేదు. పిచ్చిపిచ్చిగా వీధులన్నీ తిరిగి తిరిగి ఒక ఇంటిముందు జనాన్ని చూసి ఆగాడు విశ్వం. విపరీతమైన స్ట్రెయిన్‌తో అతని తల పగిలిపోతోంది.... కళ్ళింతలు చేసుకుని ఆ జనంలో సీతకోసం, పిల్లలకోసం వెతుకుతున్న విశ్వానికి, వాళ్ళకి బదులు కమ్మటి వాసనలు తగిలాయి. అతనిలో అణిగిపోయి ఉన్న ఆకలి పడగవిప్పి లేచింది...

ఆ ఇంట్లో ఏదో శుభకార్యం జరుగుతోంది కాబోలు....?!

చుట్టూ కలియజూశాడు విశ్వం. అదే.... అదే ఇల్లు. మేనేజర్ రావుగారి ఇల్లు.... అక్కడే మొదటిసారిగా తను స్వర్గానికో.... నరకానికో దారి తెలుసుకున్నాడు. తను తెలుసుకోలేదు రావుగారే ప్రేమగా చూపించారు. పాపం చాలా మంచివారు. అంతలేసి ఖరీదైన సీసాలు తనకి తాగడానికిచ్చారు. అంత ఖరీదైన తిండి తనెంతకుముందెప్పుడైనా తిన్నాడా....? తను అడక్కుండానే.... ఒద్దు ఒద్దు అంటుండగానే కడుపునిండా పెట్టారు. ఇప్పుడు తనకి ఆకలి వేస్తూంది కా....? అడిగితే ఎందుకు పెట్టరు....? పెడతారు. తను వాళ్ళకి "కంపెనీ" ఇవ్వాలిగా...! అదేమిటీ సీతక్క ఉంది_? "ఓయ్ సీతా...." ఆ అమ్మాయి ఎవరో_ వెనక్కి తిరిగిచూసి కంగారుగా పారిపోయింది. "ఛా ....ఈ అమ్మాయి సీత కాదు.... సీత కనుపిస్తే బావుణ్ణు.... అసలీపార్టీ ఏమిటో రావుగారి తద్దినమో.... లేకపోతే వారి పెళ్ళాం ఎవరితోనన్నా లేచిపోయిందో....!? డబ్బు వాళ్ళు ఏం జరిగినా పార్టీలు చేసుకుంటారు, బోల్డు డబ్బుంటుంది కదా మరి ...! అబ్బ ఎందుకో చెడ్డ ఉక్కగా ఉంది, లోపల ఫేనుందో లేదో...తనెక్కడ కూచోవాలి....? ఇదుగో అమ్మాయ్ ఇలారా.... అరె వినుపించుకోదేం....? ఇదుగో అబ్బాయ్. లోపల రావుగారు ఉన్నారా? ఈ పాటికి 'సారా' తాగుతుంటారు. నేను వచ్చానని చెప్పు.....అరె వీడికి వినబడదే...? ఓహో హిప్పీ కదూ. హిప్పీలకి వినబడద్లే.... వాళ్ళ జులపాలు చెవులమీదుంటాయిగా.

అవునూ నాకు ఆకలేస్తోంది కదూ ... ఒరేయ్ రావూ బైటకు రారా బాబూ, నాకు ఆకలి బాగా ఉంది. పార్టీ ఏ గదిలో జరుగుతుందో చెప్పు. అర్థంరా బాబూ... డబ్బున్నవాళ్ళకి కళ్ళు చెవులూ ఉండవా ఏం....? సీతా పిల్లలూ లోపల ఏగదిలో ఉన్నారో .... ఆలోచిస్తున్నాడు విశ్వం అంతలో ఎవరో విశ్వందగ్గరకు వచ్చి ఎగాదిగా చూసి "ఏయ్ ఎవరు నువ్వు? బయటకు పద" అన్నాడు.

"ఆకలేస్తోందోయ్ పార్టీకి వచ్చాను" అన్నాడు నిర్లక్ష్యంగా.

"లోపల పెద్దవాళ్ళు భోజనాలు చేస్తున్నారు. ఇప్పుడుకాదు బయటకు పద...." అన్నాడు వాడు కళ్ళెఱ్ఱజేసి.

"నేను పెద్దవాడినేరా బాబూ ఇదివరకు, మీ రావుగారిలాంటి వాళ్ళకి తాగుడు పార్టీల్లో కంపెనీలు ఇచ్చిఇచ్చి ఇలా అయిపోయాను నవ్వాడు విశ్వం" అంతలో అటు వస్తున్న రావుగార్ని చూసి నౌకరు గుండెలు బాదుకున్నాడు.

"నాకొంప ముంచేలా ఉన్నావురోయ్_ నాయనో బయటకు నడవరా బాబూ...." అంటూ మెడపట్టిబైటకు గెంటబోయాడు. విశ్వం వాడికి దొరకుండా తప్పుకుని....

"హలో నమస్కారం రావుగారూ"

అన్నాడు. రావుగారు అతనివైపు ఆశ్చర్యంగా చూశారు "ఎవర్నువ్వు....?" అన్నాడు ఎరగనట్టు.....

"నేను విశ్వాన్ని సార్. మీ ఆఫీసులో ఉద్యోగం చేశాను. మీరు మందు పార్టీ చేసుకుంటున్నప్పుడు మీతోపాటు తాగి మీకు "కంపెనీ" కూడా ఇచ్చాను. చాలా ఆకలిగా ఉంది సార్. నాకు మందు వద్దు కొంచం అన్నం పెట్టించండి సార్. నేను తాగుబోతునని మా ఆవిడకి కోపం వచ్చి అన్నం వండకుండా చచ్చిపోయిందట సార్..." అంటూ ఏడుస్తూ చెప్పాడు విశ్వం.

రావుగారి బంధువులు ఐదారుగురు వాళ్ళిద్దరి చుట్టూ గుమిగూడిపోయారు. రావుగారు చాలా ఇన్సల్ట్‌గా ఫీలయ్యారు.

"భోజనం చేస్తాడట ఈ స్కౌండ్రల్. ఎవర్రా అక్కడ వీణ్ణి బైటకు గెంటెయ్యండి" అంటూ కసురుకున్నారు. గబగబా మరో ఇద్దరు నౌఖర్లువచ్చి విశ్వం చెరో రెక్కా పట్టుకున్నారు. విశ్వం బలవంతంగా వెనక్కి తిరిగి అన్నాడు.

"ఒరేయి రావూ! ఒకప్పుడు నేను ఒద్దు ఒద్దంటుంటే 'కంపెనీ- కంపెనీ' అంటూ నాచేత తాగించావ్, తినిపించావ్. ఇప్పుడు ఆకలంటుంటే ఒక ముద్ద పెట్టవేరా-? అంటుంటే బలంగా నోటి మీద రెండు తగిలించి గేటవతలికి విసిరి గేటు మూసేశారు నౌఖర్లు!

పిచ్చిపిచ్చిగా అటూ ఇటూ తిరిగాక అప్రయత్నంగానే అతని కాళ్ళు ఇంటి వైపు నడిచాయ్. ఇంటికి తాళం వేసుంది. చుట్టూ తిరిగి ఇంటి వెనక్కి వచ్చాడు. ఎదురుగా నుయ్యి కనుపిస్తోంది. ఆగి లోపలికి తొంగి చూశాడు. ఇంట్లోని మనిషిని పిలిచినట్టు "సీతా"- అని పిలిచాడు మృదువుగా. అతని పిలుపు నూతిలో ప్రతిధ్వనించింది. నవ్వుకున్నాడు. "నువ్వు చిలిపిదానివి సీతా సీతా అని పిలిస్తే ఓ అనకుండా మళ్ళీ సీతా అంటావేం? పిల్లలు నిద్రపోతున్నారా? పోన్లే పడుకోనియ్. లేదు. ఈ లోకం వట్టి కుళ్ళుదనుకో....! తనతోపాటు సారా తాగిస్తుంది. సిగరెట్టు కాల్పిస్తుంది. కానీ తనతోపాటు ఒక ముద్ద ఉండ మాత్రం పెట్టదు. అందుకే సీతా ఈ లోకంలో ఉండలేదు. నువ్వే నయం నాకన్నా ముందు వెళ్ళిపోయావ్. నేను వచ్చేస్తాను సీతా వచ్చెయ్యనా మరి...." అంటూ నూతిలోకి తొంగిచూశాడు. సీత రెండు చేతులూ చాచి తనని పిలుస్తున్నట్టు అనిపించింది. పిల్లలు నాన్నా నాన్నా అని కేరింతలు కొడుతున్నారు. అతనిలోని పితృహృదయం మేల్కొంటూంది. రండి రండి వచ్చెయ్యండి అంటూ రెండుచేతులూ చాచి ఆహ్వానిస్తోంది. సీత, పిల్లలు పిలుస్తున్నారు. సీత పిలుస్తోంది.

"సీతా.... వచ్చేస్తున్నా....!" అంటూ ఒక్క కేక పెట్టి దబాల్న నూతిలోకి ఉరికేశాడు విశ్వం ఒంటరిగా.... "కంపెనీ" లేకుండా....!

---




రాత్రి 12 గంటలు కావస్తోంది. శేఖర్ గాంధీభవన్‌లో నాటకం చూసి ఇంటికి బయల్దేరాడు. ఎక్కడా ఏమీ చప్పుడు లేదు. అంతా నిర్మానుష్యంగా వుంది. చలికాలం కనుక ఎవరు బయటకు రావడానికి సాహసించినట్లు లేదు. మలుపు తిరిగి కొంత దూరం నడిచేసరికి ఎవరో స్త్రీ తనకంటే ముందు నడుస్తున్నట్టు గమనించాడు.

వెంటనే శేఖర్ అనేక విధాలుగా ఆలోచించసాగాడు. అనేక ప్రశ్నలు అతణ్ణి కలవరపెట్టాయి. 'ఎవరీమె? ఇంత రాత్రి రోడ్డుమీద ఒంటరిగా ఏమిటీ సంచారం!' శేఖర్‌కు ఆ స్త్రీ ప్రవర్తన మీద చాలా అనుమానం కలిగింది ఆమెను వెంబడించి ఎక్కడికి వెళ్తుందో చూడాలనుకున్నాడు. కాని అంతరాత్మ 'ఇది మంచిపనికాదు' అని ఉద్బోధించింది. కాని ఆమెను వెంబడించాలనే కోరిక అతనికి తెలీకుండానే బలపడింది. అకస్మాత్తుగా ఆ స్త్రీ ఎలా వుంటుందో చూడాలనే కోరిక కూడ కలిగింది.

శేఖర్ బ్రహ్మచారి. స్వేచ్ఛాజీవి. తన గదికి ఎప్పుడైనా వెళ్ళవచ్చు. 'ఎక్కడకి వెళ్ళావు?' అని అడిగేవారు ఎవరూ లేరు అతనికి. అందుకని ఎంత కష్టమైనా ఆమెను గురించి పూర్తిగా తెలుసుకోవాలనుకున్నాడు.

ఒక పరాయి మగవాడు తనను వెంబడిస్తున్నాడని గమనించినట్లుంది, ఆవిడ నడక వేగం పెంచింది.

శేఖర్‌కు- ఇది గమనించి ఇంకా ఉత్సాహం పెరిగింది. ధైర్యంకూడా హెచ్చయింది. చుట్టుపక్కల కూడ ఎవరూ లేరు.

పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడక వేగం పెంచి ఆమెను దాటి కొంత దూరం వెళ్ళాడు

వెనక్కు తిరిగాడు, ఆమెను చూద్దామని. ఆమె అకస్మాత్తుగా ఆగింది. కొంచెం తటపటాయించి మళ్ళీ ముందుకు నడిచింది.

శేఖర్ చూశాడు. ఆమె చాలా అందంగా వుంది. ఆమె ముఖంలో ఆందోళన, భయం వున్నట్లు గమనించాడు.

'ఆహా! ఎంత అందగత్తె ఈమె నా భార్య అయితే ఎంత బావుంటును' ఆశ చిందులువేసి పరుగులు తీసింది. మళ్ళీ వెంటనే 'ఛీ! ఒక బజారు స్త్రీని పెళ్ళిచేసుకోవడమా!' అంతరాత్మ ఆవేశంగా గద్దించింది.

ఈ అంతర్యుద్ధంతో శేఖర్ కొంచెం సేపు ఊగిసలపడినట్లు భావించాడు. ఇంతలో ఆ సుందరి శేఖర్‌ను దాటి సెలయేరు ప్రవాహంలా కదిలిపోయింది.

ఎదురుగా ఒక పోలీస్ కానిస్టేబిల్ వస్తున్నాడు. ఆమెను చూసి క్షణం ఆగాడు. శేఖర్‌ను చూసి మళ్ళా ఊరుకున్నాడు. శేఖర్‌కు దగ్గరగావస్తూ "పెళ్ళయిన కొత్తలో నాకు కూడా పెళ్ళాం పక్కన నడవాలంటే మహా చెడ్డసిగ్గేసేది" అని పళ్ళికిలించి వెళ్ళిపోయాడు.

ఇంతలో ఆ సుందరి, లకడీకాపూల్ చౌరాస్తా ఎడమచేతి పక్కనవున్న సందులో ప్రవేశించింది. పట్టువదలని విక్రమార్కుడిలా శేఖర్ కూడా వేగాన్ని పెంచి సందులోకి తిరిగాడు.

కొంతదూరం వెళ్ళిన తర్వాత ఓ ఇంటిముందు నిలబడి, వేసివున్న తలుపును కొద్దిగా నెట్టింది. తలుపు తెరుచుకుంది. ఆమె లోనికి వెళ్ళింది. తలుపు మూసింది.

'ఇప్పుదేం చేయాలి?' శేఖర్ తనను తాను ప్రశ్నించుకున్నాడు. అప్పుడు అతను తలుపుదగ్గర బయట నిలబడి వున్నాడు. ఏదో మూలుగు సన్నగా ఇంట్లోంచి అతనికి వినబడుతోంది. ఏమీ అర్థంకావడం లేదు. సమస్య మరీ జటిలమైపోతోంది.

ఏం చేయడానికి శేఖర్‌కు తోచడం లేదు. ఇంతలో తలుపు భళ్ళున తెరుచుకుంది. శేఖర్ గుండె దడదడ మంటూ విపరీతంగా కొట్టుకుంది. చలిలో కూడా అతనికి చెమటపడ్తోంది. ఆమె బయటకొచ్చి "ఒకసారి లోపలికి వస్తారా!" అని అడిగింది. ఇదే పగలు అయితే ఫరవాలేదుగాని రాత్రయిపోయింది. అన

ఖపరంగా ఈ వ్యవహారంలో తల దూర్చాను అని మధనపడసాగాడు.

"ఏమిటీ ఆలోచిస్తున్నారు. ఒక నిమిషం లోనికి రండి," ఎంతో మధురంగా వుంది ఆ కంఠం.

ఇక తప్పనిసరి అయింది. శేఖర్ లోనికి వెళ్ళాడు. అది ఒక చిన్నగది. ఒకే ఒక మంచంమీద ఓ ముసలాయన పడుకుని వున్నాడు. ఆఖరి క్షణాల్లో వున్నట్లున్నాడు.

"నాన్నగారూ! డాక్టరుగారు రేపు ఉదయం వచ్చి చూస్తానన్నారు. ప్రస్తుతానికి వీరిని మిమ్మల్ని చూడటానికి పంపించారు." అని తడబడుతూ అంది. 'తండ్రి ధైర్యం కోల్పోకుండా వుండటానికి తనను డాక్టరు పంపాడంటూ అబద్ధం ఆడుతోంది.' అని మనస్సులో అనుకున్నాడు శేఖర్

కొన్ని క్షణాలకు ఆ ముసలాయన ఎంతో నీరసంగా శేఖర్‌వంక చూసి దగ్గరకు రమ్మని సైగచేశాడు. తప్పనిసరిఅయి, శేఖర్ వెళ్ళి మంచంమీద ఓ ప్రక్కన కూర్చున్నాడు.

అప్పుడప్పుడూ కళ్ళు మూసుకుంటూ ఆగిఆగి మాట్లాడుతున్నాడు ఆయన.

"చూడు బాబూ, ఇంకా ఎంతోసేపు బ్రతకన్నేను మీ రెవరో సరిగా నాకు తెలియదు కాని నా ఆఖరి క్షణాల్లో మీరు నా సమీపంలో వున్నారు. బాబూ... నా ఒక్కగా నొక్క కూతురు చాల మంచిది. గుణవంతురాలు. స్వశక్తిమీద కష్టపడి చదివి బి.కామ్ వరకు చదివింది.

మాకు ఇక్కడ ఎవరూ లేరు మేము కలకత్తానుండి ఉద్యోగరీత్యా ఇక్కడకు సంవత్సరం క్రిందట వచ్చాం కొన్ని దురదృష్టకరమైన పరిస్థితుల్లో

"నాకు ఇక్కడకు రాగానే ఉద్యోగం ఊడింది తర్వాత నేను జబ్బుపడ్డాను. నా కూతురు అప్పట్నించీ ఒక తల్లిలా, ఒక దేవతలా నాకు సేవచేస్తూ ప్రయివేట్లు చెప్పుకుంటూ ఇంటిని నడుపుతోంది కాని నా కూతుర్ని ఒక యింటిదాన్ని చేసి తండ్రిగా నా బాధ్యత నెరవేర్చలేకపోయాననే బాధ నన్ను దహించివేస్తోంది" గొంతులో ఏదో అడ్డంపడుతున్నట్లు ఆయన ఇక ఆ తర్వాత మాట్లాడలేకపోతున్నాడు. మళ్ళీ చాలాసేపటికి ఇలా అన్నాడాయన

"చూడు బాబూ, నా కూతుర్ని నీ చేతుల్లో పెడ్తున్నాను. దాన్ని నీట ముంచినా, పాలముంచినా నీదే భారం." ఆయన కండ్లవెంట నీరు ధారగా కారిపోతోంది.

శేఖర్‌కు అంతా అయోమయంగా ఉంది. ఈ జరిగేదంతా కలో, నిజమో తెలియడంలేదు.

ఆమె శేఖరకు దగ్గరగా వచ్చింది. "చూడండి, మా నాన్నగారి మాటలు విని మీరు బాధపడవద్దు. నన్ను క్షమిం

చండి. మీరు నామీద దురభిప్రాయంతో నన్ను వెంబడిస్తున్నారు కనుక అసలు సంగతి మీకు తెలియాలని మిమ్మల్ని లోపలికి రమ్మన్నాను ఇక మీరు వెళ్ళవచ్చు. మీకు కలిగిన ఈ ఇబ్బందికి నన్ను మన్నించండి," ఎంతో గద్గద స్వరంతో అంది.

శేఖర్ కు ఎంతో సిగ్గనిపించింది. మనస్సు ఎందుకో బాధపడ్తోంది. ఆమె వంక ఒకసారి సూటిగా చూశాడు. 'ఎంత చక్కని ప్రతిమ' అనుకున్నాడు మనసులో ఆమెను తనదానిని చేసుకోవాలనే ఆరాటం మనస్సులో క్షణక్షణం అధికం కాజొచ్చింది.

"చూడండి మేడమ్ ! నా యీ ప్రవర్తనకు నేను సిగ్గుపడుతున్నాను. నా పేరు శేఖర్. ఇక్కడే, హైదరాబాదు లోనే L I C.లో అసిస్టెంట్ గా పని చేస్తున్నాను. ఈ జరిగిందంతా చూస్తూ వుంటే దేవుడే మనల్ని ఇలాగ కలిపాడేమో అని అనిపిస్తోంది మీరు అంగీకరిస్తే మిమ్మల్ని పెళ్ళిచేసుకుందామనుకుంటున్నాను," అన్నాడు శేఖర్ తడబడుతూ.

ఆమె శేఖర్ వంక విచిత్రంగా చూసింది. ఇద్దరూ ముసలాయనవంక చూశారు ఆయన కళ్ళు తేలవేశాడు. వెర్రిచూపులు చూస్తున్నాడు ఇద్దరూ కంగారుగా ఆయనకు దగ్గరగా మంచం మీద కూర్చున్నారు

ఆయన ఎంతో కష్టంమీద కూతురి చేతిని తీసికొని శేఖర్ చేతిలో పెట్టి ఏదో చెప్పబోయి అలానే కొన్ని క్షణాల్లో ప్రాణాలు వదిలాడు

"నాన్నా!" అని బిగ్గరగా అరచి విపరీతంగా ఏడవసాగింది శేఖర్ ఆమెను లేవనెత్తి ఓదార్చడానికి ప్రయత్నం చేశాడు. "నాన్నా! ఒంటరి దాన్ని చేసిపోయావా! నా కెవరు దిక్కు-" అని వెక్కి-వెక్కి ఏడుస్తోంది

"చూడండి! మీరు దుఃఖించకండి. మీకు అండగా జీవితాంతం నేను వుంటాను. మిమ్మల్ని నాదానిగా చేసుకుంటాను ఇదే నా ప్రమాణం," అని ఆమె చెయ్యి పట్టుకున్నాడు శేఖర్

ఎంతో కష్టంమీద దుఃఖాన్ని దిగమ్రింగి "ఏమండీ, భగవంతుణ్ని నేను చూడలేదుగాని, మిమ్మల్ని చూశాక సాక్షాత్తూ మీరే భగవంతుడు అనే నమ్మకం కలుగుతోంది. నా జన్మంతా మీకు దాసిలా మీ కాళ్ళదగ్గర పడివుంటాను" అని అతని కాళ్ళను పట్టుకుంది ఆనంద బాష్పాలు అతని కాళ్ళను తడిపేశాయి

శేఖర్ ఆమెను పైకి లేవనెత్తి కళ్ళు తుడిచాడు ఆ సమయంలో కూడా దూరంగా ఎక్కడో చర్చిగంటలు వినబడ్తున్నాయి

———




(గత సంచిక తరువాయి)

**38**

మాఘమాసం సాయంత్రం అయ్యే సరికి చలిగాలులు వీస్తున్నాయి.

లక్ష్మి శాలువా కప్పుకొని, వరండాలో వాలు కుర్చీలో కూర్చుని వుంది. మధ్య మధ్య దగ్గుతూవుంది.

శాంతి పక్కింటి తనయీడు పిల్లలతో తొక్కుడుబిళ్ళ ఆడుతోంది. ఆడుకుంటూన్న శాంతిని పరిశీలనగా చూస్తోంది లక్ష్మి.

'శాంతి పెద్దదౌతోంది' అనుకుంది కూతురుని చూసుకొని లక్ష్మి.

నాయనమ్మ పట్టుచీర చింపి లంగా, జాకెట్టూ కుట్టింది లక్ష్మి. అవే కట్టుకొంది శాంతి. వాలుజడ వేసుకొని జడగంటలు పెట్టుకుంది. నెత్తిన బిళ్ళ పెట్టుకొని

ని. యస్. రావు & శివదత్త్ :

# జూన్ నెల యువ
# భావ పరిచయ పోటీ
## బహుమానము రూ 25-00




ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

*గమనిక :* వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి జూన్ 10వ తేదీలోగా పంపవలెను.

పడిపోకుండా జాగ్రత్తగా శాంతి ఒక గదిలోంచి మరో గదిలోకి నేర్పుగా గెంతుతూ వుంటే, కూతురు నేర్పునూ ఓర్పునూ చూసి లక్ష్మి మురిసిపోతోంది.

తల్లి కళ్ళకి శాంతి వెన్నముద్దలా అనిపించింది.

ఇంతలో కృష్ణమరాయుడు బయట నుంచి వచ్చి, లక్ష్మి పక్కనే మరో కుర్చీ లాక్కొని కూర్చున్నాడు.

"అబ్బాయి ఎప్పుడు వస్తాడట?" అంది లక్ష్మి కృష్ణమరాయుడితో.

"వచ్చే వారం వస్తాడు. రమ్మని ఉత్తరం రాసానుకూడా" అన్నాడు కృష్ణమరాయుడు.

"డబ్బు పంపించారా?"

"ఆc! కాకపోతే కాస్త ఆలశ్యమైంది."

"వాడు చదువుకి ఎదిగేసరికి మనకి డబ్బు యిబ్బంది కూడా పెరిగింది."

'ఆ విషయాలన్నీ నీకెందుకు? నేను చూసుకుంటాను కదా" అని అక్కడ నుంచి లేచి వెళ్ళిపోయాడు కృష్ణమరాయుడు.

డబ్బు విషయం ఎత్తి భర్తను నొప్పించినందుకు బాధపడింది లక్ష్మి.

నాగార్జున ఎనిమిదవ తరగతి చదువుతున్నాడు పట్నంలో.

శాంతి ఊళ్ళోనే అయిదవ తరగతి దాకా చదువుకొని మానేసింది. యింటి దగ్గర, పూర్ణయ్యగారి దగ్గర భారత భాగవతాలూ, రామాయణం చదవడం నేర్చుకొంటోంది.

శాంతి వయసు పదిహేను. నాగార్జున వయసు పదమూడు.

శాంతికి పెళ్ళీడు వచ్చింది.

నాగార్జున చదువుకు ఎదిగాడు.

ఉన్న పరిస్థితులను బట్టి ప్రస్తుతం యీ రెండూ సమస్యలేనని లక్ష్మి మధన పడుతూవుంటుంది.

కృష్ణమరాయుడు యివేమీ పట్టించుకోక అన్నింటికీ ఆ దేవుడే వున్నాడన్న విశ్వాసంతో రోజులు దొర్లించేస్తాడు.

భూములమీద వచ్చే ఆదాయంతో సంసారం గడవడం లేదు. ఏ ఖర్చురో తగ్గక పోవడంతో యేటా ఎంతో కొంత భూమిని అమ్మక తప్పడంలేదు. చేసిన అప్పులు తీర్చకపోవడంతో ఎప్పుడూ అప్పులు యిచ్చేవాళ్ళను కూడా అడగడానికి మొహమాటపడుతున్నాడు కృష్ణమరాయుడు.

లేమిని చూసి జాలిపడడమే తప్ప లేమిని ఏనాడూ అనుభవించని కృష్ణమరాయునికి లేమి యిప్పుడిప్పుడే అనుభవంలోకి వస్తోంది. యిబ్బందులు పెరగడంతో అప్పుడప్పుడు కాస్త చికాకు కలుగుతోంది.

ఇటువంటి పరిస్థితులలో లక్ష్మి జబ్బు పడింది. ఊళ్ళోని వైద్యుడు వారం పది రోజులు మందులిచ్చి చివరికి పట్నం తీసుకువెడితే మంచిదేమో బాబూ' అని

సలహాయిచ్చాడు కృష్ణమరాయునికి. తల్లి ఆరోగ్యం బాగాలేదని ఆగిపోయాడు నాగార్జున.

"అదే మంచిది నాన్నగారూ" అన్నాడు నాగార్జున.

శాంతికి తల్లిని పట్నం తీసుకువెళ్ళాలని వైద్యుడు అన్నమాటలు విన్నప్పటి నుంచీ ఏదో భయంపుట్టింది. అనుకోకుండా శాంతికళ్ళు చెమ్మగిలాయి.

ఎవరికీ కనపడనీయకుండా చాటుకు వెళ్ళి కళ్ళువత్తుకుంది.

అది గమనించిన పూర్ణయ్య ఆమెతోబాటే లోపలికి వెళ్ళి 'భయంలేదమ్మా. ఆయుర్వేదం మందుకంటే ఇంగ్లీషు మందైతే త్వరగా వ్యాధి తగ్గుతుంది కదా అని అలా సలహా యిచ్చాడు వైద్యుడు. అమ్మ దగ్గుతో బాధపడుతోంది కదా అని ధైర్యం చెప్పాడు శాంతికి. శాంతి కళ్ళువత్తుకొని "నాన్నగారి దగ్గర డబ్బువుందో లేదో ?" అంది.

ఆడపిల్లలు శారీరకంగా త్వరగా ఎదగడమే కాకుండా, మానసికంగాకూడా మగవాడి కంటే త్వరగా ఎదుగుతారు కాబోలు అనుకున్నాడు పూర్ణయ్య.

"ఆ విషయాలన్నీ నీ కెందుకమ్మా పెద్దవాళ్ళం, మేము చూసుకుంటాం కదా" అని చెప్పి బయటకొచ్చాడు. వైద్యుడు కృష్ణమరాయునితో మాట్లాడి బయటకి అప్పుడే వెళ్ళాడు.

"ఏమంటాడు" అన్నాడు పూర్ణయ్య.

"ఏముందీ దగ్గు తగ్గడంలేదు కదా ఓ సారి పెద్ద డాక్టరుచేత పరీక్ష చేయిస్తే మంచిదీ అంటాడు" అన్నాడు కృష్ణమరాయుడు.

"ఎప్పుడు బయలుదేరుదాం ?"

"రెండుమూడు రోజుల్లో మంచిరోజు చూసుకొని బయలుదేరుదాం" అన్నాడు కృష్ణమరాయుడు.

"వ్యాధి విషయంలో ఉపేక్షించడం మంచిది కాదు. అనుమానం తీరిపోతే అందరికీ ధైర్యంగా వుంటుంది. ఈ రోజునే బయలుదేరుదాం." అన్నాడు పూర్ణయ్య.

"అయితే వుండండి" అని కృష్ణమరాయుడు లోపలికి వెళ్ళి చంద్రహారం తీసుకువచ్చాడు.

పూర్ణయ్య చేతిలో పెట్టాడు.

"ఇదేమిటి బాబూ ?" అన్నాడు పూర్ణయ్య ఆశ్చర్యంగా.

"ఎక్కడేనా తాకట్టుపెట్టి డబ్బుతీసుకు రండి" అన్నాడు కృష్ణమరాయుడు.

"నా చేతుల మీదుగా యీ పని చేయడం...." అని సంకోచించాడు పూర్ణయ్య.

"చూడండి పూర్ణయ్యగారు. వస్తు వాహనాలూ, ఆస్థిపాస్తులూ మనిషి సంపాదించుకున్నవి మనిషి పుట్టినప్పుడు వెంట పుట్టినవి కావు. అక్కరకు రాని వస్తువులు దేనికి ? సంకోచించక ఎవరి దగ్గరేనా తాకట్టుపెట్టి డబ్బు తీసుకురండి."

"ఇంత పెద్ద వస్తువు నాకు లేదని యీ వూరివారందరికీ తెలుసు. నేను యీ వస్తువు తీసుకొని ఎవరి దగ్గరకు వెళ్ళినా యిది మీ వస్తువే అనుకుంటారు. ఉన్న వూళ్ళోనే యీ పనిచేయడం కంటే, ఎలాగూ పట్నానికి వెడుతున్నాం గనుక - అక్కడే ఏ మార్వాడీ దగ్గరో తాకట్టుపెడదాం. అందాక నా దగ్గర కొంత డబ్బు వుంది. పదండి బయలు దేరుదాం. బండి కట్టమనండి" అన్నాడు పూర్ణయ్య.

లక్ష్మిని తీసుకొని పూర్ణయ్య, కృష్ణమరాయుడు, నాగార్జున బయలుదేరారు. శాంతిని యింటిదగ్గరే వుండమన్నారు.

పట్నానికి తీసుకువెళ్ళారు లక్ష్మిని.

పెద్దడాక్టరుకి చూపించారు. పరీక్షలు రెండు మూడు రోజులు పట్టాయి.

చివరికి పెద్ద డాక్టరు లక్ష్మికి క్షయ అని నిర్ధారణచేసాడు. ఆ రోజుల్లో క్షయ అంటే గడ్డువ్యాధికిందే లెక్క.

హాస్పటల్‌లోనే వుంచమన్నాడు పెద్ద డాక్టరు లక్ష్మిని.

లక్ష్మి హాస్పటల్‌లో వుండడానికి అంగీకరించలేదు.

డాక్టరుగారికి నచ్చజెప్పి, వారం వారం వస్తామని చెప్పి, తమ వూళ్ళోనే డాక్టరుగారు రాసిచ్చిన మందులు వాడతామని మాటయిచ్చి తిరిగి యింటికి బయలు దేరారు.

వీధివాకిట్లో బండి ఆగేసరికి, శాంతి ఆత్రుతగా బండిదగ్గరకు పరుగెత్తింది.

"కంగారు పడక్కర్లేదమ్మా. తగ్గిపోతుందన్నారు డాక్టరుగారు. అమ్మకి వేళకి మందులు యిస్తూ జాగ్రత్తగా చూసుకోవాలి నువ్వు" అని ధైర్యం చెప్పాడు పూర్ణయ్యగారు.

లక్ష్మిని లోపలకు తీసుకువచ్చి, డాక్టరుగారు చెప్పిన ప్రకారం, గాలీ వెలుతురూ బాగావచ్చే గదిలో పక్కవేసి పడుకోబెట్టారు.

డాక్టరుగారు చెప్పినట్లు మందులు వాడుతున్నారు. నాగార్జున తల్లికి ఆరోగ్యం బాగోకపోవడంతో చదువుకు పట్నానికి వెళ్ళలేదు. వెళ్ళమని కృష్ణమరాయుడు కూడా నొక్కి చెప్పలేదు.

శాంతి, నాగార్జున లక్ష్మిని కంటికి రెప్పలా చూసుకుంటున్నారు. శాంతికి చిన్నతనమే అయినా తల్లిని కన్నతల్లిలా చూసుకుంటోంది.

రోజులు గడ్డుగా గడుస్తున్నాయి లక్ష్మికి. బాధ భరించడం కష్టంగా వుంటోంది. పిల్లలు భయపడతారని, లేని శక్తినీ, ఓపికనూ తెచ్చుకొని మొండిగా ఎదుర్కొంటోంది వ్యాధిని.

మనిషి బాగా క్షీణించిపోతోంది. మంచంమీంచి లేవడం లేదు.

ఓరోజు రాత్రి బాగా నిద్దరపట్టింది లక్ష్మికి. నిద్దట్లో ఒక పీడకల. కల నిజంలాగానే జరిగిపోతోంది.

చిగురుటాకులాంటి సున్నితమైన లక్ష్మి సౌందర్యానికి నిరంతరం తోడు లక్స్.

చిగురుటాకుమల్లె ఆ సున్నితమైన రూపం అ అందం లక్ష్మికి సొంతం. ఆమె చర్మ సౌందర్యనికి లక్స్ తోడు.

"ఒక్క లక్స్ మాత్రమే నా సౌందర్యాన్ని అలా మృదువుగా అందంగా ఉంచేది" అని లక్ష్మి అంటునే ఉంటుంది.




HTB-HLL-5553

శుద్ధమైన, సౌమ్యమైన లక్స్—
సినిమా తారలకు
సౌందర్యాన్నిచ్చే సబ్బు

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్
వారి విశిష్ట ఉత్పాదన

తన బిడ్డలిద్దరూ దిక్కులేనివాళ్ళు అయిపోయారు. తాను చనిపోయింది. కృష్ణమరాయుడు తాను పోయిన నాటినుంచీ యింటినీ, పిల్లలనూ పట్టించుకోకుండా ఆలయంలోనే వుండిపోయాడు. ఆస్తంతా అప్పులవాళ్ళు వేసుకు పోయారు. ఉండటానికి యిల్లు కూడా లేదు. శాంతి, నాగార్జున తమ వూరి సత్రవులో భోజనంచేసి బతుకుతున్నారు. బట్టలు చిరిగిపోయాయి. చింపిరి తలలు.

ఆ స్థితిలో రాధ చూసింది యిద్దరు పిల్లలనీ. తనవెంట యింటికి తీసుకు వెళ్ళింది. తలంటు పోసింది. కొత్త బట్టలు యిచ్చింది. భోజనం పెట్టింది. కన్నతల్లిలా సాకింది యిద్దరినీ—

చటుక్కున కల చెదిరిపోయి మెళకువ వచ్చింది లక్ష్మికి. తానింకా బతికే వుంది.

'యీ కల నిజం కాబోదు గదా' అనుకుంది. 'ఒకవేళ యీ కలే నిజమైతే రాధ అంతటి మంచి మనసు గలదే' అని కూడా అనుకుంది.

"అమ్మా శాంతీ" అని పిలిచింది లక్ష్మి.

ఆమె మంచం పక్కనే కుర్చీలో నడుంవాల్చిన శాంతి వులిక్కిపడి "పిలిచావా అమ్మా" అంది.

"ఔనమ్మా! టైము ఎంతైంది ?"

"పన్నెండు దాటిందమ్మా" అంది శాంతి

"నాన్నగారు పడుకున్నారా అమ్మా ?"

"లేదమ్మా. డాక్టరును కలసివస్తానని పట్నానికి వెళ్ళారు."

"నా జబ్బుతో ఆయనకి మనశ్శాంతి లేకుండా పోతోంది. నువ్వూ తమ్ముడూ భోజనాలు చేసారా అమ్మా."

"చేసామమ్మా."

"కాగితం పెనిసిలు పట్టుకురా అమ్మా"

"ఇప్పుడెందుకమ్మా? ఏం రాస్తావు?"

"ఎదురు ప్రశ్నలు వెయ్యకమ్మా. సమాధానం చెప్పే ఓపిక లేదు. సమాధానం చెబితే దగ్గు వస్తుంది" అంది లక్ష్మి.

శాంతి బదులుచెప్పకుండా లోపలి గదిలోకి వెళ్ళి కాగితం, పెన్సిలూ తెచ్చింది.

"ఇందు" అంటూ అమ్మకి యిచ్చింది.

ఓపిక తెచ్చుకొని దిండ్లకు జారబడి కూర్చుంది లక్ష్మి. ఏదో నాలుగు మాటలు రాసి కాగితం మడిచి చేతపట్టుకుంది.

"అమ్మా. ఒక్కసారి తమ్ముడిని లేపుతావా ?" అంది లక్ష్మి శాంతితో.

"అలాగే," అని చెప్పి నాగార్జునను లేపింది శాంతి.

నాగార్జున వళ్ళు విరుచుకుంటూ "ఎందుకక్కా ఇంత రాత్రివేళ నన్ను లేపుతావు," అంటూ లేచాడు.

"అమ్మ పిలుస్తోందిరా" అంది శాంతి.

"ఎందుకూ ?" అంటూ లేచి శాంతి వెంట అమ్మ దగ్గరకు వచ్చాడు నాగార్జునుడు.

"యిలా. నా పక్కలో కూర్చో బాబూ" అంది లక్ష్మి.

నాగార్జున తల్లి పక్కలో కూర్చు న్నాడు.

కొడుకుచేతిని తన చేతిలోకి తీసు కుంది లక్ష్మి. "బాబూ ఓ చిన్నపని చేసి పెడతావా?" అంది.

"చెప్పమ్మా, ఏం చేయమంటావు?" అన్నాడు నాగార్జున.

"ఏంలేదు బాబూ - యీ ఉత్తరం తీసుకువెళ్ళి రాధకు యిచ్చి రావాలి బాబూ."

"అవి దెవరో, ఎక్కడుంటుందో నాకు తెలీదు" అన్నాడు నాగార్జున కాస్త విసురుగా.

"నీకు తెలియకపోయినా ఫరవాలేదు. ఆమెకు నువ్వు తెలుసు. బయట కొండయ్య వున్నాడు. అక్క లేపి నీ వెంట జతపంపుతుంది. వెళ్ళి యీ వుత్తరం యిచ్చిరా బాబూ."

"పొద్దున్న యివ్వొచ్చుగా" అన్నాడు బుంగమూతి పెట్టి.

"అలాకాదు బాబూ! నా మాట విని, యిప్పుడే యిచ్చిరా."

"కొండయ్యనే పంపొచ్చుగా" అన్నాడు నాగార్జున తనకు వెళ్ళడం యిష్టంలేదన్న భావాన్ని వ్యక్తంచేస్తూ.

"అలా అనకు బాబూ! ఇంకెప్పుడూ నీకు ఏ పనీ చెప్పనురా! యిదే నేను చెప్పే ఆఖరు పని. నిన్ను వెళ్ళదగిన

చోటుకే పంపుతున్నానుగాని,వెళ్ళకూడని చోటుకి పంపటంలేదురా" అంది లక్ష్మి బతిమాలుతున్న ధోరణిలో

అప్పటికే తల్లి అన్న మాటలకు శాంతి గొంతు ఏడుపుతో పూడుకుపోయింది

"అమ్మ చెబుతోంటే ఏమిట్రా ఆ పట్టుదల నువ్వు వెళ్ళకపోతే అమ్మ దగ్గర వుండు నేనే వెళ్ళివస్తాను" అంది శాంతి కోపంగా

"నువ్వెందుకు యింత రాత్రివేళ నేనే వెడతా" నంటూ లేచి కొండయ్యను వెంటతీసుకొని రాధ యింటికి బయలుదేరాడు నాగార్జున

ఇద్దరూ రాధ యిల్లు చేరుకున్నారు కొండయ్య తలుపు తట్టాడు

భీముడు తలుపు తీసాడు

"రాధమ్మను ఓసారి పిలు భీముడూ" అన్నాడు కొండయ్య

మాటలు అలికిడికి మెళకువలోకి వచ్చిన రాధ "ఎవరూ" అంటూ గుమ్మందగ్గరకు వచ్చింది

"నేనమ్మా! కొండయ్యను అమ్మగారు బాబును పంపించారు ఎందుకో" అన్నాడు కొండయ్య

ఎదురుగా వున్న నాగార్జునను చూసి "నాగార్జున బాబా! లోపలికిరా బాబూ" అంది ఆప్యాయంగా రాధ

"నేను రాను మా అమ్మ యీ వుత్తరం మీ కిమ్మంది" అని అమ్మ యిచ్చిన వుత్తరాన్ని ఆమె చేతిలో పెట్టి ఒక్క క్షణం కూడా నిలబడకుండా "పద కొండయ్యా" అని తిరుగుముఖం పట్టాడు నాగార్జున

వాళ్ళు వెళ్ళినవైపే కాసేపు చూసి లోపలికి వెళ్లి తలుపు మూసింది రాధ.

ఇంత రాత్రివేళ వుత్తరం పంపించారు ఏమై వుంటుంది చెప్మా వారికి వంట్లో ఎలా వుందో అనుకుంటూ ఆ ఉత్తరంలో ఏమి చదవాల్సివస్తుందోనని భయపడుతూ వుత్తరం మడత విప్పింది రాధ

పెన్సిలుతో రాసిన రాతమూలంగా అంత బాగా కనిపించడంలేదు దీపం దగ్గరకు వెళ్ళి పరిశీలనగా వుత్తరం చూసింది

"అక్కా!" అని చదివింది

లక్ష్మి నోరారా తనని "అక్కా!" అని పిలిచినట్లే అనిపించింది

కళ్ళలో నీళ్ళునిండాయి

కష్టంమీద మిగిలిన ఉత్తరం చదివింది

"ఇకనుంచి శాంతికీ నాగార్జునకు నువ్వే అమ్మవి" అని మాత్రమే రాసింది లక్ష్మి

ఆ వాక్యం చదివిన తరువాత రాధకు ఎంత ఆపుకుందామన్నా ఏడుపు ఆగలేదు భోరున ఏడ్చేసింది

"ఏమైందమ్మా?" అంటూ భీముడు రాధను అడిగాడు

"లక్ష్మిగారికి జబ్బు బాగా ఎక్కువగా వున్నట్లుంది మావయ్యా వెంటనే బయలుదేరు ఒక్కసారి చూసివద్దాం" అని తొందరచేసింది భీముడుని రాధ

ఇద్దరూ అంత చీకట్లో, అంత రాత్రి వేళ కృష్ణమరాయుని యింటివైపు బయలుదేరారు

అప్పటికే పూర్ణయ్య వచ్చి లక్ష్మి మంచంపక్కనే కూర్చుంటూ "అమ్మకి ఎలా వుందమ్మా?" అంటూ శాంతిని పలకరించారు

"అలాగే వుందండి" అంది శాంతి

"ఎందుకో ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదమ్మా ఓ సారి అమ్మని చూసివెడదామని యిటు వచ్చాను ఎంత రాత్రయినా తప్పకుండా వస్తానన్నారు నాన్నగారు యింకా రాలేదనుకుంటాను" అన్నాడు పూర్ణయ్య

"రాలేదండి" అంది శాంతి

అప్పటికే ఉత్తరం యిచ్చివచ్చిన నాగార్జున నిద్రపోతున్నాడు మళ్ళీ

ఇంతలో కృష్ణమరాయుడు వచ్చాడు "మీరొచ్చారేమిటి? ఎలావుంది లక్ష్మికి" అన్నాడు కాస్త కంగారుగా కృష్ణమరాయుడు

"అబ్బే వూరికినే వచ్చాను ఏమన్నారు డాక్టరుగారు" అన్నాడు పూర్ణయ్య

"ఫరవాలేదు మందులు వాడండి అన్నారు" అంటూ కృష్ణమరాయుడు లక్ష్మి మంచంమీదనే కూర్చున్నాడు

"వచ్చారా" అంది లక్ష్మి నీరసంగా

"నిద్రపట్టలేదా?" అన్నాడు కృష్ణమరాయుడు

"పడుతోంది_ మెలకువ వస్తోంది మీరు భోజనంచెయ్యండి"

"చేసే వచ్చానులే నిద్రపో"

"నిద్ర మాటకేంగాని_ శాంతి పెళ్ళి సంగతి ఆలోచించండి"

"బాగానే వుంది! నీకిలా వుంటే శాంతి పెళ్ళికి తొందరొచ్చిందా నీకు తగ్గనీ శాంతి పెళ్ళి ఎంతసేపు?" అన్నాడు కృష్ణమరాయుడు

భీముడూ రాధ పెరటివైపు ద్వారం గుండా లోపలికి అడుగుపెట్ట బోతూ వుండగా, కృష్ణమరాయుని మాటలు విన పడ్డాయి రాధ భీముడ్ని అంది ఇద్దరూ యింటికి తిరిగివెళ్ళిపోయారు

పూర్ణయ్య కాసేపు వుండి యింటికి వెళ్ళిపోయాడు కృష్ణమరాయుడు శాంతిని మంచినీళ్ళు యిమ్మని తాగి లక్ష్మి మంచం పక్కనేవున్న కుర్చీలో నడుం వాల్చాడు

తెలతెలవారుతోంది

శాంతి మందు యివ్వడానికి తల్లిని లేపింది లక్ష్మి కదలలేదు

శాంతికి భయమేసి "నాన్న నాన్నా" అంటూ కృష్ణమరాయుడ్ని లేపింది

"ఏమిటమ్మా" అంటూ లేచాడు

"అమ్మ ఎంత పిలిచినా లేవడంలేదు" అంది శాంతి కంగారుగా

కృష్ణమరాయుడు లక్ష్మిని ఒక్క-క్షణం పరిశీలనగా చూసి నిట్టూర్చాడు

"అమ్మ లేదమ్మా మీకింక" అని లక్ష్మి ముఖంమీద దుప్పటి కప్పాడు

శాంతి భోరున ఏడుస్తూ తల్లి మీద పడిపోయింది ఆ ఏడుపుకు వులిక్కిపడి నాగార్జున లేచాడు

లక్ష్మి మరణవార్త వూరంతా పాకింది

ఆ వ్రపాస్తుఖ తగ్గినా ఆ యింటిమీద వున్న గౌరవంతో పేదాసాదా అంతా వచ్చారు పూర్ణయ్య దగ్గరవుండి జరగాల్సిన తతంగం జరిపిస్తున్నాడు కృష్ణమరాయుడు చలనంలేని రాయిలా ఓ మూల కూర్చున్నాడు

జనంలో చాటుగా నిలబడి అంతా చూస్తోంది రాధ చివరిసారిగా లక్ష్మిని యిలా చూడాల్సివచ్చినందుకు లోలోపలే కుళ్ళికుళ్ళి ఏడ్చింది కృష్ణమరాయుడ్ని చూసి ఆమె గుండె తరుక్కుపోతోంది కాని దగ్గరకు వెళ్ళి పలకరించలేదు పలకరిస్తే ఏమంటాడోనని భయం

శవం వెళ్ళిపోయింది వెంట కృష్ణమరాయుడూ మిగిలిన మగవాళ్ళూ వెళ్ళిపోయారు

ఆడవాళ్ళు శాంతిని ఓదారుస్తున్నారు బాగా జనం తగ్గేదాకా ఓ మూలగావున్న స్తంభానికి ఆనుకొని నిలబడింది రాధ

చివరకు శాంతి దగ్గరకు వెళ్ళింది

"అమ్మా" అంది శాంతిని

శాంతి రాధను గట్టిగా కౌగలించుకొని ఏడ్చేసింది రాధను లోపలి గదిలోకి తీసుకుని వెళ్ళి "అమ్మ యీ పొట్లం నీ కిమ్మంది" అంటూ రాధ చేతిలో పెట్టింది

పొట్లం బరువుగా వుంది రాధ విప్పలేదు కాసేపు నిలబడి, శాంతిని ఓదార్చి కృష్ణమరాయుడూ పెద్దలూ వచ్చేవేళ అయిందని యింటికి తిరిగివచ్చేసింది

ఇంటికి వచ్చి పొట్లం విప్పిచూసింది మంగళసూత్రాలు లక్ష్మి మంగళసూత్రలు-ఒక ఉత్తరం

ఉత్తరం విప్పిచూసింది రాధ

"అక్కా ! నాకోసం నువ్వు ఏమి త్యాగంచేసావో నాకు మొదట తెలీదు అత్తయ్య చెప్పాక తెలిసింది నీ రుణం తీర్చుకోలేను ఇక యివి నీవే

నీ చెల్లెలు

లక్ష్మి"

ఆ ఉత్తరం చదువుకొని రాధ ఏడుస్తూ నిలచివున్నచోటనే కుప్పలా కూలిపోయింది

## 39

కాశీనుంచి ఎవరో స్వామీజీ వచ్చారు మాధవగిరికి- కృష్ణమరాయుని పేరు ప్రఖ్యాతులూ ధర్మనిరతి విని వచ్చామని ఆ స్వామీజీ అన్నారు మాధవగిరి వేణుగోపాలస్వామి ఆలయంలో యాగం తలపెట్టి వచ్చానని ఆయన అన్నారు

కృష్ణమరాయుడు వెనుకముందులు ఆలోచించకుండా అంతటి మహాను

భావుడు రావడమే చాలని యాగానికి ఏర్పాట్లన్నీ చేయించాడు ఆ యాగం దాదాపు పదిహేనురోజులు దబ్బాలతో ఆవునెయ్యి, మంచి గంధపుచెక్కలు- పూజాద్రవ్యాలూ, రోజూ హరికథా కాలక్షేపం- ఆ చుట్టుప్రక్కల అనేక వేద పండితుల రాక- వారికి కావలసిన భోజన వసతి సదుపాయాలూ రోజూ మూడు వేళలా పూజాపునస్కారాలు వూరంతా ఎంతో హడావిడిగా వుంది

లక్ష్మి పోయి అప్పటికి ఆరుమాసాలు కావస్తోంది ఆ బాధను మరచిపోవడానికి ఆ మహాయాగం కృష్ణమరాయునికి ఎంతగానో తోడ్పడింది శాంతి కూడా రోజూ ఆలయానికి వస్తోంది

నాగార్జున మాత్రం పట్నంలోనే చదువుకుంటున్నాడు యాగానికి రాలేదు

“అంత ఖర్చు ఎలా భరిస్తున్నాడో కృష్ణమరాయుడు” అని అనుకోనివారు లేరు

ఎప్పటిలాగే ఎవరినీ చందాలు అడగకుండా తన ఒక్క చేతిమీద యాగాన్ని నడుపుతున్నాడు కృష్ణమరాయుడు

అందరికంటే కృష్ణమరాయుని గురించీ ఆ యాగం గురించి ఆలోచిస్తున్న వ్యక్తి రాధ వారి కుటుంబ పరిస్థితి రాధకు తెలుసు ఇంత ఖర్చు యాగంకోసం జరుగుతోందీ అంటే అది ఎక్కడో ఎవరిదగ్గరో కృష్ణమరాయుడు చేసిన అప్పేనవి కూడా తెలుసు అప్పుచేసి దైవకార్యం జరిపిస్తున్నందుకు రాధ బాధపడలేదు ఈ అప్పులు యిలా పెరిగి చివరికి శాంతి పెళ్ళికి, నాగార్జున చదువుకి ఏమీ మిగలకుండా పోతుందేమోనన్నదే ఆమె భయం అయినా తాను చేయగలిదింది ఏమీలేదు

తనదగ్గర యిక మిగిలినవి మూడే వస్తువులు- తానూ కృష్ణమరాయుడూ కలవడానికి కారణమైన పులిగోరు పతకం- కృష్ణమరాయుని తాను దూరం చేసుకుందుకు కోరి తెప్పించుకున్న హంస మంజీరాలూ-, చివరి ఘడియల్లో లక్ష్మి తనకు యిచ్చిన మంగళసూత్రాలు వీటిని తను ఎట్టి పరిస్థితులలోనూ వదులుకోలేదు తన ప్రాణానికి ప్రాణం అవి

అమ్మ యిచ్చిన యిల్లు వుంది దేవుడి పేరుమీద ఏనాడో కృష్ణమరాయుని తాతగారు యిచ్చిన మాన్యం వుంది అవి తాను యిచ్చినా కృష్ణమరాయుడు స్వీకరించరు పైగా అవమానంగా భావించి బాధపడినా ఆశ్చర్యంలేదు వారిది ఎంతసున్నితమైన మనసో తనకు తెలుసు. అందుకే ఏమీ చేయలేక జరుగుతున్న క్రతువును కళ్ళప్పగించి చూస్తూ ఆ పుణ్యకార్యమే వారి కుటుంబాన్ని కాపాడాలని వేయి దేవుళ్ళను మొక్కుకుంది రాధ (సశేషం)

Printed and Published by A Chandra Seker Rao at 5 9 88 Public Garden Road Hyderabad for YUVA Publications and Printed at Dolton Press Public Garden Road Hyderabad 500 001 Editor A SUDHAKARA RAO

"శ్రమ...శ్రమ...
శ్రమా... అంటే?"

"అంటే,
విజయస్ప్రేతో నీవు
ఏడు నెలలు ఎదిగావన్నమాట"






విజయస్ప్రే, మాంసకృత్తులు, విటమిన్లు మరియు ఖనిజపదార్థాలతో సమ్మిళితమైన శిశు ఆహారం. తేలికగా జీర్ణం కాగలదు. సులభంగా నీటిలో కరుగగలదు. ఆరోగ్యసూత్రాలకు అనుగుణంగా తయారు చేయబడింది. విజయస్ప్రేను చాలా సులభంగా కలుపుకోవచ్చు. అంతర్జాతీయ ప్రమాణాలకు అనుగుణంగా తయారు చేయబడిన విజయస్ప్రే భారతదేశపు పసి పాపలకు చాలా అనువైన శిశు ఆహారం. విజయస్ప్రే తల్లి పాలవలె తియ్యగా ఉండేట్లు తయారుచేయబడింది.
అవును. మీ పాప ఆరోగ్యానికి డాక్టర్లు సిఫారసుచేసే శిశు ఆహారం...విజయస్ప్రే!

# విజయస్ప్రే

కన్నతల్లి అనురాగానికి
ప్రతిరూపం

ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి
కార్పొరేషన్ లిమిటెడ్ వారి
ఒక శ్రేష్ఠమైన ఉత్పన్నం
(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ
యాజమాన్య సంస్థ)

అమ్మకందార్లు:
స్పెన్సర్ & కం. లిడ్.

FDS APDDC 3071A TE'

